# భారతి చందాదారుల కొక ముఖ్యమైన విజ్ఞప్తి

—



ఈ దిగువ నమోదుపఱచినసంఖ్యలుగల చందాదారులచందాలు ఈ ప్రమోదూత మార్గశీర్ష మాస సంచికతో ముగియుచున్నవి. ఆయాసంఖ్యల చందాదారులు దయచేసి తి తమ తమ చందా సొమ్మును మణిఆర్డరుద్వారా పంపుటగాని, వి. పి. పంప ననుజ్ఞ ఇచ్చు గాని కావింప ప్రార్థించుచున్నాము. అట్లు జనవరి నెల ౧-వ తేదీ లోగా మాకు మణిఆ గాని వి. పి అనుమతి గాని రాకున్నచో రాబోవు సంచిక వి. పి. ద్వారా పంపగల చందాదారులు ఆ వి. పి. ని త్రిప్పివేయక దయతో స్వీకరింప ప్రార్థితులు.

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1007 | 1008 | 1010 | 1013 | 1016 | 1017 | 1022 | 1027 | 1034 | 1038 | 1039 | 1040 | |
| 1043 | 1048 | 1050 | 1056 | 1062 | 1073 | 1076 | 1079 | 1083 | 1084 | 1093 | 1142 | 1170 |
| 117 | 1180 | 1183 | 1192 | 1198 | 1215 | 1218 | 1223 | 1225 | 1237 | 1260 | 1265 | |
| 1282 | 1297 | 1314 | 1340 | 1353 | 1369 | 1372 | 1377 | 1381 | 1382 | 1383 | 1384 | 1391 |
| 1411 | 1469 | 1473 | 1475 | 1549 | 1551 | 1553 | 1566 | 1608 | 1610 | 1650 | 1652 | |
| 1675 | 1676 | 1677 | 1716 | 1720 | 1769 | 1819 | 1840 | 1856 | 1883 | 1924 | 1927 | 1940 |
| 2095 | 2190 | 2191 | 2193 | 2202 | 2210 | 2218 | 2233 | 2249 | 2263 | 2283 | 2295 | |
| 2308 | 2309 | 2325 | 2326 | 2334 | 2370 | 2417 | 2448 | 2491 | 2521 | 2534 | 2537 | |
| 2550 | 26[illegible] | 2747 | 2825 | 2866 | 2908 | 2917 | 2929 | 2932 | 2935 | 2954 | 2958 | |
| 2968 | 2969 | 2971 | 2978 | 2980 | 2981 | 2991 | 3002 | 3007 | 3014 | 3040 | 3047 | |
| 3049 | 3057 | 3058 | 3070 | 3072 | 3073 | 3080 | 3086 | 3087 | 3108 | 3113 | 3147 | |
| 173 | 3177 | 3178 | 3182 | 3203 | 3209 | 3211 | 3213 | 3256 | 3283 | 3284 | | |
| 3430 | 3479 | 3648 | 3657 | 3671 | 3688 | 3693 | 3703 | 3720 | 3747 | 3755 | 3758 | |
| 768 | 3783 | 3790 | 3792 | 3798 | 3799 | 3807 | 3813 | 3818 | 3823 | 3829 | 3855 | |
| 363 | 3880 | 3888 | 3891 | 3892 | 3897 | 3902 | 3904 | 3922 | 3929 | 3969 | 3988 | |
| 38 | 4056 | 4120 | 4173 | 4182 | 4184 | 4192 | 4244 | 4290 | 4291 | 4331 | 4354 | |
| 140 | 4453 | 4468 | 4469 | 4482 | 4493 | 4499 | 4503 | 4504 | 4508 | 4512 | 4518 | |
| 529 | 4543 | 4568 | 4579 | 4589 | 4610 | 4613 | 4628 | 4630 | 4635 | 4649 | 4654 | |

58 4669 4670 4671 4681 4700 4746 4770 4825 4864 4887 4888 4932
58 4992 5043 5064 5181 5194 5199 5219 5234 5253 5264 5263 5268
76 5277 5280 5283 5285 5288 5290 5291 5295 5296 5297 5300 5303
08 5309 5310 5311 5333 5339 5341 5347 5350 5352 5364 5367 5369
73 5377 5382 5385 5400 5403 5408 5411 5413 5418 5419 5420 5426
38 5441 5444 5448 5462 5470 5481 5497 5632 5678 5680 5681 5683
89 5701 5723 5732 5762 5964 5972 5976 5984 5992 5993 5994 5995
96 6001 6005 6009 6011 6012 6015 6016 6019 6020 6021 6022 6024
25 6027 6028 6029 6030 6034 6035 6037 6038 6041 6042 6043 6045
47 6048 6049 6050 6051 6053 6055 6056 6058 6059 6061 6062 6063
65 6068 6070 6071 6075 6077 6078 6079 6080 6081 6082 6085 6086
087 6094 6097 6098 6112 6115 6119 6125 6136 6145 6146 6148 6149
151 6152 6154 6157 6158 6160 6207 6219 6270 6289 6292 6294 6295
297 6300 6301 6303 6304 6308 6316 6317 6324 6327 6330 6331 6336
338 6339 6343 6344 6346 6347 6350 6353 6366.

చిరునామా మార్పులు 1-వ తేదిలోపల తెలుప ప్రార్థితులు.

—మేనేజరు, భారతి.

---

# భారతి—సప్తమ సంపుటము—భా. ౨.

## వ్యాసముల అకారాది సూచి

సంచిక

---

# భారతి-సప్తమ సంపుటము-భా. ౨.

## వ్యాసకర్తల అకారాదిసూచి

---

# అమృతాంజనం డిపోవారి సుప్రసిద్ధౌషధములు

## అమృతాంజనము
డబ్బితో సహా సీసా 1-కి రు. 0 10 0

## దంతచూర్ణము
కి వెల రు. 0 2 0; 12కి రు. 1 4 0

దంతచూర్ణముతో పండ్లు తోముట
పళ్లు గట్టిపడును. చిగుళ్లనుండి రక్తము
డును. నోట దుర్గంధము లేక యుండు
ముత్యములవలె తెల్లగా నుండును.
మాన్యముగ వాడుటకు దగియున్నది.

## తామర తైలము
1కి 0 6 0. 12కి 3 8 0.

మర ఒకవిధమైన పురుగులవలన చర్మ
దగాని, వెండ్రుకలలోగాని, లోచర్మ
గాని, గోళ్లలోగాని పుట్టవచ్చును. పురు
ని భేదములబట్టి తామరలోను రెండు
భేదములు గలవు.

ర్తులు:—దురద, ఉంగరముల వంటి
పొక్కులు, రసి కారుట, వెండ్రుకలు
పుట మొదలగునవి కొంచెముగా లేచి
దంతట వ్యాపించి నిద్రపట్టని జిల
ను.

## మోహినీ తైలము
నూనెగల సీసా 1కి రూ. 0 12 0

రుషులు వాడుటకు యోగ్యమైనది.
డుకు చలువజేయును, కండ్లకు చలువ
, వెండ్రుకలు పెరుగును, వెండ్రుకలు
డును, వెండ్రుకలు నునుపుదేరును.
రముగా నుండును, సువాసన గలిగి
ను, తలయందు చుండును పోగొట్టును,
వాసన రమ్యముగా నుండును. ముఖమునకు
తేజస్సు నిచ్చును, వెండ్రుకలను చిట్లనియ్యదు.
అనేక సీసాలు విక్రయము.

## గజ్జికి తైలము
డబ్బీ 1-కి వెల రు. 0 4 0. వి. పి. 0 9 0

గజ్జి, చీడ శరీరమంతట వ్యాపించి ముఖ్య
ముగ చిన్న పిల్లలకు విశేష బాధను గలిగించు
చున్నవి. ఈ తైలమును నాలుగుపూటలు
రాచిన గజ్జి, చీడ, చిలుము, జిల మొదలగు
నవి నశించును. తప్పక పనిజేయును.

## తేలుమందు
సీసా 1కి వెల రూ. 0 8 0 వి. పి. 0 13 0

కుట్టిన చోట కొంచెము మందు పోసిన,
బాధ మాయమగును. మందును గలిగియున్న,
తాము బాధపడక ఇతరులకు పుణ్యము గట్టు
కొనవచ్చును. ప్రతియింట నుండదగినది.

## రోమహారి
డబ్బీ 1కి రు. 0 8 0 వి. పి. తో 0 13 0

ఈ భస్మమును నీటితో కలిపి పట్టించిన
రోమములు రెండునిమిషములలో మొదలంట
రాలిపోవును. దీనివలన చర్మము నలుపెక్కదు,
మంట యుండదు. రోమములు రాలిపోవును.

## పగుళ్లకు తైలము
డబ్బీ 1-కి వెల రు. 0 6 0. వి. పి. 0 11 0

అరికాళ్లు, అఱచేతులు, చర్మము కారక
మువలన శీతగాలివలన పగిలి నీరుకారుటయు,
జిలపుట్టుటయు సంభవించును. ఈ తైలమును
రాచిన, పగుళ్లుమాని జిల పోయి మంచి చర్మము
రాగలదు. పగుళ్లనొప్పియు నయమగును. స్వల్ప
క్రయము.

**అమృతాంజనము డిపో, బొంబాయి. మదరాసు.**

# చిత్రములు

వర్ణచిత్రములు—మెరుపుకన్నె; బరాడీ.

ధారణ చిత్రములు—మహావీరుడు పండిత జవాహరలాలు నెహ్రూ, స్వరాజ్య సాధ
శాంత్యన్వేషణము, యౌవనము, ఇతరచిత్రములును.

---

# భారతి

వేలాల సుబ్బరావు గారు, బి. ఏ.

కాదు కా దిది త్రిలింగక్ష్మాతలము శీత
లాంబుసంభృతమానసంబు గాని
కాదు కా దిది బాలికాబాలకౌఘంబు
కమనీయకల్హారగణము గాని
కాదు కా దిది మందగామినీవ్యూహంబు
విహరించు కలహంసవితతి గాని
కాదు కా దిది వీరకాండప్రకాండంబు
మత్తసారంగసంపత్తి గాని
కాదు కా దిది నాగేశకన్యకామ
తల్లి భారతి, రజతభూధరవిహారి
మగ్నగంగాధరోత్తుంగ మస్తకావ
రూఢ శీతాంశుఖండప్రరోచి గాని.



చెన్నపట్టణము, జూలై ౧౯౩౦

సంపుటము ౭ ప్రమోదూత సంవత్సరము ఆషాఢమాసము సంఖ్య ౭

# హంపీక్షేత్రము

కొడాలి వెంకటసుబ్బారావు, బి. ఏ., కామరాజుగడ్డ శివయోగానందరావు గార్లు

## తల్లికోట యుద్ధము

అది మహాకృష్ణవేణీతటాంతరంబు-నిఖిలభువనవ్యాప్తాంధ్రావనీయశస్సు పూర్ణరూపంబు గన్నట్టి పుణ్యభూమి-ఆంధ్రస్వాతంత్ర్యలక్ష్మీవిహారసదన మహాహవాగ్నుల భరియింపనగు తలంబు.

తురకలసైన్యముల్ విజయదుందుభులన్ పలికించుచుండె ఆం
ధ్రరమ వశించు సూచనములన్ పరికించిరి జోస్యులెల్ల సం
గరమున తెల్గుకత్తుల ధగద్ధగ లంతమునొంద, నాడు గె
ల్పురణమునందు మువ్వురవిరోధియదృష్టము తల్లికోటలోన్.

అదివరకు రామరాజు నిశాంకుశమున-నృపులు, నిబద్ధవత్యు లైనారు గ్రహము
లడ్డుతిరిగెను సుల్తాను లైదుగురును-తాజితానోన్యస్యరోష మత్సరులు నేడు.

అనాడే ద్వాఃస్థాస్యతంబులట, ఆంధ్రధాంతఃపురస్త్రీజన
ధ్యానంబుల్, పరిపంథివీరవర ఢంకారావముల్, బహ్మనీ
భూనాథైకమతాగ్ని దీప్తులును, కంథుస్వామిపై రాగ్యదీ
తనాట్యంబులు, తెల్గుభూములను శ్యేష్ఠా దేవిసంచారముల్.

అగును తెనుంగురాజనివహంబులు మారణయాగవహ్నిప
స్నగములు శాత్రవాళి ఒకనా డొకతత్కథమూర్తి దాగినా
డగుపడకుండ, నాకు ప్రళయంబును లేదు, భయంబు లేదుపో
జగమువడంకె తత్కవిపంబులు రేగు నవాబుకూటమిన్.

అది ఏకమాల్యసాధ్యంబైన దే గెల్వ ఒప్పుకోరా నిజ మున్నమాట
అది రామరాడ్దుర్ణయాభివర్ధిత మగ్ని అననివో అభిమాన మన్నమాట
అదిమతావేశమం దంకురించిన వాంఛ లేకున్న చరితమే లేనిమాట
అదిపురాతనముగా నవతరించినయార్ష్యశ్రీ కాదంటురా చేతకానిమాట
ఇవి భ్రమలెన్నైన, పాదుషా లేవు రొక్కటె-కూడు టదియేల ? తెల్గుకర్తలకు జాలి
తూలు టేల? కుట్ర లోనర్చు జోలి యేల?-పూని మదియేల తురకలు పొందు జయము?

ఉర పెదరొడ్డి ముందువక నూపిన బాహుల నెట్టినిల్చి పో
టరివలె తెల్గుసైన్యము హుటాహుటి తీర్చెను మూడు బారులన్
తురకలు పట్టులే వలుపు తొందరమందిరి మూలసైన్యమై
తురగబలంబు నిల్చినది దూరముగా నిరువాగులందునన్.

అపరాత్యశస్త్రసైనికాభ్యంతరమున,-నిజకిరీటద్యుతులు తీవినెరప, రామ
రాజు బంగారుగద్దెపై రణమునందె-కొలువుతుదరె మాయాంధ్రులకొంప కాల్ప.

కృష్ణవేణీతరంగిణి స్తబ్ధమైపోయి కదలమానినజాడ గాంచలేదు
ఎవుడెరుంగని యంకుశపుపోటువకు నోర్చి వెనుకాడి గజరాజు వెంటరాదు
ఖరమ్ముద్రొక్కుచు పంచకళ్యాణిగుర్రము సకిలించి మోరనెత్తి కదలేదు
సమదశాత్రవకంఠపవనకర్తృత్వము భరియించు అసి చేత బట్టలేదు

శకునములో, విధివశంబున నలిపినట్టి-తప్పిదంబులో, తెలియ దింతయునుగా
రామరాయలు, నైజపరాక్రమంబు-ముసలిమేధస్సులోపల ముడుతలుపడ.

కల నది, రక్తముల్ ఝరులు కట్టెడిచోటు, పసిండిగద్దెప
క్కల మణిరాసులన్ పాదివి కట్టెనసంచుల నిల్పి గెల్పువా
రల కవి పంచియిచ్చుటకు రాయలు కౌతుక ముప్పతిల్లనే
నల గనుచుండె యుద్ధకరణంబున కుబ్బిరిలూరు ధీరులన్.

కలబడె సైన్యముల్ తెగినకంఠము లంబరమందు బంతుల
ట్టులు నటియించుచుండెను కఠోరములై కకుభావృతంబులై
ప్రళయసముద్రఘోషణముభాతి ధ్వనించె శతఘ్నికల్ మహా
నల మొకమంచుమూర్ద్దగ కనంబడె సైనికపాళి కచ్చటన్.

బాకుల పోటులో నినగధస్తిమహోజ్జ్వలచంద శౌప బా
ధాకలవంబు మ్లేచ్ఛభరితంబయిపోయెను చంద్రవంకలో
శీకరముల్ సుధాజలనిషేచనముల్ క్షతగాత్ర వీరర
క్షాకరణం బొనర్చుటకు చాలవు తత్ క్షణమం దదేలనో.

తెలుగుపదాతిసైన్యములు దిద్దిన మధ్యమపంక్తి శత్రుసే
నలవదుమున్ హరించెను వనస్థలి రేగిన కారుచిచ్చుమం
టలవలె పార్శ్వపంక్తుల నడించెను ఆంధ్రుల పార్శ్వసైన్యముల్
కలను సమాప్తమైనటుల గాంచెను, పొంగెను రామరాయలున్.

పొంగులో రాసిపోసిన పూర్ణనిధుల,-చిమ్మ మొదలిడె నగ్రగామిసీమయందె,
భటుల గెల్పును మెచ్చిన పారితోషి-కముల, సైన్యము వానికై కలగిపోయె.

తురకపదాతు లోడుట, నిధుల్ విరజిమ్ముట, తెల్గుసైనికో
త్కర మతిలుబ్ధమై ధనరతంబయియుండుట గాంచి, శత్రువుల్
తురగబలంబు నొక్కపరి దూకగ జేసిరి కాలమూర్తికిం
కరు లటు చెక్కుచుండి తురకల్ చలనాంధ్రపదాతివర్గమున్.

కలగినసైన్యముల్ విలయకాలసమాప్త విభిన్నమేఘసం
కులములు, రిక్తముల్, విజయకుంఠితముల్, బహుమానవాంఛలో

కలుషితముల్, రిపుప్రకరకార్యనమితాత్మనశక్తముల్, నిబం
ధలనవిహీనముల్, రిపువిదారణ కర్మము లంతకంతకున్.

ఈగల్లంతున కేమి కారణమొ యూహింపంగలే రాంధ్రదు
ర్భాగ్యప్రోద్భల హేతుభూతము, రణప్రాధాన్య ఘోటీదళ
త్యాగంబున్ లపియించె సైన్యపతి సాహాయ్యంబు వమ్మయ్యె నే
నాగర్వంబున శత్రువుల్ పెరిగి రున్నట్లుండి దుస్సాధ్యులై.

ఎనుబదియేండ్లవృద్ధు, డసినేనియు దాల్చని గర్వి, ఆహవం
బున గెలువున్న సాహసుడు, పూజ్యుడు పూర్వము, అంత్యవర్తనం
బున మతిలేనివాడయి, విమూఢుడునై, నతతంబు గెల్పె న
మ్మిన స్థిరచిత్తు డిప్పుడునుమీ గ్రహియించె స్వకీయదోషమున్.

ఆరిపోవు దీపము గప్పుమనెడిరీతి-గద్దెపైనుండి దగ్గరగా నిలచిన
అశ్వమునకయి లంఘించునంతలోన-శిరము త్రెంచిరి తెగియించి తురకబంట్లు.

రేనిశిరంబు భూమిని పరించెకునంతటిలోన తత్ ధ్వజం
బూనినబంటు కృత్తశిరమున్ పడిపోయెను హాహాహారవ
ధ్వానములో లయించిన దయత్నముగా మహాంధ్రరాజ్య న
న్మానము మానముల్ కథలుమాత్రము నిల్చిన వల్లిబిల్లిగన్.

---

# వినుకొండ వల్లభరాయడు - క్రీడాభిరామము

చేకుమళ్ల అచ్యుతరావుగారు, ఎమ్. ఏ., యల్.

ఈ కవి కడపజిల్లా పులివెందుల తాలూకాలోనున్న మోపూరను గ్రామమునకు అధిపతిగా నుండెను. ఈతని తండ్రి గుంటూరుజిల్లాలోనున్న వినుకొండకు ప్రభువుగానుండి విజయనగరరాజైన రెండవ హరిహరరాయలయొద్ద రత్న భాండాగారాధిపతిగా నుండెను * వీరి పూర్వులును విజయనగరాధీశులయొద్ద గొప్ప యుద్యోగములు చేసినవారే. ఈ వంశములో మొదటివాడగు చంద్రన్న ప్రథమబుక్కరాయలయొద్ద మంత్రిగా నుండెను. ఈ కవియొక్క పెదతండ్రి లింగన్న రెండవ హరిహరరాయలయొద్ద సేనాధిపతిగా నుండెను. ఈ రెండవ హరిహరరాయలు క్రీ. శ. 1377 నుండి 1404 వరకును రాజ్యము చేసెను గాన అతని కుమారుడగు మొదటి దేవ రాయలకును (క్రీ. శ. 1404-1422), అతని పౌత్రు రెండవ దేవరాయలకును (1428-1446) సమకాలిక వినుకొండ వల్లభామాత్యుడు దేవరాయలచే గౌర చేత గౌరవమును బొందిన శ్రీనాథునికిని సమ కాలమువాడని నిర్ణయింపవచ్చును.

వల్లభామాత్యుని తండ్రియగు తిప్పన్నమం యీ విధముగ చెప్పబడినది:

ఉ. గంధవతీప్రతీరపురభూష్యపార విప్రప్రమాద భూ
ష్యంధయచక్రవర్తి శ్రుతిపర్వతదుర్గ మహాప్రధాన



టన్నట జూడనొప్పెడు ఆటలు, పాటలు, వినోదములు, యుత్సవములు ఇత్యాది కేళీవిశేషములను దిలకించి ముదమొందుచు శృంగారభోగ పరాయణులై కేళ్య వాటికా పరిభ్రమణమున మదనావిష్టమానసులై యా రేయి గడపి మరునాడు తమదారిని తాఁ బోదురు. ఇట్లొక వాసరమున జరుగు క్రీడావిలాసములఁ బ్రదర్శించెడు నాటికకు వీథియని పేరు. ఇట్టి నాటికలను పదునాల్గు పదిహేను శతాబ్దములలో మనదేశమందలి గీర్వాణ కవులు వ్రాసి ప్రదర్శించి రాజులను, ప్రజలను సంతోషపెట్టుచుండిరి. ఇట్టి గ్రంథములు సామాన్యముగా నాటక స్వరూపములనుటచే సంస్కృతభాషలోనే వ్రాయబడినవి. దేశభాషలందు నాటకములను వ్రాయుట యప్పటికి లేకేలేదు.

వల్లభామాత్యుని కాలమున పెదకోమటి వేమ భూపాలుని యాస్థానమున వామనభట్టను గీర్వాణకవి "శృంగారభూషణ"మను నొకవీథినాటకమును సంస్కృతమున రచించెను. దానియందు నాయకుడగు విలాసశేఖరుడు విజయనగరమందున్న హంపీ విరూపాక్షదేవుని తిరునాళ్లలో దిరిగి విజయనగర పట్టణమందలి వినోదవిలాస విశేషముల వర్ణించెను. రావిపాటి త్రిపురాంతకుడను నాంధ్రమహాకవి "ప్రేమాభిరామ"మను వీథినాటకమును సంస్కృతమున రచించి యందాంధ్రనగరమగు ఓరుగల్లు పట్టణమందలి జనసంఘముల కేళీవిలాసములను ప్రత్యక్షముగ నిరూపించెను. ఆ గ్రంథమునకే యీ క్రీడాభిరామ మాంధ్రానుసరణము.

ఏతద్విషయమునుగుఱించి క్రీడాభిరామమున నిట్లున్నది: "ఆ మంత్రిశేఖరుడు (వల్లభామాత్యుడు) రావిపాటి త్రిపురాంతక దేవుడను కవీశ్వరు డొనరించిన 'ప్రేమాభిరామ' మను నాటకముననుసరించి 'క్రీడాభిరామ'మను రూపకంబు తెనుంగుబాస రచియించినవాడు"

గీ. 'ఆతఁ డెంతటివాఁడు ప్రేమాభిరామ
మనగ నెంతటిదది దాని ననుసరించి
వీథియను రూపకము పేరి వెలుగులేక
తిప్పవిభుఁ డల్లభుం డెట్లు తెనుఁగుఁజేసె.'

'అని యానతిచ్చెదరేని,

ఉ. 'వన్నెయభట్టు తిక్కకవి
నాయకులన్న హుళక్కి భాస్కరుం
డన్నయు జిమ్మపూడి యమ
రాధిపుఁ డన్నను శక్తిభిక్షుకుల్
చెన్నదుటం గరాంజలులు
నింతలుఁ జేయని రావిపాటి తి
ప్పన్నయు నంతవాడు తగు
నా యిటు దోసపు మాటలాడఁగన్.

ఆ-వె. 'జనని సంస్కృతంబు సకలభాషలకును
దేశభాషలందు తెనుగు లెస్స
జగతిఁ దల్లికంటె సౌభాగ్యసంపద
మెచ్చుటాడుబిడ్డ మేలుగాదె."

కావున రావిపాటి త్రిపురాంతకుఁడను నాంధ్రకవి రచించిన సంస్కృత నాటకము నగు 'ప్రేమాభిరామము'నకు నీ 'క్రీడాభిరామము' ఆంధ్రానుసరణమని కవియగు వల్లభరాయడే నిస్సందేహముగఁ జెప్పుకొనెను.

ఇట్లు ఏతద్గ్రంథకర్తృత్వము నిస్సంశయముగాను తేటతెల్లముగాను నిర్వచింపబడినను గొన్ని కారణములచే వివాదాంశమై విమర్శనదక్షులగు పండితుల ప్రాగల్భ్య కౌశలములకు గురియై యొక సారస్వతక్లిష్ట సమస్యగఁ బరిణమించినది.

## గ్రంథకర్త: వల్లభరాయుడా లేక శ్రీనాథుడా

ఏతద్గ్రంథము వల్లభామాత్యుడు రచించినట్లు గ్రంథమందలి ప్రస్తావనబట్టియు, కొందఱు పూర్వలాక్షణికుల లక్షణగ్రంథములబట్టియు దెలియవచ్చుచున్నది. అయినను మరికొందరు లాక్షణికు లీయభిప్రాయమునకు భిన్నముగా దమగ్రంథములయందు కవిసార్వభౌముడగు శ్రీనాథుడే యీ నాటకమును రచించెనని సూచించియున్నారు. ఇట్లాంధ్రలక్షణగ్రంథములలో నున్న భిన్నాభిప్రాయములమూలమునను మఱికొన్ని కారణములవల్లను యీ గ్రంథకర్తృత్వ విషయము వాదప్రతివాదముల కాస్పదమయ్యెను.

హ్మశ్రీ మానవల్లి రామకృష్ణకవి, (ఎం. ఏ.) గారు ్రొత్తగ నీ గ్రంథమును ముద్రించి దానికొఱకు వారు పీఠికయం దుభయపక్షముల చెప్పతగిన హేతు వారికి మహాజనులు నిష్పాక్షికబుద్ధితో నివేదించిరి. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తమ "శృంగా థము"న నీ గ్రంథము గుఱించి వ్రాయుచు నకే సదుపపత్తులను సేకరించి యేతద్గ్రంథమును శ్రీ డే గాని యొరు లెవ్వరును రచించియుండరని తమ భిప్రాయమును విశదపఱచిరి.

ఇట్లుండ బ్రహ్మశ్రీ వేమూరి విశ్వనాథశర్మ (ఎం. రు 'భారతి' పత్రికలో (1927 సం. ఏప్రిల్) పీఠి ముల యభిప్రాయముల ఖండించుచూ కొన్ని ది శేషములను గనపఱచి వల్లభామాత్యుడే యీ మును రచించెనని కంఠోక్తిగా నుడివిరి.

ఈ విధముగా నిరతిశయులగు పండితులను కలత యీ పారస్పర్యసమస్య కొంతవఱకైనను నాచే ముగా సాధింపబడుట సముంజసముగా నుండు భయపక్ష వాదప్రతివాదముల నిట సంక్షేప నిరూపించి తుదకు నా యభిప్రాయమును ను.

1. పూర్వకవి లాక్షణికులగు చిత్రకవి పెద్దన, జా రామన, శ్రీధరుడు, గణపవరపు వేంకటకవి, టి జగన్నాథకవి మొదలగువారు క్రీడాభిరామము తమ గ్రంథములలో నుదహరించిన పద్యములు ాయనివే యని చెప్పినట్లు శ్రీ మానవల్లి రామకృష్ణ వ్రాసినారు. కాని అప్పకవి, లింగమగుంట ి మున్నగువారు ఈ పద్యములను శ్రీనాథునివని ారు.

2. క్రీడాభిరామములో నున్న యొండు రెండు లు, ముఖ్యముగ

గార్గ్యసిద్ధాంతి మతి మాఘకాలకలన
శకునమూమట యని బృహస్పతి మతంబు
వ్యాసమతము మనః ప్రసాదాతిశయము
విప్రజనవాక్య మరయంగ విష్ణుమతము.

అనునది శ్రీనాథుని గ్రంథములలో నున్నది. మఱియు క్రీడాభిరామములోనివైన కొన్ని వాక్యము లును, వర్ణనలును శ్రీనాథుని వాక్యములను వర్ణనలను గాఢముగా ననుకరించు చున్నవనియు, కావున శ్రీనా థుడే యేతద్గ్రంథకర్త యని సిద్ధాంతీకరింప బడవచ్చు ననియు ఋజువుచేయుటకు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు చాలవఱకు శ్రీనాథాదికవుల గ్రంథములనుండి సామ్య శబ్దసామగ్రిని సేకరించి విపులముగ విశదపరచి నారు.

3. క్రీడాభిరామ ప్రస్తావనయందున్న కృతిపతి స్తుతియు, గ్రంథాంతమునందున్న భరతవాక్యమును వల్లభ రాయని గుణగణములగుఱించి స్తోత్రపాఠము లగుటచే వల్లభరాయడే తన్ను తాను పొగడుకొనునా యని సందేహింప దగియున్నదని శ్రీ ప్రభాకరశాస్త్రిగారి వాదము. ఈ పద్యములన్నియు సూత్రధారుడు పల్కి నవి గాన ననౌచిత్య దోషము లేదని శ్రీ శర్మగారి ప్రతి వాదము.

ఉభయపక్షముల వాదప్రతివాదముల సారాంశ మిదియే యని నా యభిప్రాయము.

పైన జెప్పిన వాదప్రతివాదములలో నీ గ్రంథ మును గుఱించి యొండు రెండు విషయములకు ప్రాముఖ్య మివ్వకపోవుటచే నీ యభిప్రాయభేదమున కవకాశము గలిగెనని నే నూహించుచున్నాను.

1. ఈ గ్రంథము రూపకముగాని కేవలము ప్రబంధము గాదు. రూపకలక్షణములు సంపూర్ణముగా దీని యందు గాన్పించక పోయినను యిది వీథినాటకముగా గ్రంథకర్తచే పరిగణింపబడినది.

2. ఇది హాస్యరస ప్రధానమైన క్షుద్రకావ్యము గాని యున్నతాదర్శములు గల యుత్తమకావ్యము గాదు.

హాస్యరస ప్రధానమైన క్షుద్రనాటకముగా దీని నుపలక్షించినయెడల మహాకవి శ్రీనాథుడు గాక శ్రీ నాథుని భాషావేషము గొంతవఱకు ధరింపగల మరియొక

కవి రచించియుండునని మనకుఁ దోచును. శ్రీ ప్రభాకరశాస్త్రిగారి వాదములో ముఖ్యాంశ మేదన: శ్రీనాథుడును వల్లభరాయడును సమకాలికులగుటయు, శ్రీనాథుని వాక్యములు మెండుగ నీ గ్రంథమందు గాన్పించుటయు నీ రెండు కారణములచేత నేతద్గ్రంథము శ్రీనాథుడే రచించియుండెనని తలంపు. మహాకవి శ్రీనాథుడు సమయస్ఫూర్తిగాను, సమయానుకూలముగాను కొన్ని యశ్లీలములగు పద్యములను చెప్పినను చెప్పియుండును. ఆకాలపు శృంగారరస లాలసత్వ సంప్రదాయముల బట్టియు శ్రీనాథుడు కవిసార్వభౌముడైనను శృంగార రస విషయములలో వాఙ్మయ మర్యాదలను దాటుచుగ నతిక్రమించినవాడే. అట్లయినను యీ క్రీడాప్రధానమై నీతిబాహ్యమైన గ్రంథమును తాను ప్రత్యేకముగ రచించియుండునా యను సందేహము ప్రస్తుతత్వమునఁ బరిశీలించిన బోధమగుచున్నది. నీతిబాహ్యము గావుననే తాను రచించి మఱియొకరి పేరు పెట్టెనని శ్రీ శాస్త్రిగారి వాదము. కాబట్టి నీతిబాహ్యతకారణమున శ్రీనాథుని కర్తృత్వము దప్పించుటకు వలనుపడదు.

ఇంక గ్రంథమందున్న సాక్ష్యమును బరిశీలించెదను. ఇది రెండువిధములుగా నున్నది.

1. గ్రంథకర్తను గుఱించియు, 2. గ్రంథశైలిని గుఱించియు.

1. గ్రంథకర్త:—కృత్యాదినున్న యవతారిక పద్యములలో గ్రంథకర్తయగు వల్లభామాత్యుని గుఱించి యత్యధికముగా వర్ణనము గావింపబడినది. ఆ వర్ణనములో వల్లభామాత్యుని వాగ్వైభవములును, చాటుధారాఫణితులును, వాగ్డంబరములును యిత్యాది కవితాస్వారస్య సౌరభములే ముఖ్యముగఁ జెప్పబడినవి. కృతికర్త స్తవమగు సెనిమిదిపద్యములలో నారుపద్యము లాతని కవితాశక్తిని గుఱించి ప్రశంసించుచున్నవి. తక్కినరెండు నాతని వితరణగుణముల గుఱించియై యున్నవి.

వల్లభామాత్యుడే యీ గ్రంథమును వ్రాసిన యెడల నిట్లు తన్నుఁ దా బొగడికొని యుండునా యని యాక్షేపింపబడినది. ఈ యాక్షేపణకు రెండుసమాధానములు. 1. ఈ గ్రంథము వీథినాటకముగా నుండ
నట్లు వ్రాయబడినది. క్రియాఫలితములో ప్రత్యే
నాటకముగాక, ప్రత్యేక ప్రబంధముగాక యుభయులకు
మిశ్రితమైన యొక సంకరగ్రంథమైనను ఆంధ్రభా
యందలి నాటకరచనములో నిదియే కేవలము ప్రథ
ప్రయత్నముగాన యందలి నాటకలక్షణ లోపము
తద్వస్తు నిర్దేశమునకుఁ గొఱంత కలిగింపగూడదు గా
కృతికర్త స్తవము నాటక ప్రస్తావనయందు సూత్రధారుడ
జెప్పినటులుగా యూహింపవలసి యున్నది. సూత్ర
ధారునిద్వారా యెంతెంత విపులముగాను, విపరీతముగా
నాటకకర్తలు తమ్ము దాము గొండాడుకొనియుండిరో
మన సంస్కృతనాటకములఁ జదివినఁ దెల్లమగును. ఈ
వల్లభరాయని కాలములోనే యోగానంద ప్రహసనక
యగు అరుణగిరినాథుడు తన్ను దా నెంత పొగడుకొనెన
చూడుడు. కాబట్టి యాత్మస్తవ మనుచితమని కర్త
త్వము వల్లభామాత్యునినుండి తప్పించుట యసంగతము.

వల్లభామాత్యుడే యీ గ్రంథమును రచించియు
డనియెడల సూత్రధారు డతని కవితాస్వారస్యమున
భాషావైదుష్యమును గుఱించి కడుంగడు నుత్ప్రేక్షిం
సంస్తవించుట యసందర్భముగాను నసమంజసము
నుండును. ఈ గ్రంథమును వల్లభామాత్యుడే ప్రత్యే
ముగా రచించెనని విస్పష్టముగా సూత్రధారుడు ప్రే
కులకు చెప్పుచున్నాడు. గనుక యాతని కవిత్వము
గుఱించియు వాక్ప్రౌఢిమను గుఱించియు సవిశేషము
నుగ్గడింపవలసి వచ్చినది. ఇట్టి ముఖ్యవిషయమును
ప్రభాకరశాస్త్రిగారు విరసించిరని తెల్పుటకు విచా
ముగా నున్నది. న్యాయముగ వారివాదములో
యగ్రస్థానముఁ బొందఁదగి యున్నది.

2. గ్రంథశైలి:—క్రీడాభిరామమందలి శై
శ్రీనాథుని శైలివలె నున్నదనియు, శ్రీనాథుని గ్రంథ
లందలి పద్యము లొండురెండును, భావములును వా
ములు ననేకములు దీనియందు గానంబడుచున్నవని
ఆకారణములచే గూడ నీ గ్రంథము శ్రీనాథగీత
కొండ రూహించుచున్నారు. శైలిసామ్యమే

ళ్యవాదము గాన నీ గ్రంథమందలి శైలి గొంతనిదా
గాఁ బరిశీలింపవలసి యున్నది.

ఏ గ్రంథముయొక్కయు శైలి ఆ గ్రంథస్వభావ
బట్టియు, ఆగ్రంథకర్త ప్రతిభనుబట్టియు నిర్ణ
యించునని సర్వవిదితమే. ఈ క్రీడాభిరామము క్రీడా
యములు గల యొక హాస్యగ్రంథము. కావున హాస్య
ప్రతిపాదనకొఱకు హాస్యవిషయములే గాక హాస్య
జనకమగు పరిభాషగూడ వాడుక చేయవలసి యుం
. లేనియెడల హాస్యరసము జనింపదు.

హాస్యరసమును (The comic or the ludi-
us sentiment) పుట్టించెడు శైలివిశేష. మేదనిన
త్కృష్టభావములను, ఉత్కృష్టవాక్యములను నీచ
ర్భములయందును, అవినీతివిషయములయందును
కుశలముగఁ బ్రయోగించుటయుఁ దత్సంబంధమైన
భాషాది పరికరములను యథేచ్ఛగా నుపయోగపరచు
టయునై యున్నది. ఈ విధముగా భావములకును
ని వ్యక్తపరచెడుభాషకును గలిగిన వ్యత్యాసమే
హాస్యరససిద్ధి కొకముఖ్యసాధనము. ఇట్టి వికృతశైలి
థమందు బహుచమత్కారముగ నుపయోగింపఁ బడి
దీనికొక యుదాహరణము:

సీ. గార్గ్య సిద్ధాంతమత ముమఃకాల కలన
శకున మూహట యది బృహస్పతి మతంబు
వ్యాస మతము మనఃప్రసాదాతిశయము
విప్రజనమత మరయంగ విఘ్నమతము.

శకునసంబంధమైన శాస్త్రప్రసంగము శ్రీనాథుని
శ్వర పురాణములో అగస్త్యమహర్షియు, లోపా
ద్రయు, వ్యాసమహర్షియు, శిష్యులును, వీరందరును
క్షారామ పురోపాంతమున నొకచోని తత్పురీప్రవేశ
కు శుభముహూర్తముగుఱించి యాలోచించుచుం
నా సమయమున మైత్రావరుణుండను మునిపుంగ
డు పైఁ జేర్కొనిన పద్యమును నుడివెను. అట్లు
హర్షులు మహాపవిత్ర సందర్భమునచేసిన శకునశాస్త్ర
ంగము నీక్రీడాభిరామమున వేడుక చెలికాండ్రిద్దరు
చనకర్మయు, టిట్టిభసెట్టియు ప్రభాతకాలమున

క్రీడాపరిభ్రమణోన్ముఖులై చేసిరి. వారిద్దరు చేయబోవు శుభకార్య మేదనగా పట్టణములోనున్న వినోదములను చిత్రవిచిత్రములను, ఆటపాటలనుఁ జూచుచు నుల్లాసముగ విహరించుట. ఈ మహాకార్యము చెడిపోవునేమో యని వారు మంచిశకునము జూడవలసి వచ్చినది. అట్టి శకునమును నిర్ణయించుటకు ప్రాచీన శకునశాస్త్రములు నన్నిటినిఁ ద్రిప్పి తిరుగవేసి వానిలోని సారముగా బ్రహ్మర్షి ముఖమున శ్రీనాథమహాకవి నుడివిన పద్యమునే చెప్పికొనిరి. ఈ శకునప్రసంగమును, ఈసంవిధానమంతయును హాస్యరసోత్పత్తికొఱకు కాదా? కావున శకునశాస్త్రములలోనున్నట్టియు, శ్రీనాథుని కవితాప్రసిద్ధిచే ప్రకటితమైనట్టియు నీపద్యము సందర్భవశమునఁ జేర్చబడినది. ఇట్టిహాస్యప్రయోగము శ్రీనాథుడే తనపూర్వగ్రంథము నుండి వినియోగించుకొనెనని చెప్పుటయా లేక మఱియొకకవి యా సుప్రసిద్ధకవివరుని పద్యమును హాస్యసందర్భమున నుపయోగించెనని యూహించుటయా యెక్కుడు సమంజసము?

ఈ వీథినాటకమునకు భరతవాక్యమని చెప్పదగిన కృత్యంతపద్యములో మోపూరి భైరవస్వామి యా 'కవీంద్రకాంక్షితత్రిదశ మహీరుహమై మా వల్లభరాయనిఁ బ్రోచుగాత'యని చెప్పబడినది ఈపద్యమును వల్లభరాయడే వ్రాసినయెడల తమ్ముఁ గొని తానే తనా యనుకొన్నట్లుండునని శ్రీ ప్రభాకరశాస్త్రిగా రాక్షేపించిరి. అయితే వల్లభరాయ డాపద్యమును వ్రాయనియెడల శ్రీనాథుడు వ్రాసెనని చెప్పుటకు దగిన హేతు వున్నదా యని విచారింపదగినది. ఏనాటకమందైనను భరతవాక్యమందు కృతిభర్తనుగుఱించి వ్రాయుట శాస్త్రసమ్మతముగాని సంప్రదాయ ప్రసిద్ధముగాని యైయుండెనా యను విషయమునుగుఱించి యాలోచించుటకు శ్రీ శాస్త్రులవారే ముఖ్యార్హులు. ఈవిషయమునుగుఱించి నేననేక పండితుల యభిప్రాయములను గనుగొంటిని. ఎవ్వరైనను యిది శాస్త్రసమ్మతము గాదనియు, ఆచరణలోనైనను లేదనియుఁ జెప్పినవారే. అట్లయినచో మహాపండితుడగు శ్రీనాథుం డీయశాస్త్రీయమైన వ్రాత వ్రాసియుండునా యని సంశయింపవలసియున్నది. అశాస్త్రీయమైన

చేయుటకు శ్రీనాథుడు తగియుండెనా వల్లభరాయుడు తగియుండెనాయనువిషయము పండితులచే చర్చనీయము.

ఈగ్రంథమందలి శైలి యనేకస్థలముల నతిమాత్రముగ సంస్కృతశబ్దభూయిష్ఠమై బహుక్లిష్టముగా నున్నది. ఇట్టి పదకాఠిన్యమును, పాండితీవిజృంభణమును కేళీవినోదములగుటెంచియు నీచసందర్భములగుటెంచియు వినియోగింపబడినది. ఈగ్రంథశైలియందలి యీద్వైవిధ్యమునకు రెండు హేతువు లుండవచ్చును. ౧. ప్రప్రథమమున రావిపాటి త్రిపురాంతకుడు తన ప్రేమాభిరామమును సంస్కృతమున వ్రాసెను గాన నాపద్యములను దెనిగించినకవి సంస్కృత సమాసముల నట్లే దిగవిడిచి యుండవచ్చును. ౨. లేదా, ఎవరో యొకకవి కీర్తికాముడగు సామాన్యుడు తనభాషావైదగ్ధ్యమును బ్రకటించుటకు నౌచిత్యపరిజ్ఞానము లేకుండ పదబంధము క్లిష్టతమముగఁ జేసియుండవచ్చును. తన వాగ్వైభవములను వాగ్డంబరములగుటెంచి మహాతిశయముగఁ జెప్పికొనిన వల్లభామాత్యుడే యీ యప్రసక్తమైనట్టియు, అప్రశస్తమైనట్టియు శైలీకోపమునకుఁ గారణభూతుడయ్యెను గాని యుచితజ్ఞుడగు మహాకవి శ్రీనాథుడుగాడని యూహించుట యెక్కువ న్యాయముగాదా?

శ్రీనాథుని భాషాప్రయోగము లీగ్రంథమునఁ బుష్కలముగా గాన్పించుచున్నవిగాన నీగ్రంథము శ్రీనాథకృతమని కొందఱిచే దలంపబడుచున్నది. శ్రీనాథుని వాక్యములును వర్ణనలు నచ్చటచ్చట గానంబడుచున్నవనుట వాస్తవము. కొన్నిపద్యములలో శ్రీనాథుని శైలిధోరణియు ద్యోతకమే. అయిన నాకారణమున శ్రీనాథుడే యీగ్రంథమును వ్రాసెనని చెప్పుటమాత్రము సాహసము. శ్రీనాథుని 'బహుముఖ ప్రఖ్యాతి మహిత శయ్యావిశేషములు' పండితకవులను పండితంమన్యమానకవులను నేకరీతిగా ననుకరణోత్సాహపూరితుల జేసె ననుటకు పినవీరన, పెద్దనాది సుప్రసిద్ధమహాకవులే ప్రబలసాక్షులు. అట్లుండ సమకాలికుడు, బహుశః సహచరుడునగు వల్లభామాత్యుడు కవియశోవాంఛితుడు గాన శ్రీనాథుని వాగ్లహరీ తరంగముల మధుర మధురసమును



గడుపారఁ గ్రోలి తనకావ్యమున నచ్చటచ్చట తదుస
సీధువును వెలిగ్రక్కుట యసంభవమా? బహుళ వా
నొందిన శ్రీనాథుని 'జాతివార్తారసస్ఫూర్తి' య
చ్చుట నీగ్రంథము నలంకరించుటచేతనే యీకాలపు
కప్రేక్షకులను హాస్యరస నిమగ్నులనుగా జేయ
యుండెనని యూహించుట యథార్థమునకు దూ
గాదు.

పై యంశములను సావధానముగా నరసిన వల్ల
మాత్యుని కర్తృత్వము స్థాపించుటకు ప్రబల సాక్ష్య
గాన్పించుచున్నది. లాక్షణికుల యుదాహృతి వల్ల
మాత్యునికిఁగూడ సాయమిచ్చుచున్నది. శైలివి
ములు శ్రీనాథుని కర్తృత్వమునకు న్యూనతఁ గలిగిం
విధముగఁ దోపించుచున్నవి. గ్రంథమందు విస్పష్టమ
వల్లభునికర్తృత్వ ముద్ఘోషితమై యున్నది. కావున
గ్రంథము వల్లభరాయని కృతమనియే యంగీకరిం
యెక్కువ న్యాయమని యూహించుచున్నాను.
రాయడీగ్రంథమునుఁ దెనిగించి తనస్నేహితుడును
సార్వభౌముడు నగు శ్రీనాథునిచేఁ గొంతసాయ
బొందియుండవచ్చును గాని, శ్రీనాథుడే యీగ్రం
నామమాత్రముగా రచించెనని చెప్పుట మాత్ర
కేవల మతిశయోక్తి యనియు, నన్యాయమనియుఁ ద
సాహసించుచున్నాను.

## కథాసారము

కాసల్నాటి గోవింద మంచనశర్మ యను
త్రియబ్రాహ్మణుడును, అతని చిన్నతనపు చెలికా
టిట్టిభసెట్టి యను వైశ్యుడును ఆంధ్రనగర మను
వసించిన యోరుగంటిపురవీథులలో విలాసార్థము
రించి యచ్చట గోచరించెడు క్రీడావినోదములను,
పాటలను సావకాశముగ దిలకించి యానందించవలె
నుద్దేశముతో నొకనాడు శుభముహూర్తము జూ
కొని ప్రభాతమున బయలుదేరిరి.

మున్ముందుగ నోరుగంటిపుర పరిసరమున
వెలిపాళెము ప్రవేశించి యచ్చటనున్న యొక

...ర్వాత నొక చండాలాంగనను, యటుపైని ...టస్త్రీని వారు చూచి శృంగారవివశులై ...ము జెందిరి. అటుతర్వాత మరికొంతదూర ...క 'కాపు'కులాంగనయు, కర్ణాటవేశ్యయును నరికట్టిరి. వీరినిజూచి సంతసించుచుండగ నమ్ముచున్న తేలియునతి వారి కన్నుల ఆమె సొబగును వీక్షించి యిట్టి మోహనాం ...తిగా సృజించిన కట్టిడి విధిని దూరి మోహరి ప్రవేశించుటకై చుట్టుమున్న యగడ్తను ...లుపులు బిగించిన వంకదారికుండ రాజమా ... ఆరాజమార్గము 'వారణఘటాఘోటకశక ...టిసంకులంబు' గాన వందు బోవవలదు. ...ల కలకలంబులు లేక సుఖవినోదములు గలు ...సందుచాయల బోవుట సుఖమని వారు నిశ్చ ...దారిని బట్టిరి. అటు బోవంబోవ వారియెదుట ...పురుషుల కథనమును పాడుచున్న పాటగాం ...తనే పుపలక్షించి కొనియాడి ముందుకు ...రాజేని దేవళమును, మాహురమ్మగుడియుఁ .... ఈ దేవగలసేవలను జూచియు, జక్కుల ... మైలారభటులును జేయుచున్న జాతరలను ..., చనుడేశ్వరీయాలయమును, బౌద్ధవిహారము ...లు ముసానమ్మ నివాసమును, కుమారస్వామి ... పాండవులగుడిని, కర్తారునిమశీదును మున్న ...వాయతనములనుఁ దిలకించి యెదుటనున్న ...కేశవస్వాములకుఁ గేల్మోడ్చి మహాభైరవేశ్వ ...స్కరించి నిరీక్షించుచుండ నాంధ్రేశ్వరుని ...నున్న గడియారము పదునారు ఘడియలు ... ఘంటానినాదము విని మధ్యాహ్నమగుటచే ...రై పూటకూటింటికిఁ బోవఁ ద్వరపడి ...తి కేగి లక్ష్మాణామ్మజ్జాయింట నొక్క ... షడ్రసాన్నము భుజించిరి. ఆ యింట నున్న ...తంటు పరిచయము జేసికొని తిరిగి పురవీథు ...ను ద్రిప్పిరి.

...లయుంగడికి బోయి పువ్వులావికల ప్రొథవచో ... నాకర్ణించి వేశ్యవాటికం బ్రవేశింప నచట

శీదో రొుక యుత్సవంపు కలకలము వీక్షించి యదేమి యని యడుగ ప్రతాపరుద్రమహారాజుగారి యుంపుడు కత్తె యగు మాచలదేవి వారాంగన చిత్రశాలాప్రవేశము జేయుచున్న యదిగాన పుణ్యాహవచన సమయ మిదియని తెలిసికొనిరి. అచ్చట కొంతకాలము నిలచి యారారాజా మన్నించు ఐన్నెలాడిని సందర్శించి కొంతతడవు సంభా షించి వెండియు బోవంబోవ మంచవశర్మయొక్క పూ ర్వంపు గారాబు వెలవెలంది యగు గాంధారి యగపడెను. ఆమెయొద్ద గొంతసేపు వారు సేదదీర్చికొని తిరిగి బయలు వెడలి నాగస్వరమున బాడుచున్న నాగులవానిని యటుతర్వాత గొఱ్ఱెపందెములను కోడిపందెములను జూచి యుత్సాహమును బొంది మంచవశర్మప్రియురా లగు కామమంజరిగృహము ప్రవేశించిరి. అచ్చట వారేయి యంతయు సుఖనిద్రను గడపి తరువాత తమదారిని దా బోయిరి.

## గ్రంథవిమర్శనము

ఈగ్రంథము క్రీడావిషయములతో నిండియున్న చిన్న నాటకము. జనసామాన్యమందలి సంఘుజీవితము ప్రాయికముగా గొప్పపట్టణములలో విశాలముగా గాన్పిం చును. నానావిధజాతులు, మతములు, వర్ణములు, నిమ్నోన్నతావస్థలు, భేదసాదలు, సుగుణ దుర్గుణములు ఇట్లనేకరూపభేదములు, శీలభేదములు, అవస్థాభేదము లును మహాపట్టణములలో నొకేస్థలమున, నొకేసమయ మున జూడ నవకాశ ముండును. ఈ నానారూప మానవప్రకృతిని జూచిన ప్రతిమనుజునకు గొంత సంత సము గలుగక మానదు. గోవిందమంచనశర్మయు, టిట్టిభ సెట్టియు, అద్దేప్రకార మాంధ్రదేశమునకుఁ గేంద్రస్థాన మైన ఆంధ్రనగరమునందలి బహుముఖ ప్రసరిత ప్రజా జీవితమును జూడ సమకట్టిరి. కాని, వారు చూడదలచి నది యామహాపట్టణమందలి యున్నతజీవితమును, యు త్కృష్టప్రకాశమును గాక ఆదర్శవిహీనమైన జఘన్య జీవితమును, విషయలోలత్వమును దిలకింప నుద్దేశించు కొనిరి. కావుననే బయలుదేరునపుడు టిట్టిభసెట్టి తన

యమంగు చెలికానితో 'మంచన వింటివో విటవో' యను చు నోరుగంటిపురమునందలి మన్మథుని విజయచిహ్నములనే ప్రస్ఫుటముగ వర్ణించెను. కావున నోరుగల్లు నగరములో వారు చూడదలచినది ముఖ్యముగ కాముక వ్యాపారములును, విశృంఖల స్త్రీపురుష కేళీవ్యాసక్త క్రీడావిలాసములును నై యున్నవి. ఈవిధమైన నికృష్ట సంఘజీవితమును తనివిదీర జూచుచు పోవుచున్నను మధ్య మధ్యను మరికొన్ని సాంఘికస్వరూపములు వారి దృష్టికి పొడసూపినవి. మన యదృష్టవశమున వారి క్రీడాపరాయణత్వము ఇట్టి దృశ్యములపైనగూడ ప్రసరించినది. లేని యెడల నా యమూల్యములైన పల్నాటివీరుల వర్ణనము, మైలారభటుల వర్ణనము, ఏకవీరాదేవి సేవాప్రసంగము నిత్యాది యద్భుత, చారిత్రక, మతవిషయము లిందు చేర్పబడియుండవుగదా! అట్టి యుత్కృష్టదృశ్యములు లేకయే కేవలము మాల మేదరులు మున్నగు వర్ణములలో నున్న జారిణుల లీలావిలాసవర్తనములును, వెలనాటి కోడె విధవలును, ఆంధ్రేశ్వరుని వారాంగనయగు మాచలదేవి చిత్రశాలానేపథ్యశృంగారమును ఇత్యాది విటవిట శృంగారప్రసంగములు మాత్రమే యుండియుండును. ఎతిగిరియో యేలుంగకయో వల్లభామాత్యుడు తన చిన్నవాటకమును కేవలము హాస్యశృంగారరసప్రేరితముగ చేయక యప్పటప్పటి సదాచారభావస్ఫురితముగగూడ చేయగల్గెను. ఉత్తమువిూద గ్రంథమానూలాగ్రముగ స్త్రీలును, బాలురును జదువదగినది కాకపోయినను కొన్నిపట్టులు చరిత్ర, మతసంబంధమైనవి యగుటచే పఠనయోగ్యములుగా నున్నవి. ఇవి తమోవృతమైన నభమున నక్షత్రముల వలె విరాజిల్లుచున్నవి. వానిలో మేటియనదగు పల్నాటి వీరప్రసంగ ముత్కృష్టకావ్యరసభావములకు రత్నఖని యని చెప్పవచ్చును.

ఈ వీథియందలి శృంగారరసము నీచమై, యశ్లీలమై, నీతిబాహ్యమై యుండుటచేత సామాన్యముగ యువతీయువపఠనీయము కాకపోయినను ఈగ్రంథ మాంధ్రుల ప్రాచీన సాంఘిక చరిత్రమునకు కొంత విలువయైన సామగ్రి నొసగుచున్నది. పదునేనవశతాబ్దిలో హిం సంఘస్థితి యెట్లుండెనో యాదృశ్యము మనకండ్లకు స ముగా నగపడునట్లు కావ్యరూపముగ దీనియందు వ పబడినది. హిందూసంఘమందలి వివిధవర్ణములు, వ లు, కులములు, వారివారి యాచారములు, క్రీడావిన ములు మొదలయినవి ప్రాసంగికముగా వర్ణింపబడిన మేదరవాండ్రు, మాలవాండ్రు, తెలికులవాండ్రు, క లు మున్నగువారి ప్రశంసలు కలవు. అప్పుడైనను టకూళ్ల భోజనములు బ్రాహ్మణులే పెట్టుచుండిరి. కాలమందున్నట్లే యాకాలమందును బూటకూళ్ల యి లో దుష్టప్రవర్తనముగల స్త్రీలుండి, పాంథజనులను ద ములవలె నాకర్షించుచుండిరి.

శిష్టాచార సంపత్తిలో నగ్రస్థానమలంకరించిన కొందరు బ్రాహ్మణులు నీతిబాహ్యమగు కాముకవ్యా పారములందుగూడ నగ్రస్థానము నలంకరించి యుండి గోవిందమంచనశర్మ వేశ్యాలంపటుడై యెదురైన స్త్రీ నందరిని విటదృష్టితోనే చూచుచుండెను. ఐనను ఇం వద్ద నిత్యాగ్నిహోత్రము, త్రికాలసంధ్యానుష్ఠానపరు దర్భాంకురాలంకృతహస్తుడై పురవీథులందిరిగెను. ప్ర పరుద్ర మహీపతి వారాంగనయైన మాచలదేవితో టాడుచు సంధ్యానుష్ఠానమునకు వేళయగుటచే వా చ్చెను. ఇట్లు వైదికాచార సంపత్తిలో నైంద్రియ గానురక్తి మేళవించి పణ్యయువతీలోలుడై చరించె మతమునకును, శీలమునకుగల వైరుధ్యము నేటికాలము దుండినట్లే యాకాలమునందుసహిత ముండెను. ఈ మందు కందుకూరి వీరేశలింగముగారు వేశ్యాభుజంగ విద్యార్థికుల గుఱించి తమ ప్రహసనములలో తీవ్ర పరిహసించిరి. సుమా రేనూరుసంవత్సరముల క్రిందట కొండ వల్లభామాత్యుడు నట్టే విద్యార్థికుడగు కా నాటి గోవిందమంచనశర్మను గుఱించి భావగర్భిత వర్ణించి నేలియెనర్చె. ఈ గ్రంథమందలి కవితధారా ప్రౌఢమై రసపుష్టికలిగియున్నది. శృంగారవిషయ నత్యుత్కృష్టముగ స్పృశింపకపోయినయెడల నిది జనాదరణీయమగు గ్రంథములలో చేర్చుకొనదగి

యెంత మనోజ్ఞముగానున్నను విషయములం
లైన రసభావములం చాలవరకు క్రీడావిహీన
ఉండుటచే గొంతయెవగింపు గలిగించుచున్నది.
ముప నీగ్రంథమున కున్నతస్థాన మిచ్చుటకు వల

నుపడదు. ఐనను మేలైన యాంధ్రచరిత్రకవిషయముల
నెక్కుడుగ నిచ్చుటచే నీగ్రంథ మాంధ్రుల కమానవముగు
పాయ మొనరించుచున్నది. కాన దీనిని వయూల్యాంధ్ర
గ్రంథములలో నొకటిగఁ బరిగణింపదగినది.*

---

ఇదివరలో నాచన సోమనాథుని గురించి వ్రాసినప్పు డాతడు నియోగియా వైదికియాయని నిర్ణయిం
గిన వాదప్రతివాదముల గురించి ప్రాసంగికముగా సూచింపవలసివచ్చినది. ఆసందర్భమున వ్రాయుచూ
లి బ్రాహ్మణులలో వైదికనియోగిభేదము గగనకుసుమమువలె నుండెనని చెప్పితిని. కీ. శే. వంగూరి
వుగారును, కం. వీరేశలింగం పంతులుగారును వాకాలపు కవులలో గొందరు నియోగులనియు గొందరు
యు భేదముగా నున్నట్లు వ్రాసిచ్చిరి. సుబ్బారావుగారు నాచన సోమనాథుడు నియోగియని చెప్పుట
. సోమనాథుడు నాదిరాజు కొడుకని యొకానొకకవి చెప్పుటచేతను 'రాజ' శబ్దము నియోగులకే గాని
పండదన్న విశ్వాసముచేతను ఆయన యట్లభిప్రాయపడెను.

స్తుత మీ 'క్రీడాభిరామ' మాకాలపు గ్రంథమగుట స్పష్టమేకదా! ఇది సాంఘికప్రబంధ మగుటచే
ల స్థానుగురించికూడ గొంత తెలియవచ్చుచున్నది.

యకుడగు కాసల్నాటి గోవిందమంచనశర్మయీపాల అప్పయ్య ద్వివేదికి మేనల్లుడు కాబట్టి యితను కాద
దిక బ్రాహ్మణుడని స్పష్టము. అయినను యితనిగురించి పేర్కొనిన స్థలములలోఁ గొన్నిటియందు 'శర్మ'
గొన్నిటి లందు 'రాజ' యని యు భేదము లేకుండ వాడబడినవి.

"గోవిందమంచనశర్మ" (పు. 5) 2. 'గోవిందశర్మ మాధవునిపట్టి' (పు. 6) 3. 'మాయ శేడిపైతి మంచి
. 5) 4. 'మింటిటద్దంబు చూపరా మంచిరాజ' (పు. 28) గనుక 'రాజ' శబ్ద మాకాలమున నియోగిభేద
గాదని మనవిచేయుచున్నాను.

క నిట్టి సాంఘికచిత్రము లెన్నియో కాన్పించుచున్నవి. 'పిళ్ల' యనునది బ్రాహ్మణపరముగా వాడుక
ది.

# అముద్రితాంధ్ర ప్రబంధ కవితా విశేషములు

బుర్రా శేషగిరిరావు గారు "భారతీతీర్థ ప్రధాని"

"కావ్యం యశసేఽర్థకృతే శివేతరక్షతయే" యని కృతిరచనాఫలనిర్వచనము లక్షణగ్రంథములలో కలదు. కావ్యము "శ్రేయోభివృద్ధి"కై రచించునట్లు కనుపర్తి అబ్బయామాత్యుని "అనిరుద్ధ చరిత్రము"లో కలదు. ఎట్లనగా:—

క. అనిరుద్ధ చరిత్రము చ
క్కని ముచ్చట విస్తరించి కణగి ప్రబంధం
బొనరింపుము శ్రేయోవ
ర్ధనమగు మాపేర నంకితము సేయు తగన్.

* * *

ఈ అనిరుద్ధచరిత్రము నబ్బయామాత్యుడు తన "సారస్వతపారిజాతతరువునకు సత్ఫలము"గా రచించినట్లు వర్ణించినాడు. ఇట్టి వర్ణన మరుదైనది గనుక ఉదాహరణీయము.

శ్రీమంగళాద్రి లక్ష్మీనృసింహుల కటా
క్షాంచలామృతవృష్టి నంకురించి
సంగీత సాహిత్యసరస సౌష్ఠవయుక్తి
శాఖోపశాఖల చాలఁ బ్రబలి
రసికరాజన్య ముఖ్యసమాజ బహుమాన
సతత వసంతాభిరతిఁ జిగిర్చి
శైవ నాయాంకిత స్తవ మనోహరభావ
పదవాక్యసుమముల బరిమళించి
యభినవస్థితిఁ బెంపొందు నస్మదీయ
భాగధేయ సారస్వత పారిజాత
తరువునకుఁ దగు సత్ఫలోదయము గాఁగ
సముచితంబగు నొక ప్రబంధము రచింతు.

* * *

౨. "వాగర్థ ప్రతిపత్తి" కొరకు కాళిదాసకవి "పార్వతీపరమేశ్వరుల" స్తుతించు మంగళాచరణము గావించెనుగదా! దీని కనుకరణమో యనునట్లు "అహల్యాసంక్రందన విలాసము" లో వేమనారాధ్యుల సంగమేశ్వరారాధ్యులు "ఇష్టదేవతాస్తుతి" గావించెను. ఈకృతి శ్రీ వాసిరెడ్డి చంద్రమౌళిభూపతి కంకితము. ఇష్టదేవతాస్తుతి యెట్లనగా:

శ్రీగౌరీకుచకుంభ శుంభదురుకా
శ్మీరాంగరాగారుణా
భోగానంగ మురంబునం బెరయఁ దె
ల్పున్ రక్తశుక్లప్రభా
యోగబ్రహ్మాకృతిన్ జగజ్జనులకే
యుల్లాసి యద్దేవు నా
త్మాగారంబున నెంతు మత్కవిత శ
బ్దార్థోభయవ్యక్తికిన్.

౩. నన్నయ వాగనుశాసనత్వమును ప్రబంధకవు లెవరికి తోచినరీతిని వారు కవిస్తుతులలో సమర్థించియున్నారు. ఇట్టిసమర్థన వైవి

ను అముద్రితప్రబంధములనుండి యుదా
నవచ్చును. ఎట్లనగా:—

౨. ఆంధ్రశబ్దచింతామణియను వ్యాకర
చేయుటచేత నన్నయకు వాగనుశాస
ను సిద్ధించుచున్నదని చాలామంది పండి
తలంతురు. పూర్వకవు లందరు నట్లు
యుండలేదు. సంస్కృతవ్యాకరణమును
యుటచేత వాగనుశాసనత్వము నన్న
సిద్ధించినట్లు నడిమింటి వేంకటపతి "అభి
రాఘవము"లో సూచించెను. ఎట్లనగా:

రణిం బెంపు వహింప వ్యాకరణమం
థానంబు సాధించి ని
తభాషాంబుధిఁ ద్రచ్చి యాంధ్రసముదం
చద్వాక్సుధాలక్ష్మిచే
సదార్థ విబుధాంతరంగముల క
త్యానందము ల్గూర్చు నే
రుల న్నన్నయ తిక్కయజ్వముఖులన్
భావింతు వాక్సిద్ధికిన్.

౩. నన్నయకు భారతరచనవల్ల వాగను
త్వము కలిగినట్లు "ఆదిలక్ష్మీవిలాసము"
క్కనపల్లినరసింహకవి వర్ణించెను. ఇట్లు:

న్నక భారతంబు ముద
మేర్పడ నేర్పున నంధ్రభాష నం
న్నతచే రచించి మహి
వాగనుశాసనసోమయాజికా
న్నతిగాంచి లోకముల
భూరియశోధనులైనయట్టి మా

నన్నయభట్టు తిక్కకవి
నాథుల సాధుమతిన్ నుతించెదన్.

౪. ఆంధ్రప్రబంధము లొకే ఫక్కిగా
నుండుననియు, వర్ణనలు చర్వితచర్వణముగా
నుండుననియు కథా సంవిధానములో నూత
నత్వముండదనియు, నేవో కొన్నితప్ప మిగిలిన
వన్నియు "ప్రాయ్యనిడదగిన వ"నియు కొంద
రాంధ్రప్రసిద్ధ విద్యాధికవిమర్శకు లందురు.
ప్రబంధకల్పనలో నూతనత్వము కల్పించుటకు
కవులెంతప్రయత్నపడిరో వీరు విచారణచేసి
యుండినయెడల నిట్టి విపరీతాభిప్రాయములు
ప్రకటించియుండరు. ఈ యంశమును గూర్చి
కొన్ని యుదాహరణములు:

(శ్రీ) ధామెర్ల అంకభూపాలుడు రచిం
చిన "ఉషాపరిణయము" లో మంచి ఉదాహ
రణము కలదు. ఈదామెర్లవారు వెలమలు.
అంకభూపాలుని సోదరుడు వెంకట భూపా
లుడు చెంజీరాజును జయించి తమతండ్రిపేర
"చెన్నసముద్రము" అను గ్రామమును కట్టిం
చెను. ఈతని మరియొక సోదరుడు అయ్యన్న-
పతి ప్రళయకావేరి (పులికాట్టు) కిన్ని మైలా
పురమునకున్ను మధ్య తమ తండ్రిపేరనే
"చెన్నపట్టణము" కట్టించెను. "ఉషాపరిణ
యము"లో అంకభూపాలు డిట్లు రచించి
యున్నాడు:

మును గృతులేసిన ఘనుల రీతులకన్న
వింతలై నేర్పుచే వెలయుచుండ

లలితము గూఢము లక్షణయుక్తంబు
చిత్రవైఖరియునై చెన్ను మెరయ
ధారాళగతియును దగు జాతివార్తయు
శృంగార విధమును చెలగుచుండ
శబ్దగాంభీర్యంబు చతురోపమోత్ప్రేక్ష
లును దగుచోటుల దనరుచుండఁ
సమ్మదంబున బుధులెల్ల సంస్తుతింప
నొక మహాకృతి యతులకౌతుకముతోడ
నొనర రచియింపగా బూని యున్న వేళ
నధికతరమైన నాదుభాగ్యంబుకతన

* * *

(బి) ప్రౌఢ ప్రబంధకవులు తమకృతుల కాభిముఖ్యము కల్పించుటకునై తమ కవితా పాండిత్య విశేషముల నోకించుక వర్ణించు కొనుట యాంధ్ర కవిసమ్మతమై యున్నది. పైనుదాహరించిన "ఉషాపరిణయము"లో కవి పాండిత్యాదికము లిట్లు వర్ణింపబడినవి:

సీ. అలరజేయగ నేర్తు వసహాయశూరత
ఘటికాశతగ్రంథకల్పనంబు
సవరింపనేర్తువు సర్వతోభద్రకం
కణబంధముఖ చిత్ర కావ్యరచన
ప్రకటింపనేర్తువు వికచపంకజ బృంద
మకరంద నిష్యంద మధురఫణితి
ఘటియింపనేర్తువు కమనీయపదబంధ
సంధాన సరస విస్తరణసరణి
పదమైత్రిరసజాతిపద్యశబ్దశ్లేష
దురవగాహార్థ ప్రస్తరనిగూఢ
ఘటికాప్రబంధ హృద్గత సమస్యాగీత
తాయనావీననాటకవిభేద
భరతకళాశాస్త్రపాదార్థగుప్త్యను
లోమవిలోమాచలోష్ఠజిహ్వా
సదుపమాలంకృతి కవిత్వ సాంఖ్యయోగ
మంత్రపట్టంత్ర తత్త్వంత్రయంత్రపార
గంత్వవిజ్ఞాననిధి విజ్జగమున కవులు
నీ సరెవ్వరు వేంకటదాన సుకృతి.

(సి) ఇట్టిపాండిత్య ప్రకర్షాకీర్తనమే ఘట్టు ప్రభువు "కుచేలోపాఖ్యానము"లోకూడా కన బడుచున్నది. ఎట్లనగా:

సీ. భ్రమరాంబికావరప్రభవదివ్య కవిత్వ
విద్యాప్రవీణత వెలసినాడ
ఘటికాశతగ్రంథ ఘటనానమంచిత
చాతుర్యమహిమకుఁ జాలినాడ
ప్రౌఢిమ నేకైకపక్షమానమహా ప్ర
బంధకల్పనశక్తిఁ బ్రబలినాడ
మరియు నానావిచిత్ర మాధుర్యవాక్యప్ర
కల్పనంబున నుతులొందినాడ
శ్రీకుధరమల్లికార్జునశ్రీపదాబ్జ
మత్తభృంగాయమాణ సన్మానసుండ
సత్కవీశ్వరకరుణాప్రసాదవశుడ
ఘట్టుప్రభునామధేయవిఖ్యాత యశుడ.

౫. (ఎ) ఆంగ్లకవులనేకులు శైశవమందే కవిత్వము చెప్పినట్లు నిదర్శనములు చాలా కలవు. అట్లే ఆంధ్రకవులును శైశవమునసే కవిత చెప్ప నేర్చినట్లు చెప్పుకొనియున్నారు. ఎల కూచి బాలసరస్వతి మహోపాధ్యాయ విర చితమగు "చంద్రికాపరిణయము"లో నిట్లు గలదు:—

బాల్యమున బల్కు ప్రవిముగ్ధ భావణముల
తోడనె కవిత్వపద్యసూక్తులను బల్కు
నేర్చి విఖ్యాతిమెరసి పండితవరుండ
నైతి నిది శారదయనుగ్రహంబు గాదె."

(బి) ఇట్లే మరికొందరు చిన్ననాటనే త్వము చెప్పినట్లును ఏయేవయసునం దాయా వభావముల కనుగుణముగా కవితలు సాగించి ను శ్రీనాథకవి "నూనూగు మీసాల" రుపద్యములో సూచించినట్లు చెప్పియున్నా ఎట్లనగా:

కొలకనూరి వీరన్న రచించిన "భల్లాణ చరిము" లో

పదునాలు గగునేట మొదల కృష్ణార్జున
సంవాదము ప్రబంధ సరణినయ్యె
పదునెన్మిదగునేట బంచ కావ్యము లాంధ్ర
పద్యకావ్యములుగా పరిఢవిల్లె
ఇరువది రెండగునేట విభూతిమా
హాత్మ్యంబు ద్విపదకావ్యముగ నొప్పె
ఇరువదియారగునేట మార్కండేయ
చరితంబు రచితమై సంఘటిల్లె
ముప్పదగునేట మనువంశ ముఖ్యనృప పు
రాణములు ప్రకల్పితమయి ప్రకటమయ్యె
ముప్పదారగునేట శ్రీముక్తదేవు
కథ కథితమయ్యె నాచేత గౌశలమున.
సంస్కృతంబైన శంకరాచార్య విరచి
తంబు లానందలహరి సౌందర్యలహరి
భర్తృహరి కృతమైన సుభాషితమును
శతకములుగాగ మత్ప్రకల్పితములయ్యె.

ఇట్లే "ప్రబంధరాజీయము"లో గణపవరపు వేంకటకవియు చెప్పుకొనినాడు.

సీ. శ్రీకరంబుగ, బదిరెండవయేట దా
రావళుల్ ఘటియించి ప్రౌఢిగన్న
మునుమునిమిూసంబు మొనయునేట యమక
శతక మ్మొనర్చి కౌశలముగన్న
యిరువదియేటను శృంగారమంజరి
యు నుదాహరణ జేసి ఘనతగన్న
యిరువదేనవయేట గృష్ణ మల్లకథ చ
తుర్భద్ర జెప్పి సంతుష్టిగన్న
మరియును బాలరామాయణ ద్విపద పొ
నంగించి బహువిధచాటుకవిత
నతిశయముగన్న నాదు జిహ్వాంచలంబు
తనివినొందదు కులదేవతావతంస
వేంకటేశ్వరచరణారవిందమహిమ
నవనవోన్మేష వేళ వర్ణనలగాక.

ఈ వేంకటకవి "ప్రబంధ రాజీయము" ఆంధ్రమం దపూర్వకావ్యము. ఇది యాంధ్ర లక్షణవిశేషముల కన్నిటికి నేకలక్ష్యముగావిరచింపబడియుండుట దీని "సంకల్పగద్య"లో చేర్కొనబడినది. ఎట్లనగా:—

"అంకితంబుగా.............గావ్యాలంకార చూడామణికిఁ గావ్యాలంకారసంగ్రహంబును, సకలాలంకారంబులకు నలంకారంబును, సర్వ లక్షణసారసంగ్రహ సరస్వతీవిలాస సాహిత్య చింతామణి సత్కవిజన సంజీవని భీమానంత ఛందోముఖ్యాష్టాదశలక్షణంబులకు లక్ష్యంబును,.........సమరామర శేషవిశ్వశాశ్వత శబ్దా

ర్ణవ యాదవవైజయంతీకార నానార్థ రత్న మాలికాహలాయుధ వాగురికా కేశవ కామ పాల ధరణీ ధన్వంతరి ధనంజయ రభస విశ్వ ప్రకాశ మాధవ చింతామణి జయ ప్రతాప శుభాంగజయపాలక్షీరస్వామి ప్రణీత చతుర్వింశ తి విధ నిఘంటు పదమ్ముల కాస్పదమ్మును, షష్టవిధ యతిచమత్కారమ్ముల కాధార మ్మును, జతుర్విధప్రాసమ్ముల కావాసమ్మును, ప్రౌఢికిఁ బ్రౌఢియు, తేటకుఁ దేటయు, జిరంత నాంధ్రప్రబంధప్రయోగజాలమ్ముల కాలవాల మ్మును, సనాతన విద్వత్కవితానరచనా విధానమ్మునకు ఘంటాపథమ్మును, నిదానింతన సత్కవి నికాయమ్మునకు సహాయమ్మును, భవితవ్యకవికలాపంబున కాచార్యరూపంబును, నిఖిలభాషావిశేషంబుల కున్మేషంబును, మూఢ జాతులకు బోధహేతువును, బ్రౌఢతతికి సమ్మ తియును, సర్వజననికరమ్మున కాశ్చర్యకరమ్ము ను, బహువిధాచుంబిత కవితా చమత్కృతికి వసతియు, నగరార్ణవశైలర్తు సూర్యోదయో ద్యాన సలిలకేళీమధుపాన సురతవియోగవివా హ కుమారోదయ మంత్రదూత ప్రయాణ నాయకాభ్యుదయ వర్ణనాతిశయంబున కాశ్ర యంబును, నన్యావధీనసుధీనవనవ స్తవ్య సర్వా వధీన పాండితీమండిత చమత్కారంబునుంగా నా రచియింపంబూనిన రసికహృదయోల్లానం బైన ప్రబంధరాజ "వేంకటేశ్వర విలాసంబు నకుఁ గథావిధానం బెట్టిదనిన."

భాషాపాండిత్యవిశేషములు చాలా సన్న గిల్లిపోయిన యీ త్రింశత్యుత్తర ద్వివింశతిశతాబ్దిలో నీ గద్యలో నుదాహరించినట్టి పాండిత్య విశే ములకు మన మచ్చెరువందవలసిన దేగాని య్ వాటితారతమ్యము లెంచజాలము.

౬. సంగీత సాహిత్యములు సరస్వతీ స్త ద్వయములనియు, నట్టి స్తన్యపానముననే క కుమారులకుఁ గావ్యసిద్ధి లభించె ననియ చెప్పుట సుప్రసిద్ధము. ఇట్టి సంగీత సాహితా నుకూల్యమును, పాండిత్యమును ఆంధ్రకవుల వర్ణించియున్నారు. ఉదాహరణములు:

(ఎ) కనుపర్తి అబ్బయామాత్యుల "కవిరాజ మనోరంజనములో—

క. శ్రీమంగళగిరి నరసిం
హామేయ కృపావిజృంభి తాద్భుతకవితా
శ్రీమంతుఁడ గానకళా
ధీమంతుఁడ దేవతాస్తుతివ్రతపరుఁడన్.

(బి) నల్లూరి నరసింహకవి "నాగ్నజి పరిణయములో—

తే. తదనుసంభవుఁ డైన మజ్జనకునకు స
హోదరుండైన వెంకన్న యురుకవిత్వ
తత్వ సంగీత విద్యానిధానమగుచు
రాజవిద్వత్సభలలోనఁ దేజరిల్లె.

(సి) చంద్రికాపరిణయములో బాలస స్వతి పండితులు జూపల్లివారి వంశము వర్ణించుచు వెంకటాద్రినాయనింగా రిట్లు చె నట్లు వర్ణించియున్నాడు.

క. పరమేశ్వరియగు భారతి
కరుణ వడసి వివిధశాస్త్ర కవితా సంగీ

హాస్య తజ్ఞులై పర
కీర్తుల మత్కులమునఁ గీర్తితులెల్లన్.
. నన్నయతో సమకాలీనుడని యధ
ార్యుడను నొక వైయాకరణికి ప్రతీతి
అతడు చేసిన భారతములోని పని
వ్యము లుదాహరింపబడి లక్షణగ్రంథ
కనబడుచున్నవి. ఈతనిని కవిస్తుతు
ార్యులలో నెవ్వరోగాని చేర్చియుండ
టిస్తుతు లుదాహరింపదగియున్నవి.
"నాగరఖండము"లో—
పను దిక్కమఖిఁ బ్రబంధ పరమేశు
నాథర్వణాచార్యుఁ జంద్రదహాళి
రు ననంతు శ్రీనాథభట్టు భీము
నమరేంద్రుఁదలతు నుత్సుకతనాత్మ!
కొప్పర్తి నరసన్నకవి "రుక్మిణీపరిణ

యవర్ణన తరువాత)
కృతివివేకకృద్బుధత గను తప
నథర్వణాచార్యవరుని,
కవితాపితామహాత్వాంకధారి
రముగన్న యలనాఁ పెద్దసూరి
ంచెద వైకృతఖ్యాత కవుల
క్షణకవుల నే నహరహంబు."
కృతికర్త మతమున నాంధ్ర లాక్షణిక
ను "వైకృతకవులు" అనగా ఆంధ్ర
ృతభాషావిశేషమని యీతని యభి
అనగా సంస్కృత ప్రాకృతజన్య
వా.

౮. పై ౭ వ పేరాలో అల్లసాని పెద్దన కవికి "ఆంధ్రకవితాపితామహ" బిరుదముచెల్లియుండిన ట్లున్నది. ఇట్టి బిరుదము శ్రీకృష్ణదేవ రాయలవారి కర్ణాటకరాజ్యములో వారికాలములోనే ప్రసిద్ధమైనదికాదు. ఆ ప్రాంతమందు కాకతీయరాజుల యేలుబడిలో ప్రతాపరుద్ర మహారాజువారి కాలములో కూడా చెల్లియుండెను. ఇందుకు నిదర్శనము:—

తాళ్లూరి శరభరాజకవి "శరభ రాజీయము"లో—

చ. అతడు ప్రతాపరుద్ర వసు
ధాధిపుచేత నవాగ్రహారముల్
హితమతి నంది నిర్వ్యసచి
వేశ్వర సంతతికెల్ల మేటియై
యతులిత సంస్కృతాంధ్రకవి
తావలికెల్లఁ బితామహుండనన్
సతతము పన్నె కెక్కు బుధ
సంఘములోన మహాప్రసిద్ధుడై.

౯. ఆంధ్రకవిత్వచరిత్రమందు పూర్వోత్తరవిభాగకల్పనము బ్ర. శ్రీ వీరేశలింగము గారు గత శతాబ్దములో కల్పించినదే కాదనుటకు ఒక్క నిదర్శనము:—

కంచర్ల శరభన్నకవి "అధ్యాత్మరామాయణము"లో

సీ. కాళిదాసుని........

..................

........నన్నయభట్టును నన్నుతించి

సొంపుగా దిక్కనసోమయాజిని వేడి
భాస్కరు కవివరు భక్తి గొల్చి
నవకవీంద్రుల శ్రీనాథకవిని బోత
రాజుఁ బింగళిసూరపరాజు నల్ల
సాని పెద్దన్నఁ దిమ్మన సరస రామ
లింగకవి రామభద్రుల లీల దలతు.

౧౦. కవనము "ముక్తికొఱకని" యేల క్షణ కర్తయు చెప్పియుండలేదు. "శివేతరక్ష తయే" యన్న కారికలో నిది చేరదు యాంధ్రకవులుమాత్ర మీా పురుషార్థమ మరువలేదు. నిదర్శనము: పై పేరాలో న హరించిన "అధ్యాత్మ రామాయణము"ల

క. భవబంధముక్తికొఱకై
కవనము రచియింపఁబూని కనుమూసిన
నవకంజనేత్రుఁ డొక్కఁడు
చెవిలో నాకిట్లు పలికెఁ జిత్తంబలరన్.

---

# తుంగభద్రాతటము

కె. అన్నమరాజశర్మ గా

౧

అంబరశ్యామ కుటిలనీలాలకముల
నాఱవిడిచిన లీల దిగంతరముల
నీలకాదంబినీతతుల్ నెఱయ, చంచ
లాలతల్ మెయిలుఁ దెరల లాస్యమాడ,
ఎడఁద కలగుండువడ చెవుల్ గడెలువడఁగ
ఫెళఫెళార్భటి పటుతరాభీలచటుల
వజ్రనిర్ఘోషములు నిండె, ప్రకృతిముఖము
శోకము వెలార్చె యామినీ క్షుభితకళల.

౨

హోరుమని వీచువాయువుల్ దారివిడువ
తుంపురులు రాలఁదొడఁగె ఖద్యోతగణము
భువికి జాఱిన తారల పోలుపుదోఁప
తళ్కుతళ్కన నందందఁ దనరుచుండె,
నూతనాంభఃకణంబుల నూలుకొనెడు
తుంగభంగాకులంబైన తుంగభద్ర
కనులకుం దోఁచె తన్నిశాకాలమందు
దరుల నోలాడుచు గర్భిణీతరుణికరణి.

౩

ప్రమదమునఁ బొంగు తుంగభద్రాస్రవంతి
కనలితీరంబునందుండి యాతురమున
దక్షిణావారముం జేర ధైర్యవంతుఁ
డొకఁడు కల్లోలడోలికాప్రకరములను
ద్రోసికొనివచ్చుచుండెను తుహినకిరణుఁ
బరిహసింపఁగఁజాలు సుందరియొకర్తు
కుటిలకుంతల హరిణాక్షి కోమలాంగి
అనతిదూరాన నాతని ననుకరించె.

౪

మాయురే! స్వర్గముననుండి మహికి దిగిన
అప్సరఃకన్యయో-కాదు యవనజాతి
బాలికామణి భవ్యలావణ్యసీమ
పదియునాఱేండ్లుదాఁటని పసిడిబొమ్మ

ాపురరాజేంద్ర ధిరాధినేత్ర
గుల్బహారుకుమారి వినుతచరిత
జేర నీదుచురాఁగ వృష్టి యంత
గూడ నధికమై యావరించె.

౫

ాంతశిలా సుప్రసన్న సౌధ
ల సంచరించిన రాకుమారి
రివచ్చు సుందరు ధన్యశీలు
కుమారు నొక్కని నాత్మమెచ్చి
ంరావృతశుపా కాలమందు
ం బడి పోవఁగా దయదలంచి
ాంతలు దీవించి యక్షతలను
ున వడగండ్లు జాలువారె.

౬

వేవేగ కూలంబుఁ జేరఁదలఁచి
ోడఁగెను కెరటాల పాముమాడ్కి,
తకు నిశ్శ్వాస మధికమొంద
రిదనవచంద్రఖండమటుల
శికమై జగన్మోహనముగ
ండిన యా రహో దృశ్యమెల్ల
దామనీవల్లి తళుకు లీన
ం లేఁత వెన్నెల గాఁగఁ దోఁచె.

౭

ారాని దురవస్థఁ పాలఁబడియె,
ుం దీఁదుచుండిన సుందరుండు
ిగుండమందున నొఱఁగిపడియె—
చ్చినఁ గానని కాళరాత్రి
మ్యెను తదవస్థ కన్నెమిన్న
ుాఁదుచునుండె నక్క మోసమునకు

దక్కనేకాని లేకున్న తత్క్షణమున
గుండియలు ప్రీలి నట్టేటఁ గూలకున్నె?

౮

ప్రణయమకరందతుందిల భావమైన
గుల్బహారు మనోజ్ఞాంగి కుందరదన
అల వియద్గంగఁ జెరలాడు హంసివోలె
ఎంతసేపో తరంగాళి నీఁదియీఁది
గట్టుజేరఁగ కొన్నియేక్షణములుండె
కాని, దైవోపహతులైన మానవులకు
కల్గునే స్వప్రయత్నాన కార్యసిద్ధి
పెదవి కందిన గిన్నెయుం బ్రిదలిపడదా!

౯

అకట! ఆశాంకురము లడుగంటిపోయె
నయ్యలేఖ్యలతనూవిలాసాతిరేక
మామనోహర శరదిందు హాసముఖము
స్మరణమాత్రావశిష్టవిచారదంబు
లయ్యెనని చెప్ప నెటులు నోరాడు నింక,
సకల జగదేక మోహిని జలసమాధి
ప్రియుని యాత్మతో నద్వైతవృత్తి దనర
మునిఁగిపోయెను దుఃఖాన ముంచి సఖుల.

౧౦

ప్రణయ జీవిత శేషంబు స్వర్గవాటి
పారిజాత ప్రసూన తల్పంబులందు
గడపఁ దలపోసి యరిగెనో పడుచు జంట
మఱపునకురాని యాముఖమండలములు
కాలవీధి నెన్నటికిని గానఁబడవు!
గుల్బహారు లేక జగంబె కొఱతపడఁగ
శిల్పులు కవులు సౌందర్యసిద్ధికొఱకు
వెదకుచున్నారు వెఱ్ఱులై వివిధగతుల.

# రాయప్రోలు సుబ్బారావు కృతులు

శ్రీ కాళహస్తీశ్వరరావు, ఓలేటి సీతారామమూర్తిగార్లు

యేనామ కేచి దిహ నః ప్రథయం త్యవజ్ఞాం
జానంతి తే కిమపి, తా న్ప్రతి నైష యత్నః;
ఉత్పత్స్యతేఽస్తి మమ కోఽపిసమానధర్మా
కాలోహ్యయం నిరవధి, ర్విపులాచ పృథ్వీ.

—భవభూతి.

ఆధునికాంధ్రలోకమునకు "క్రొత్త పాతల మేలుకలయిక క్రొమ్మెఱుంగులు చిమ్మగా" రచియించిన గురజాడ అప్పారావు తరువాత ఎన్నకొనఁదగినవాఁడు రాయప్రోలు సుబ్బారావు.

సుబ్బారావు రచనములలో నవ్యత, భావవికాసము ముఖ్యములు. కూర్పులో సున్నితము తగ్గినను మహాశిల్పము ప్రత్యక్షము. స్వప్నావస్థలో నావేశోల్లేఖనము చెందిన పికకుమారుని మోహనగీతారహస్యము లీతని కృతులయం దిమిడియున్నవి. చదివిన కొలంది చవులూరించు రచనమున నీతఁడు పన్నెకెక్కినవాఁడు.

ఈతని కృతులు తృణకంకణము, కష్టకమల, స్నేహలతాదేవి, తెనుఁగుతోఁట, స్వప్నకుమారము, జడకుచ్చులు పైవిషయములను స్పష్టీకరించును. అవి విమర్శించుటయే ప్రకృత వ్యాసోద్దేశము.

మొదటఁ బేర్కొనఁబడిన ఐదుపుస్తకములును ఆధునిక ప్రత్యేకశిల్పవిధానము ననుసరించి విలక్షణసార్థకతను నిరూపించు రచనల ప్రకటనకుఁ బూనుకొనిన అభినవకవితామండలి ప్రచురములు. ఆకవితామండలి ఈకవిగ్రంథములను బ్రకటించుటచే దమ యాశయములను విస్పష్టముగను, విదితముగను, సరళముగను ఆంధ్రప్రపంచమునకు విశదమొనరించిన దని మా యభిప్రాయము. 'గమ్మునఁ గమ్మని న్వలెక్ష రాతిరియుఱ బవల్ మఱపురాని హాయల్" అను పెద్దన కవితాలక్షణముల చూపించు నీతనికవిత యొక్కొక్కచో నూహకందనిదై గూఢమై పోయినది. ఇఁక ప్రకృతవిషయములకు వత్తము.

సుబ్బారాయకవి నైతికముగాను, సాంఘికముగాను, పారమార్థికముగాను రచించుటయేకాక దేశకల్యాణమునకు, విశ్వసౌభాగ్యమునకుఁ దోడ్పడురచనములఁగూడ నొనరించ

న్నాఁడు. పరిశుద్ధమగు ప్రేమస్వరూపంబును
ర్శించుచు బద్ధానురాగ పరిణామపోషక
లైన "నరనములైన వావివరుసల్ దెలుపంగ
రాగముల్ లిరముగఁ బాడుకో ప్రణయ
ము" ఐనవృత్తమును "వియోగమం దమృత
విసర్జుఁ సమవృత్తులే" అను సిద్ధాంత
వెలిబుచ్చినాఁడు తృణకంకణములో.

"కడుపు అంపవుఁగోతల ఘటించు కష్ట
మునుగూర్చి విలపించు ప్రేమశీలి యగు
ముగ్ధబాలిక విషాదగాథ కష్టకమలలో
ఱుంపఁబడినది. ప్రేరణధర్మమే పితృగృహ
మునకు దారిచూప శుల్కవాంఛాపరు
సోదరులకు దివ్యసందేశము నంపుచు
స్నేహహార మొనర్చిన చరిత్రము 'స్నేహ
దేవి'. యాత్రార్థినులై దేవీపూజాప్రవణు
కలు బాలికల కిడిన నివాళింపు తెనుఁగు
. కుమారప్రేమబంధురమతియైన యొక
దేవి యీ దేశము 'స్వప్నకుమారము.'
సభూయిష్ఠంబై రసవత్ పుష్పసమన్విత
మృత మధురమైయున్న ఖండకావ్యము
చ్చులు. ఈతనికావ్యముల నన్నిటినిం
నఁ బ్రత్యేక వైలక్ష్యము విస్పష్టమగును.
దేశకల్యాణమునకుఁ దోరణములు కట్టు
గాథల వర్ణించు నీతని పద్యములు రస
ములు.

డాఱఁబాఱు నఖండగోదావరి
దాగిన చాళుక్య నాగరికత,
డైన పెనుకోటగోడల దీర్ఘని
ద్రలువోవు కాకతిప్రాభవమ్ము
పల్లెపదాల జీవము నిల్పికొన్న ప
ల్నాటివీరుల రక్తనాళఘటిమ
కడలేకయేడ్చు తుంగాభద్ర కెరటాల
మణగిన ప్రాజ్యసామ్రాజ్యభరము
హృదయములు విన పలుకక చదువుచెప్పు
పుస్తకతపస్విని తెలుంగుపూలపొదల
నిలిచి సేవాశుకమ్ములఁ బిలిచి పిలిచి
స్థిరత పాడించుగాత జాతీయగీతి!"

—జడకుచ్చులు ౧౧-పు.

ఆంధ్రత్వము, ఆంధ్రగౌరవము, ఆంధ్ర పౌరుషము, ఈకవి

"నిలుపరా నీజాతి నిండుగర్వమ్ము—
లేరురా మనవంటి ధీరు లిం కెందు"
అని యున్ముక్తకంఠముతోఁ బాగడుచు,
"తనగీతి యుఅవజాతిని పాఠకులనుగా
దిద్ది వర్ధిల్లిన తెనుఁగువాణి
తనపోటులు విరోధి తండంబులకు సహిం
పనివిగా మెరసిన తెనుఁగుకత్తి
లేనయందములు ప్రాంతజనుల కభిరుచివా
సన నేర్పి నలరిన తెనుఁగు రేఖ
తన వేణికలు వసుంధరను సస్యశ్యామ
లను జేయఁ జెలఁగిన తెనుఁగుభూమి
అస్మదార్ద్రమనోవీథి నావహింప
జ్ఞప్తి కెలయించుచున్నాడ! చావలేదు
చావలేదు ఆంధ్రుల మహోజ్జ్వలచరిత్ర
హృదయములు చీల్చిచదువుఁ డోసదయు
[లార!"

—జడ. ౯.

అని జ్ఞప్తిసీమలఁగూడ దాటుచున్నాఁడు.

"కృష్ణాతరంగపంక్తిఁ ద్రొక్కిత్రుళ్లింత
నాంధ్రనౌకలు నాట్యమాడునాఁడు
ఇంటింట దేశి సాహిత్యదీపములతో
నాంధ్రతేజస్సు రాపాడునాఁడు
సుకుమార శిల్పవస్తుప్రపంచమునందు
నాంధ్రనైపుణి పంతమాడునాఁడు
సమదసేనావ్యూహ జయపతాకలక్రింద
నాంధ్రపౌరుషము చెండాడునాఁడు
చూచి, సంతోషమున తలలూఁచి, గర్వ
మూచి, ఆంధ్రపుత్రీపుత్రు లందగలరు
శాంతి, సందాక లేదు విశ్రాంతి మనకు
కంకణవిసర్జనుల కిది కాలమగునె?"

—జడ. ౧౦.

అని దేశీయులను రణరంగమునకుఁ బిల్చుచున్నాఁడు. మాతృసేవాతత్పరుఁడై

"విపినబంధుర వృక్షవాటిక
ఉపనిషన్మధు వొల్కనిచ్చట
విపులతత్వము విస్తరించిన
విశ్వమణియిదె........"

అనిచెప్పి పూర్వభూములకు తనతోఁ గూడ పాఠకులను దోడుకొనిపోవుచున్నాఁడు.

"రణరక్తబంధురారుణమైన ఖడ్గతి
క్కాన కత్తి కడిగిన కదనభూమి
అమృతాక్షర వికాసమయిన యోసుకవిపో
తన లేఖని ప్రశాంతిఁ గనినచోటు
భాషాకుమారి కబ్బపుఁ బెండియిల్లైన
కృష్ణ రాజ్యము వెలింగినతెలమ్ము

నానావిదేశ నౌకాసీకవిపులాశ్ర
యంబైన రేవు రూపటిన తావు
పాడయి శిలావశిష్టమై ప్రాప్తకాల
మనుభవించుచు, నుండియు నక్కటకట!
బ్రతికిచెడ్డ యాంధ్రుల పూర్వవైభవంబు
చాటెడిని నాలకింపుడు శాంతిమతులు!"

—జడ. ౭

దేశమునకన్నను ఇతనిప్రేమకు పాత్రమైనది ప్రకృతి. ప్రకృతిమాతృవిలోకనములలో నీతఁడు దివ్యసౌధములను సృష్టించినాఁడు.

"పిలపిలమంచు మంచు
గురిపించెడు వేగున లేచి చిన్నిగం
టలు మెడలందు ఘల్లని స్ఫు
టంబుగ మ్రోయగ మేయు గొత్తెమం
దల నరికాచు గొల్లని యు
దారపుటీలలలోఁ బ్రతిధ్వనుల్
మొలవఁగఁజేసి మైమరపు
ముంపుల..............."

ముంచెడు కోయిలనుగూర్చి,

"నిండుకొగిండ్ల కెసబడి మండువిరహ
మున దపించెడి యేప్రవాసినులఁ గాంచి
మెత్తనగుగుండె జాలికే కెత్తవచ్చె
తెలుతువో నాయికాదేశములను పికమ!"

అనియును,

"ముత్తెపుట్రెప్పల్ నయన
ముల్ డిగజాఱఁగ మాటరాని డ

గ్గుత్తికతోడ నంపకపు
గూతుఁ గవుంగిటఁ బాయలేని యే
మెత్తనితల్లికన్న చెలిమిఁ
మధురంబుగఁ గీతింతువో
క్రొత్తయిగుళ్ల మేసరి! యె
ఱుంగముగా! భవదీయబోధలఁ."
—జడ. ౨౦.

ియును,

"ప్రణయగాథయొ? దారుణరణకథాక
థనమొ? లేక సందేశగాయనకళాక
లాపమో? లేఁట బడదు నీలలిత గీతి
చంచలత నూగు మర్త్యప్రపంచమగుట"
—జడ. ౨౦.

ియు నివ్వెరవోవుచున్నాఁడు. మేఘోదయ
నుగూర్చి,

"ఎండిన బీళ్లయందు నుద
యించిన పచ్చిక కండ్లపండువై
యుండగ చూడిరయాలు తల
లూపుచుఁ బోయెడి, క్రొత్తనీటిచే
నిండెఁ దటాకగర్భములు
నిష్కుటముల్ కడుశ్యామలంబులై
నెండుకొనెఁ వనిఁ, మొగిలు
మేసెఁ బ్రభాతములందు గొండలఁ."
—జడ. ౧౧.

వివరించుచున్నాఁడు. ఒకచోఁ బ్రకృతి
జారతుఁడై

"చెరగిపోని చక్కనిలిపిఁ జెక్కినారు
ఱాల భాగ్యభారత శాసనాల ఋషులు
వానదెబ్బల త్రుప్పును వాసె, చదివి
వ్రేలవే, తల్లి మెడను పూజాలలంతి!"
—జడ. ౩౮.

"తెలుఁగునెత్తుట వెలిగిన దీపకళలు
తెలుఁగుపాలఁ బేరిన మీగడల తరకలు
తెలుఁగుతేనె తీయందనమ్ములను దనిపి
వ్రేలవే, తల్లి మెడను పూజా లలంతి!"
—జడ. ౩౯.

అని యూకొనుచున్నాఁడు. ప్రకృతి విశేషము లనుగూర్చి యితఁడు పచించిన పల్కులు మృదుహృదయుల మన్ననలకుఁ బాత్రమయి నవి. అపుడు ప్రేమతత్త్వనిరూపణ మొనరించుచు నీకవి—

"దప్పిఁగొని చేరిన మిళిందతనయులకును
బూలపాలిచ్చి చీకట్లఁ బోవకుండ
కడుపులో దాచుకొనదె శ్రీకమలదేవి
చేరఁదీసిన మమకార మేరికెఱుక."
—స్వప్న. ౨౨.

"ఎండలోమాడిపోవు లేయిగురు లరసి
యేడ్చునదుల ప్రేమోదంత మెవ్వఁడెఱుఁగు?
నీటితరగల రేల్పవల్ నృత్యమాడు
చంద్రసూర్యులుగూడ నాజాడఁ గనరు."
—స్వప్న. ౨౭.

"నష్టమైనట్టి ప్రేమఖండముల కొక్క
సుకవియుతుర జీవగీతికయు చాలు,
నఖయు విశ్వాసబాష్పముల్ చాలునాకు,
లేదు వేఱాన ప్రణయపల్లీమతల్లి!"
—తృణకంక. ౨౮.

"ప్రియముతోఁ బెంచుకొన్న తీవియలుకొన్ని
విషలతలటంచుఁ దోఁచినఁ బెరికివైతొ?
పూలుపూయవో? పరిమళంబులనువిడవొ?
చూడ సుందరములు కావొ సొగసులాడి?"
—కష్ట. ౨౭.

"లేఁదమలపాకుఁ బాత్రబాలిక రచింప
నాకునాకునఁ గాయు ముత్యాల నొకఁడు
నింపుచున్నాఁడు దాని,కన్నియరో! త్రాఁగు
దురో!తుది నొలుకఁబోసికొందురో వనాన!
—కష్ట. ౨౬.

వలుద జడపాయల ముసుంగువడిన పువ్వు
పగిది, పలుకనికోకిలబాలభాతి,
భావ మీయని మొలగువ్వపడఁతి నేమి
సేయఁగలవాఁడొ? యాబిడ చెలిమికాఁడు!
—కష్ట. ౨౬.

అని ప్రకృతిరహస్యములను వెలువరించినాఁడు. అప్పుడే

"పడకటిలుఁజూచి యేడ్చు జవ్వని యొకర్తు,
చనినదెసఁజూచి యేడ్చు జననియొకర్తు,
తనసొగసుఁ జూచి యేడ్చు సుందరియొకర్తు,
ఏడుపుఁ బ్రియమ్ముగా వచియింపరేమొ?"
—స్వప్న. ౨౭.

"సరససాంగత్య సుఖవికాసములకన్న
దుస్సహవియోగభరమె మధురము సఖియ!
బాధలేక వ్యసనరుచి బోధపడదు
చీఁకటులు రానిదీపిక చెలఁగనట్లు."
—తృణ. ౨౯.

అని వియోగదుఃఖమును గూర్చియు మనుష్య తత్త్వమునుగూర్చియుఁ జెప్పినాఁడు.

ఈతని కవితలో నొకవిశేషము మెచ్చుకొనఁదగినది. వివరింప వీలులేని వృత్తాంతములను ఉపమలతో నింపి హృదయముల కదలింపగలశక్తి ఈకవికి మెండు. ఉ.—

"నాటకై శ్రుతియయిన వీణాసజీవ
తంత్రు లానందకథైరవిఁ దనుపఁగలవె?
జీర్ణకుసుమసన్నిధి రుచించిన విదగ్ధ
నకుఁ, బ్రసూతశోభన మేమిటికిఁ దలంప."
—స్వప్న. ౧౭.

"పూలబిడ్డలఁ బ్రీతి నుయ్యాలలూపు
పవనుఁ డెఱుఁగఁడు తొడిమలు వదలుననుచు
తలపులకు విరుద్ధములైన ఫలితములకు
బాధ్యులెవ్వరొ? పుణ్యపాపమ్ము లేవొ?"
—స్వప్న. ౧౭.

"నవకము క్రుంగిపోఁ బ్రియము
నం బ్రసవించుభరమ్ముమాత్రమే
లవలికవంతుగాక, యపల్క
తదనూనసుమమ్ము లాస్తబాం
ధవి జడ సందగించునో?
వృథాపడిపోవునో! దేవపూజపా
లవునో? యెఱుఁగఁజాలదు,
రహస్యము లిట్టివెసుమ్మి సృష్టిలోఁ."
—స్వప్న. ౧౭.

ప్రకృతిలోఁగల్గు విశేషములలో ప్రస్తుత పరిణామములను గూర్చి ప్రస్తుత పరిస్థితులఁ

యీతఁడు పాడిన పాటలు మధుర

పవృత్తికిఁ జండాలభేదమేల?
ఘ్రాణాగ్రహారమునందుఁ బవలు రేలు
సుపవనుఁడు కడజాతిపేటియందు
కలేక వీచునె పక్షతంత్రజడిమ?
పుఁబత్రివతను శిరసావహించి
తయశస్వినిపయి నల్కఁ జూపఁగలవె?
నులములైన భానుభానువులు తల్లి!"

—తెనుఁగు. ౨౮.

ృశ్యతను నిరాకరించుచున్నాఁడు.

ద్ధపురాణాల వినినోచుకొనక యూరికి
ట దురదృష్టజనుల, అక్షర పంక్తులే
దనుచు, దుర్గతులఁద్రోసిన చెప్పరాని
ూర్చి విచారించుచు,

మ నాదు దేశ మనంగఁజాలు
జ్ఞానభిక్షాదాన మిమ్ము తల్లి!"

లైత్తి పల్కుచున్నాఁడు.

నసేయుటయం దీకవికున్న నేర్పన్నఁ

దిని వర్తనాసక్తిఁ దిరుగునళులు
లైపాయలై కానఁబడియెఁ గడల,
గంధవాసనలు సాంద్రముగఁ బెరయ
డచిన మధులక్ష్మి యలకలనఁగ!"

—జడ. ౨౪.

గలెగయు కన్నెచిగుళ్ల గుంపుల
లారెడు చిన్నె నిమ్మచెట్లు
పుజివిచ్చినట్లు నిమ్మలఁ గొమ్మపందిళ్లు
సాఁచు కుమార రసాలతరులు
చువ్వల క్రైదిగి చూచుక గుచ్ఛములవ్రేలు
మొలకప్రాయపుఁ బాలపోకచాళ్లు
కడలెల్ల వాసనల్ సుడిగొట్ట విదిలెడి
పూఁగొమ్మబాఁగు పున్నాగమొక్క
లందునందును బెరిఁగి, యాయందమైన
బ్రాహ్మణుల యింటితోఁటకు వన్నెఁ బెట్టు
వెదురులును గున్నగోరంట పొదలు బలసి
చౌఁజనలవిగాని కంచెగాఁ బెరసియుండె."

—కష్ట. ౮.

"సరసిజమనువిద్ధం శైవలేనాపిరమ్యం మలినమపిహిమాంశోర్లక్ష్మలక్ష్మీం తనోతి, ఇయమధికమనోజ్ఞా వల్కలేనాపి తన్వీ" అని సహజ సౌందర్యమునకు భూషణవికాస మక్కరలేద న్న మహాకవిసూక్తులవలె నీతని పల్కులు ముద్దులొల్కుచున్నవి.

"చెవులకమ్మలు పెట్టని చెలువుకొంత
ముక్కుపుడకలు తీసిన బోసికొంత
చిన్నఁబోయిన యాకన్నె చిన్నెకొంత
జాలుముడితోడ వింతసింగార మొలికె."

—కష్ట. ౭.

"గంగకద్దరిమేలు నిద్దరి కీడునుం గలదె?" అని వర్ణింపఁబడిన గంగానది యీకవిచే నిట్లు వర్ణింపఁబడినది.

"ప్రకృతిసారళ్య పారుష్య భరితమేని
గంగనైర్మల్యకాలుష్య కలిత నిజము,

సామగాన మాధుర్యవాసనయె కాదు
కలదు కౌరవ రక్తకశ్మలము నిందు."
—స్నేహలత ౧౬.

ఆర్యకన్యకల పవిత్రజీవితములు ఆర్షకన్యకల తపోజీవితములు ఈతని వర్ణనలయందు వన్నె దేఱినవి.

"శేకుల్ శేకులుగా నుషఃప్రణయినీ
ప్రేమానురాగమ్ము ప్రా
చీకల్యాణ కుటీరభాగములఁ బు
ష్పింపఁగ ప్రభోధోత్సవ
శ్లోకమ్ముల్ రచియించుచుం గడపఁబో
లుఁగ, నెచ్చెలీ! నిత్యక
న్యాకాలీనపవిత్రజీవితము లా
ర్యావర్త బాలామణుల్."
—స్నేహలత ౧౩.

"సుప్రశాంతములగు నుషస్సులను వేచి
చలినెఱుఁగక మాఘస్నానములను సలిపి
తపసికన్నెలు వల్కలధారణమున
పసుపుముగ్గులు తీర్చి రీభవ్యతటిని."
—స్నేహలత ౧౨.

శ్రీసుబ్బారావు ప్రకృతిరమణిని మను ష్యనారితో బోల్చి వర్ణించిన పద్యము రస వత్తరము.

"పచ్చగిలిన వసుంధరా భాగ్యసీమ
నెల్లయెడలఁ గన్విందుగా నుల్లసిలుచు
పసుపుబూసిన ముత్తైదువల మొగాల
ననుకరించి గుమ్మడిపూవు లందమయ్యె.



ఇట్టిపద్యములు భావకు భూమల వంటి ఇట్టిదే మఱియొకరు వ్రాసినపద్యము.

"లేఁతనునుమబ్బులోఁ గళల్ చిందులాడ
జలివెలుఁగు వింతలీలగా వలపుగొలిపెఁ
జెలియ నునుముంగురులలోనఁ జెలువునిం
మొలకనవ్వుల ముద్దు నెమ్మోము రీతి."

సాధారణముగ నర్థాంతరన్యాసము వల సిద్ధాంతీకరించుట యీకవి కలవాటు.

"వలపుమొగ్గలు దొడఁగిన వయసు టనఁ
యధికమోహాన మగుట సత్యంబు కాని
యచిర శిథిలంబగుట నిర్ణయంబు సుమ్మి
కలదె నైమిత్తికముల కస్థలనమెందు."
—తృణకంకణము ౨

"పెండ్లియీడైన యాపదియేండ్ల పడుచు
అవయవవికాసశోభల నంతకంతఁ
గొంచె మెదిగినయట్లు కాన్పించునౌర!
యీడులేని బిడ్డలయందె మెంతవింత!"
—కష్టకమల ౧

"వలపులు మించగాఁ బాడుపు
వాగులలోని జలంబుపోసి, మి
త్రులగతిఁ బెంచికొన్న చివు
రుంబువుఁగొమ్మల నెల్ల డాసి యో
చెలువల చందమామరో! వ
చింపుము నాప్రణయంపుటొప్పగిం
తలను, ప్రవాసవాసములు
దారుణ దైవికపాత్రముల్ గదా!"
—కష్టకమల ౨౭

...్నహాలతాప్రియంవదలు చిన్న
తనంబున నుండియుఁ సుహృ
...్నేహనిబద్ధలై కలసిపోయి
రెడాటలులేని కూరిమిఁ
...ేహములందుఁ దక్క విడఁ
దీయఁడు వారల బ్రహ్మ, యీమజో
... హృదయంగమంబగు ప్రి
యప్రణయమ్మున కేది పారమో."
—స్నేహ. ౧౦.

...ఆటపాటలయందుఁ బ్రియానులాప
...ల వలపునందు,నొండొరుఁబిలచుకొనరు
...ర్ణనామమ్ములను నా సువర్ణగాత్ర
...ంత మధురంబులో స్నేహవృత్తు లార!"
—స్నేహ. ౧౦.

మాధవుఁ డింటఁబుట్టిన కు
మారుఁడువోలెఁ జరించుచుంటచే
...దరియట్టు లాకమలయుఁ
మెలఁగుఁ జిరకాల మిట్టులే .
...దము లేకయుండ నడి
పెఁ విధి వారలమైత్రిఁ, బూర్వపు
...్యోదయముల్ సుమీ! ప్రణయ
యోగ్యములౌ నను మిత్రబంధముల్."
—కష్టకమల ౧౦.

...ఏమియును బల్క కంత నాలేమ నగను
...యఁగాఁబోయి కుతుకానఁ దీయ లేక,
...ాధవునిమోముఁ గని బతిమాలుకొనియె
...లియవొక్కొక్క తఱితెరఁగు లిలను!
—కష్ట. ౧౩.

"హృదయము పరితృప్తంబయినది లతాంగి!
భావ మపరితృప్తముగఁ గాపాడికొంటి,
దైవమును బ్రసన్నునిఁ జేయఁ దగునుగాక
దోషమతుల నమ్మించుట దుర్లభంబు."
—స్వప్నకుమారము ౧౯.

"కడుపునిండఁ గమ్మని యన్నకబళములకు
నోచుకొనని యాకన్నెకే నోము లిచ్చె,
రాలు గరగించు గంధర్వలాలనమ్ము
జన్మవాసన లెంతో నైజములు జగతి!"
—జడకుచ్చులు ౬౧.

"అపుడు వినవయ్యె మేల్కనినట్టి యిరుగు
పొరుగు తద్దెపేరంటాండ్ర ముదురు లేఁత
లనెడు గోరంటముచ్చటే యున్నయెడల
లేవు లేవు బాల్యమునాఁటి లీలలేఁదు!"
—కష్ట. ౨౯.

పూర్వానుకరణము నెన్నండును జేయని యీకవి రసఘుటికయైన మనుచరిత్రమునందలి భావము తీసికొనినాఁడు.

"ఈతరంగిణి యొడ్డుల నిసుకమీద
సంజచాయ పూతలు వడ్డనయములను
ఆరఁబఱచిన సీర్కావి చీరలనుచు
మోసపోయియుండ రేమునిముగుద లక్క!"
—స్నేహ. ౧౩.

అనుపద్యము "ఆశ్రమాంత భూరుహాగ్రముల్ మునికోటి బద్ధకాషాయ విభ్రాంతిఁ జూడ" అను మనుచరితమందలి పాదమును బోలుచున్నది.

ఈకవి పాత్రపోషణమునందును శిల్పప్రదర్శనమునందును చక్కని ప్రజ్ఞ కలవాఁడు.

"వేదములు పుట్టినట్టిపవిత్రసీమ!
శుద్ధకన్యాకులీనత శుల్కమునకు
పాలగునవస్థ యిసిరో! సంప్రాప్త మయ్యె
తీర్పలేనె నాప్రాణసమర్పణమున!"
—స్నేహ. ౨౨.

అని పూర్వసౌభాగ్యమును జ్ఞప్తి కెలయించుకొనెడి స్నేహలత తన సోదరులను

"అధమ పౌరుష. మనక కన్యలవరింప
శుల్కముల కాశచేసెడి శూరులైరె
కన్నియను పెండ్లియాడునో? కన్నెతండ్రి,
అర్పణము సేయు శుల్కదివ్యాప్సరసను
పెండ్లియాడునో అకట!యీ పెండ్లికొడుకు!"

అని విచారించుచు,

"సుంకమీయక మంగళసూత్రమునకు
యోగ్యురాలు కాదేని నిర్భాగ్యమైన
కన్య యాజీవితము నేల కాల్పరాదు"?

అను నిశ్చయమునకు వచ్చినది.

"పదియునాల్గు వసంతముల్ వదలనట్టి" యొకబాలిక "ఆజననబద్ధ బాంధవమైన రక్తి" వీడి "అస్ఖలితప్రణయానురక్తి చిరతపఃశుద్ధిచేఁ గాని దొరకబోదు" అని

"చైత్రుతో వచ్చు పల్లవసంచయంబు
హిమవదాగమమున నశియించునట్లె
పమచుఁదనముతో నుదయించు వలపులెల్ల
కళుకెడలి కృశియించును జరాక్రాంతదశను"

"మనసుచే వాక్కుచేత కర్మంబుచేత,
లీలఁ గైవల్య మందఁజాలినది ప్రేమ",

"ప్రేమగలుగఁగా విడఁదీయ నిమిత్త సాధ్యమే
"కొనసరి యేమోయి అని పిల్చుకొనుటకు
చెలుల కిలమీఁద నేమికావలయు"

అని నిర్మలప్రేమసూత్రము వ్యక్తీకరించిన అప్పుడు ప్రేయసుఁడు

"నవకమెడవోని తృణకంకణంబు కేల
నందికొని, ప్రేమమధురలాంఛనం బిదిం
సుమ్మి

అనుచు నామె హస్తములఁ దొడిగి

"ఈతృణకంకణమ్ము ధరి
యింపుము నీమణిబంధమందు నం
ప్రీతిని నప్పుడప్పు వల
పింపుల నెయ్యము జ్ఞప్తిగొన్న ప్రా
భాతికవేళ నీ ప్రణయ
బాష్పకణాంజలి నింత యిచ్చి
యేరీతిని వాడకుండ నల
రింపు మిదే తుదివాంఛ సోదరీ!"
—తృణ. ౩౦

అని ప్రేమతృప్తి చూపించినాఁడు.

కష్టకమలలో పాత్రపోషణమునకుఁ గ యవకాశము చిక్కించుకొనలేదు. కాని పూ మ్మకుఁ గమలకుఁగల ప్రేమయుఁ గమలక కుమారునకుఁ గల ప్రేమయు మోహనముగ వర్ణించినాఁడు. పూర్ణమ్మను "కాంతకా కలా పాశములు ముద్దుముచ్చటల్ వలవఁజూపి" క నది కమల. కుమారుడుమాత్రము

"లేఁ దమలపాకు పాత్ర బాలికరచింప
నాకు నాకునఁ గాయు ముత్యాలనొకఁ

ంపుచున్నాఁడు; దాని కన్నియరో! ద్రాగు
ంరో! తుది నొలుకఁబోసికొందురో వనాన!"

—కష్టకమల ౨౩.

 భయపడుచున్నాఁడు. ఈ కృతియందు
త్యము సున్నితముగా నిమిడియున్నది.

ఇఁకఁ దెన్గుతోఁట. మూఁగనోము పట్టిన
ముగ్ధ బాలికను "ప్రొద్దుపొడుపు నోములు
ఁబూనినావో? ఎచటి కేగెదు? నోముపే
? చెపుమ" అని "సంశయాశ్రయమైన
గునుడుల "పలుకరించిన యాంధ్రయావ
ం విన్పించిన కోయిలపాటలు. ఈ పాట
ము భావభరితములు రస మంజులములు"
పాల్దాగివకుండు బందాలఁబడిన వత్సములు
లాడెడు పాలకొఱకు" అనియు, "వదలు
రు బాణాలు బాలభానుఁ డడరి ఆశావృత
న యెడలనెల్ల" "పూచియున్నవి పూవు
స్వగతిని" అనియును, "పీనులకు ముద్దు
ు నవీనమధుర సుస్వరమ్ములు పాడెడు
ేఁడు" అనియును సొగసైనవర్ణనలుచేసి
విహితధర్మముల్ స్ఖలత్ గతులఁ జెడిన
ోతల పాపముల్ కట్టికుడుపు, మహిత
శుచి కసుమాలమైన; జీవనం బేమిటికి"
శయభీతి సూచించినాఁడు.

రువాత స్వప్నకుమారము. ఇదియొక
ృత్తాంతము. అందులకై కొంచె మగ
ు నున్నట్లున్నది.

ుడుమల్లెమొగ్గల న
ోపతివై కొనితెచ్చితేల? బా
లా! సుమనోనురక్తల న
యం బిటులుండు నే? తెచ్చినావు పో!
వాసనచూడుమంచు బల
వంతము సేయఁగనేల నన్ను? ఆ
యాసకరమ్ము లయ్యెడి సు
మా! భవదీయవిచిత్రవర్తనల్."

—స్వప్న. ౧.

అని ఒక కుమారప్రణయశీలి ఆశ్చర్యచకితుఁడై "జాఱుముసుఁగు కీలించిన చనువులాడి"తో సరసము లాడెను. ఆమె కన్యయో, కళత్రమో యెఱుంగని యాతఁడు,"

"పూలుగ్రుచ్చిన సంపూర్ణపుణ్యశీల
వేని ననుఁజూచి ప్రేమింపు మిందువదన!
మాలికలు త్రెంచిన యభాగ్యురాలవేని
రమ్ము పోదము హతమనోరథుల మగుచు!"

—స్వప్న. ౭.

అని ఆమెను ప్రేమ భిక్ష వేడును. కడకు,

"కడుపునఁ గన్నతల్లి తమ
కమ్ము శమించునుగాక కొంతయె
క్కుడయిన దత్తకాంతు కొడు
కో! కొడుకో! యని ప్రాణమంతయుఁ
విడిచిన మోహపుంజనని
ప్రేమయు లేబరమౌనుగాక, క
ట్టడిప్రియురాలిరాగ మక
టా! విసమౌనె కుమారుపాలికిన్."

—స్వప్న. ౧౦.

అని చిరాకువడును. కాని యామె
"పూలబిడ్డలఁబ్రీతి నుయ్యాలలూపు

పవనుఁడెఱుఁగఁడులోడిమలు వదలుననుచు
దెలఁపులకు విరుద్ధములయిన ఫలితములకు
బాధ్యులెవ్వరో? పుణ్యపాపంబులేవో?

—స్వప్న. ౧౭.

అనిపల్కుచు నతనిని నిరాశచేఁ గాల్చెను. అపుడు స్వప్నము తెగిపోయినది. మరల నిద్రావస్థలో అతని ప్రణయామ్లానాశ్రు నేత్రాళికి "చిరమాంగల్యములై సదాపరిచయ స్నేహ ప్రబోధంబులై" ఆమె యిదివఱకుఁ గన్పడిన వనము చెట్లు తోఁచెను. ఆ వనము "అనుంగు చెల్లి శారదవలె పుణ్యగీతముల" విముక్త కంఠముతోఁ బఠించుచుండగా దన "పిన్నియుం గదలక నాలకించెడువగల్" తలపోతకు దెచ్చినది. అతఁ డామెనే తలపోయుచు "సౌందర్యార్చనల్ దోసమా" అనుకొనుచు నన్వేషణము మొదలిడెను. అంత నాతని కొక యుద్బోధ విన్పించెను. ఆయుద్బోధయందే యొకకాంతిఁ గని కొంత తెలివి గల్గి "శిరసు దువ్వి జాతెడి మాతృకరముమాడ్కి, నేదియొచల్లనిస్పృహ" యుదయమాట తెలిసినది. ఇంతటితో స్వప్నమున కాశ్వాసాంతము. ఇందు రచించిన పద్యములు భావగర్భితములు. కథారచనమును గప్పగల్గినది.



సుబ్బారావు రచనములో భావగాం ర్యము రవీంద్రునకువలె నెక్కుడు. ఏతత్కా గ్రంథప్రకాశకులు రచించినట్లు "లోకపరిణా హేతువులు, నవీన భావములు, నూతనాద ములు, జీవకళలు, వీనిం బరిగ్రహింపని జా జలపరంపరలచే పరిశుద్ధ నీరంబుల గనలే శుష్కించు జలాశయంబువోలె రసహీనం బగ ననుటనిత్యంబు" కావున ఆంధ్రవాఙ్మయంబు పురాతనాగమ ఫక్కి ననుసరించి వ్రాయఁబడ రచనలు తగ్గినకొలంది భాషకు సౌభాగ్యమే ఇయ్యది ముఖ్యముగా మనమునం దుంచుకొని పనిచేసినవాఁడు రాయప్రోలు సుబ్బారావు ఈతఁడు రమారమి యిదుసంవత్సరముల నుండి ఏమియు బ్రచురింపకుండుటకు (రెండు మూడు మార్లు భారతిలో దప్ప) హేతువు కానరాదు. మొత్తముపై నీతనిరచనము మందము. వీని రచనవలెనే వ్రాయువాఁడు అబ్బూరి రామ కృష్ణారావు.

ముమ్ముందు ఈతనిలేఖినినుండి వెలువడు అమృతధారా పరంపరలకు ఆంధ్ర బుధోత్త ములు వేచియున్నారు.

## ...న వ్వు

...క్షణభంగురమ్'

అచ్యుతుని వెంకటాచలపతిరావుగారు

ధృవపదము

౧

...(జూచి నవ్వనేలనే
ఓ! వెఱ్ఱిదాన!
నీ, వైభవంబు
...ళ్లు సాగఁబోవునే!!

౨

...రముల కేగి
...రీలఁ జేసి
...(జూచి నవ్వనేల?
నాపసాని!
తేఁటిచాన!
...జమ్ము పాటఁ బాడి
...దేనెఁ జల్లులాడి
...ద్దుక్రుంకెనేని తమ్మి
...లబోను బందిఖాన
...జూచి నవ్వనేలనే
ఓ! తేటిచాన!
నీ, వైభవంబు
...ళ్లు సాగఁబోవునే?

౩

...న్నె చీరఁ గట్టి
...దూగుటూయె లెక్క
నన్నుఁజూచి నవ్వ నేల
నాటపాప!
కలువబోఁటి!
చల్లనీటి తరగపాట
జాబిలితో జలకమాట
ప్రొద్దుపొడువఁ జూచుకొమ్మ
మూతిముడుఁగు నేఁత లుడుఁగు
నన్నుఁజూచి నవ్వనేలనే!
ఓ! కలువబోఁటి
నీ, వైభవంబు
లెన్నినాళ్లు సాగఁబోవునే?

౪

మెఱుపువన్నె మేనితేట
గరిమయలల జాలువాఱ
నన్నుఁజూచి నవ్వ నేల
వన్నెలాడి!
మీనుకూన!
అపుడు మున్కలాడు తీరు
యిపుడు తేలియాడు సౌరు
నిన్నగాల మిపుడె చంపు
చిన్నెలన్ని దుంపఁ దెంపు
నన్నుఁజూచి నవ్వనేలనే
ఓ! మీనుకూన!
నీ, వైభవంబు
లెన్నినాళ్లు సాగఁబోవునే?

# రేఫ-అకారములు

శ్రీ తి. వ. నారాయణస్వామిగారు

"ఏకశ్శబ్దస్సుష్ఠు జ్ఞాత స్స్వర్గేలోకే కామధుగ్భవతి"
"అపశబ్దాత్ప్రయోగం జానో రౌరవం నరకం వ్రజేత్"

అని నియమించిన మనపెద్దల నియమాలననుసరించి మాతృభాషాసేవనోపక్షే ప్రతీ ఆంధ్రుడున్నూ సాహిత్యగ్రంథాలతోపాటు, సుశబ్దాపశబ్ద పరిజ్ఞానంకోఱకు వ్యాకరణం, ఛందోగ్రంథాలు చదవవలసి ఉంది :—

అయితే, వ్యాకరణం చదవనుద్దేశించే ప్రతీవిద్యార్థిన్ని ఆంధ్రవ్యాకరణం పట్టుకోవడంతోటే 'ప్రథమకబళే మక్షికాపాతః" అన్నట్టు "ఆంధ్రభాషకు వర్ణములెన్ని ?" అన్న సందర్భంలోనే సందేహించవలసిన అవసరం తటస్థిస్తోంది. ఎందువల్లనంటే ! మన ఆంధ్రభాషను నియమిస్తూ పూర్వంనుంచీ మనపూర్వులైతేనేమి, ఆధునికులైతేనేమి చాలావ్యాకరణగ్రంథాలు రచించేరు. కాని వారు వర్ణసమామ్నాయము లెక్కించడంలో ర-అ లు రెండనికొందరు, కాదు ధ్వనిలోకొంచెము భేదం కనబడ్డప్పటికీ అది ఒకటే అక్షరమని కొందరున్నూ భిన్నాభిప్రాయాలు కలిగి ఉండుటవల్ల.

మన ఆంధ్రభాషకు ప్రథమాచార్యుడని పేరు పొందిన నన్నయభట్టారకుడు తన ఆంధ్రశబ్దచిన్తామణిలో ఆంధ్రమునకు వర్ణము లిన్ని, అని చెప్పే సందర్భంలో "అద్యాయాః పఞ్చాశ ద్వర్ణాః ప్రకృతేస్తు తే దశోనాస్స్యుః" "షట్త్రింశ దత్ర తే, అన్యే చానుప్రవిశన్తి శబ్దయోగవశాత్"అని ౧౬, ౧౭సూత్రాలు వ్రాసి, వీట్లను వివరించడానికి ౧౮వ సూత్రంప్రారంభించి "ద్వివిధాఃదు దితోచోవక్రతమావనుస్వారౌ, క గ చ జ యు గ ట డ ణ త ద న ప బ మ య ర ల వ స హ శంతు హల్వర్ణః' అని వ్రాసినాడు. వీట్లనుబట్టి తేలిన అంకె మేమంటే హ్రస్వదీర్ఘ భేదంవల్ల రెండువిధాలైన అ, ఇ, ఉ, ఎ, ఒ, లున్నూ ఐ, ఔ లున్నూ, ఖండబిందు పూర్ణబిందువులు, క, గ, చ, చ, జ, జ, ట, డ, ణ, త, ద, న, ప, బ, మ, య, ర, ల, వ, స, హ, ళ లు వీటి మొత్తం 36 అనిన్ని, వీట్లలో "అన్యే చానుప్రవిశన్తి శబ్దయోగవశాత్" అన్నందువల్ల ఋ, ౠ, ఌ, ౡ, ః, ఖ, ఘ, ఙ, ఛ, ఝ, ఞ, ఠ, ఢ, థ, ధ, ఫ, భ, శ, ష, లు 19 న్నీ తత్సమాన్యదేశ్యగ్రామ్యాలలో కలుస్తాయి కనుక ఆంధ్రభాషకు మొత్తం 36+19=55 అక్షరములని నిర్ణయించేడు. ఈపద్ధతినే బాలవ్యాకరణ, ప్రౌఢవ్యాకరణకర్తలు అనుసరించేరు. వీరు "లఘువోఽలఘువ శ్చేతి ద్వేధాంత స్థావ్యాగ న్తిశాస్త్రారః" "అన్యేఽన్యవ్యాకరణస్పష్టార స్త్వత్ర గృహ్యతే ద్వివిధః" అన్న సూత్రాలలో చెప్పినప్రకారం తక్కిన యవలలవలెనే ప్రయత్నమాత్రభిన్నమై ఉన్న యీ "అ"ను వేరువర్ణముగా లెక్కించవలసిన అవసరం లేదని కాబోలు ర, అ, లను రెండుగా లెక్కించియుండరని నేననుకుంటాను.

మరికొంద రేమన్నారంటే? స్థానసామ్యమున్నూ ప్రయత్నభేదమున్నూ కలిగిన ల. ళ. లను రెండుగా లెక్కించేరా లేదా? అట్లే స్థానసామ్యమున్నూ ప్రయత్నభేదమున్నూ కల ర. అ. లను రెండుగా నేల లెక్కించరాదు అని కాబోలు ర. అ. లను రెండుగా లెక్కించినారు. అప్పకవి తన అప్పకవీయంలో పైసందర్భములోనే చర్చిస్తూ "సప్తత్రింశ ద్విహోన్యే" "అన్యే చాను ప్రవిశన్తి శబ్దయోగవశాత్" అని సవరించి అన్ని అక్షరాలను పైరీతిగానే లెక్కించి ర. అ. లమాత్రం రెండుగా లెక్కించి ఆంధ్రమునకు వర్ణములు ౩౭+౧౯=౫౬ అని సిద్ధాంతీకరించేడు. ఈయభిప్రాయాన్నే కం. వీరేశలింగం పంతులవారు వారి సంగ్రహ వ్యాకరణంలోను, వా. సుబ్బారావు పంతులుగారు వారి "సులభవ్యాకరణం" లోను, కల్లూరి వెంకట రామశాస్త్రిలవారు వారి బాలవ్యాకరణ గుప్తార్థ ప్రకాశికలోను వ్యక్తపరిచేరు.

నేనుద్దేశించిన పైసంగతి రౌంతనలకు సమంజసమైన పాఠకసత్తములు వ్యక్తపరతురుగాక.

...నాత్ర "శబ్దసిద్ధి లోకతూనలన దెలిసికొనదగినది"
...గల "సిద్ధి ర్లోకా ద్గ్రవ్యా" అం.శ.చిం. "యువ
...వ్యలఘువులు మైత్రింబొరయు", "రేఫంబులు
..." బా. ప్రకీర్ణక. ౨౪. "రేఫంబులు లఘ్వ
... దక్షుంగల విశేషంబులు సార్వత్యోవహారం
...యుట శ్రేయంబు." ౨౫. అని యీరేఫ అ
... కవిశ్రేష్ఠుల సద్గ్రంథములనుండి తెలిసికో
... తెలియచేసి నన్నయ చిన్నయసూరిగార్లు
...కరణగ్రంథాలు ముగించేరు. అప్పకవికూడా:—

...రు రకారమునునన, రెండుతెఱగు
... వికృతిపదంబుల నమరియుండు
... సంస్కార పూర్వకావ్యప్రయోగ
...బల నెఱుంగవలయు భజ్జనవిధేయ.

...ర మనగా "లక్షణవంతములైన" అని యర్థము
...

...ౄతి శబ్దానుశాస నోభయకవిసఖ
...సేవక సోమభాస్కరులచేత
...తాదుల విభజింపఁబడియె తొల్లి
...రద రేఫములును అకారములును.

...పి తాను భారతాదిగ్రంథాలలో చూచినరేఫ
...లున్న శబ్దాలు వ్రాసి తుదకు తానుకూడా
...లనే:—

...తి నన్నయభట్టా
...కావ్యములందు నాకు దొరకిన రేఫం
... ఱాలు మఱియు నెందుల
...న రగ వనక యవియు గైకొను టొప్పుగా.

...విప్రయోగాలవల్ల యింకా రేఫఅకారములను
...మన్నాడు.

...ఈ రేఫ అకారాలవిషయంలో వ్యాకరణకర్తల
...రూ లిట్లుండగా ఛందశ్శాస్త్రకర్తలురెండుగానే
...కించినట్లు కనిపిస్తుంది.

...వైరంబు నొంది ప్రాసంబులందు
...యములందు దమలోన వేఱుగలిగి

దేవదానవులట్లన దెలుఁగులందు
మించి రేఫ అకారముల్ మెలఁగు కృష్ణ!

తే. మహిని రేఫాక్షరంబును, మఱి శకాంగ
నామక అకారమును సవర్ణంబు లయ్యు
గావ్యములయందు నొకటి కొక్కఁటి గలయక
తమకు దామయె యగు నేకతరయతు లన.

క. ప్రథమ రుక రేఫములకు రే
ఫములును ఱాలకును ఱాలు ప్రాసములను వి
శ్రమములను జెప్పఁదగు నీ
క్రమ మెఱుఁగక రెండునంగుకవి కూర్చు కృతిన్. అప్ప.

కూచిమంచి తిమ్మకవి తన సర్వలక్షణ సారసంగ్ర
హంలో:

ఆ. వె. ఎన్నిలక్షణంబు లెఱిగిన రేఫలు
బండి ఱాలు నెఱుఁగ కుండునట్టి
కవి కవిత్వమెల్ల గవ్వకు గొఱగాక
కొఱతెందు రజతకుధరనిలయ.

అధర్వణాచార్యులుకూడా యీ విషయాన్నే చర్చిస్తూ:
ర ఱ ల మైత్రిని కేచిన్మతంగా అంగీకరించి 'కశ్చిద్వదతి
సాంగత్యం యతావేవానయో స్తథా; అవదచ్చాత్రసాంగ
త్యం ప్రాసే వ్యపిద కశ్చన.' అనిచెప్పి,

క. పురసతుల విలోకనములు
సరసాలాపములు నర్మసంభోగంబుల్
మఱగి హరి మనల నొల్లడు
సరసరు లోగాము మనూతన స్త్రీయులు గదే. భాగ(ప్రాస)

"గక్కునజని వ్రాలునో — కెక్కలుగట్టుకొని
దివిజ రిపుమేడపయిన్" ప్రభా. (యతిమైత్రి)
అని యీ రెండింటినిచూపించేటు. చూపించి తుదకు తన
కవి యిష్టంలేనట్టు:—

అనయో స్సంగతిం యస్తు కరోతి కవితా కృతౌ
అస్య అత్యంతకోమ త్వా ద్దుష్కవిస్సహి కథ్యతే. అని
సిద్ధాంతీకరించేడు. సులక్షణసారకర్త అయిన లింగంగుంట
తిమ్మకవికూడా ఎవరో "రావడి" అని ర-ఱలకు యతి
మైత్రి నంగీకరించినట్టును, చాలా మంది అంగీకరించ

వట్టున్న భారతంలో ప్రయోగం ఉండుటచేత వ్రాస్తున్నానని

క. ధారుణి రావడి యనదగు
   దా రేఫకు రేఫ దాఁకు రహి వడి దనరున్
   నీరమ్యకీర్తి వగు దా
   రారాజున్నలువ బలుగుదాల ననంగన్.

క. తెంపుగు జెంపును గదుర ని
   లింపులు వెఱగంది చూడ రిపుసైన్యములం
   గంపింప దమబలంబులు
   అంపిలి ధిట్టార్వ సింధురాజుం దాకెన్.

అని భారతంలో ప్రయోగమున్నట్లు చూపించేను. కాని తనకు సమ్మతిలేదన్నాడు. కాగా ఛందశ్శాస్త్రకర్తలు కూడా రేఫ అకారములను రెండుగా లెక్కించినట్టే తోస్తుంది:—

ఈ పైని వ్రాసిన సంగతులవల్లనే రేఫ అకారములు రెండు అనే లెక్కించవలసియున్నదేమో అనిన్ని ఆంధ్రశబ్దచింతామణి బాలవ్యాకరణ ప్రౌఢవ్యాకరణ కర్తలేకారణంచేత ర-అ ల నొకటిగా లెక్కించేరో వారి అభిప్రాయం యేమో అనిన్ని నా సంశయం:

ఇక పరోక్షసంగతి: 'అనయోః స్సంగతిం యస్తు....
.....................దుష్కవిస్సహి కథ్యతే.'

అన్న అథర్వణాచార్యుని వాక్యముల ననుసరించి ఆలోచిస్తే యింతమంచి గా నూటికి తొంభదితొమ్మిదుగురను దుష్కవి బిరుదమున కర్హులే అనుకొంటాను. సర్వలక్షణ సారసంగ్రహంలో రేఫ అకార మైత్రి నంగీకరించిన వారిని

క. అలసాని పెద్దకవి పిం
   గళిసూరన రామభద్రకవివర్యుసు, పి
   ల్లలమఱ్ఱి వీరభద్రుడు
   గలపిరిగద కృతుల దాలు గడు రేఫములన్

అని వీరిని లెక్కించేను. ఉదాహరణాలు చూపినాను. గ్రంథవిస్తరభీతిచేత వ్రాయలేదు. వీరిగ్రంథాలనే అప్పకవి లక్ష్యగ్రంథాలుగా తీసికొన్నాడుకదా. రేఫ అకార మైత్రికే దోషంగా నిర్ణయించి బమ్మెర పోతన తనగ్రంథంలో ర-అ లకు మైత్రి నంగీకరించేడని అతని భాగవతము లక్ష్యగ్రంథంగా అంగీకరించకుండుట చూడగా అప్పకవి అసూయకలవాడని నిశ్చయించవలసి వస్తుంది సర్వలక్షణసారసంగ్రహకర్త బమ్మెర పోతన రచించిన భాగవతభాగంలో ర-అ ల కుమైత్రి లేనేలేదనిన్ని యితరులు పూర్తిచేసిన భాగంలో ర అ ల కుమైత్రి కలదని చాలా ఉదాహరణములు చూపినాడు (చూ: స. సార సంగ్రహం: ౧౮౫, ౧౮౬, ౧౮౭ పుటలు)

ఇదిగాక కవిశ్రేష్ఠులని ప్రఖ్యాతిగల వారు చాలా మంది యీ ర-అ ల కు యతిప్రాసలలో మైత్రి అంగీకరించినట్లు యీక్రింది గ్రంథాలలోనున్న పద్యాలవల్ల మనం గ్రహిస్తాము. వీరి నందరిని దుష్కవు లంటామా? వారి ప్రయోగాలలో ర అ లు తప్పుగా పడినవి అంటామా? కవిశిరోభూషణమనే పేరుతో ఆన్ధ్రశబ్దచింతామణికి వ్యాఖ్యానముచేసిన అహోబలపతి తాను రచించిన "కాళిందీకన్యాపరిణయం"లో ర అ ల ను ప్రాస స్థానములో వాడెను.

ఉ. ఏఱులమిన్న నయ్యమున
   నేరున భేదన మాచరించె దా
   నేరదు మున్ను భూమి ఫలి
   యింపగ జేయగ సీరపాణియు
   న్నేర డటందు గేలికొని
   నేర్పలరం గృషిచేసి ధాన్యము
   ల్మేరకు మించగా ధర ఫ
   లింప నొనర్తురు కూర్గు లప్పరిన్.

తెలవక గొంపుగంట నెడ
   త్రెవ్వని దామ్యకణంబు లత్తఱిన్
   ముకువగు తోల్తగాలి తెలి
   ముత్యము లై మఱిపిండి యార్పునె
   క్కటిమిన కందు మోరిపయి
   వాని వెసం గయిపెక్కు గొంపులై
   నెఱి జనుగట్టులం దొరసి
   నీటను గ్రాగినసాంద్రజంబులై. ఆ. ౧౮౬ ప.

ీరతపంబుచే వనుగు
కోమలవల్లి యనంగు జుట్టవా
ంచిరాంగయష్టి గడు
శేచ మనంబు దయావిహీనమై
అగ జూచుచుండెదు కు
మీ, హరియానసుమీ శిలంత చె
్రగ గన్నవారి పయి
నానసుమీ పరికించి చూడుమీ. ౩ ఆ. ౧౯౬ ప.

"ఏలు" "మీఋట" లను అప్పకవి "వా"లలో
ను. సర్వలక్షణసారసంగ్రహంలో రేఫ అకారము
తిప్రాసలను యతిప్రాసమైత్రిని పాటించిన ట్లు
చిన కవుల గ్రంథాల్లోనేకాక యితరుల గ్రంథాల
యా రేఫఱకారాలను ప్రాసస్థానాల్లోను యతి
ల్లోను నియమం లేకుండా వాడినారు.
డి.

షలన్నియు విచ్చి రేయెండజిగి నిండి
కర మొప్పె తెల్లదామరలకంటె
"భాస్కర" అరణ్య ౧. ఆ, ౧౩౫. ప.

త్రిపీరావయవంబులో విరథర
ఖ్యాపార్శ్వ భాగంబులన్
చై యుండగ
—భా. రా. యుద్ధ ౭౫౦ ప.

ు పద్యభాగములున్న భాస్కరుడు రచించిన
లోనిదే.

ారిజటల్ ప్రవాళముల
పొల్పుగనీన్ ఘనబాహుశాఖలన్
టి యుపర్ణపర్ణ రుచి మించ
— త్తి. రా, ౨ ఆ. ౩౧౬ ప.

ణము ందు కా లోక
జ న్వని పూనిప చామరంబు లి
ం న రుచిక్కటారులు
పూరామాయణము, ఋగ్వేదికవి వేంకటాచలపతి
౨. ఆ. ౫౫ ప.

చ. కరువలి వారి మేఘలును......
తేఱులును..........
శరశతము..............డ
గ్గలుటయు.......................౨. ఆ. ౯౯.

ఉ. పేరిన కోరచంద్రుకలు
లీటలువాఱిన దీర్ఘ కాయముల్
మీఱిన కోఱదోడలును
మీసల మానిన రక్తపంకముల్
పీఱెడిమూపుమం గుఱుచ
పీపునుగల్గిన బ్రహ్మరాక్షసుం
డీరములోన నున్న గని
యిట్లని పల్కె గకోరవాక్యుడై.
కేతన. దశ ౧౦ ఆ. ౬౩ ప.

ఈరము లఘురేఫములలో లెక్కించినదే:—

"అనురక్తి తేఁచు మాతనరసాటోపము"
హ. న. ౨-౯౦.

ఇందులో తేఁచునన తునకమనే అర్థంలో
అకారమనిన్ని రేఁచు=రేగజేయు అన్న అర్థంలో రేఫ
అనీన్ని యిందువల్ల రామరాజభూషణుడు కూడా ర ఱ
లమైత్రినంగీకరించినట్లును, ర ఱ ల మైత్రిదుష్టముకాదని
బ్ర. శ్రీ ఐరుషుల చినసీతారామస్వామిశాస్త్రిలుగారు వ్రా
యుచున్నారు (చూ హ. న. పీఠిక ౧౧౨-౧౧౩ పు).
ఈ రీతిగా యీ ర ఱ. ల మైత్రి విషయంలోను భేద
బుద్ధి కలిగింది.

గ్రంథాలలో యీ ర ఱ లున్న పదాలలో సమా
నమైన పదాలకు ర. ఉన్నప్పు డొక-ర్థమున్న ఱ.
తోను న్నప్పు డొకఅర్థమున్న బడుతుంది చూడండి:—
ందు ల్ల ర ఱ. ల భేదం తెలిసి ల ల —
కమై ు ం.

౧ అరపరలు=శుష్కము. విరహాగ్నివలన దేహ
ము లరసారై హ స్తభూషణా భులెల్లన్
—వి. పు. ౭ ఆ.

ఉ. హరివంశము—వావిళ్ల వారి ప్రతి గ్రంథము లో అచ్చు యింది, 3 ఆ, ౫౫ పద్యం (సోమన). ఇందులోని శారు లఘురేఫమే అయినయెడల సోమనకూడా రేఫ అకార మైత్రి నంగీకరించినట్టేకదా ? గురురేఫమైనచో ముద్రా పకులో లేక సంశోధకులో యీలోపము నొనర్చి రను కొనటకేమిన్ని సందేహం ఉండదుకదా. ఈమాదిరిగా అనేక భేదాలతోనున్న యీ ర. ఱ లను కనుగొనుట యిప్పటి దినాల్లో దుర్ఘటమనడం ఒకవింతా ?

ఈ పైని చూపించిన కారణాల్ని పట్టి యీ ర ఱ లను కనుక్కొని వాటినర్హములైన స్థలాల్లో వాడు కచేయడం నేర్చుకొనవలసిన బాధ్యత ప్రతీ ఆంధ్రభాషా సేవకుడికీ ఉన్నప్పటికీ యీలఘుగురు రేఫ నిర్ణాయక సూత్రాలు విరళంగాను, సందిగ్ధంగాను ఉండడంచే వీటిని నిర్ణయించుకోవడం బహుకష్టంగా వుంటోం ఆంధ్రభాషావ్యాప్తి పూర్తిగా లోకంలో నున్న ఇ దినాల్లో యేవిమర్శక శ్రేష్ఠుడైనా యీరేఫఅకార లను నిర్ణయించే గ్రంథమును పరిపూర్ణంగా రచించి ఆం భాషాదోషమును లక్షణయుతముగా చేసి ఆంధ్రులకృతి తను పాత్రుడై చేయూత నిస్తేనే తప్ప లేకపోతే యి ర ఱ ల విషయంలో ప్రతి ఆంధ్రుడును "గ్రుడ్డి జొన్నచేలో పడ్డట్టు" కలవరపడక తప్పదు:—

సూచన:—ఆంధ్రభాషలోనున్న యీరేఫ, అకారము యొక్క నిజస్థితి తెలుసుకొనే అభిప్రాయంతో న మనస్సులో నున్న ఉద్దేశముల నీవిధంగా వ్యక్తపర చాను. పండితశ్రేష్ఠు లిందున్న పొరపులను పరిగణిం కుందురు గాక యని ప్రార్థించుచున్నాను.

---

# "జాను" జననము

వి. ఆర్. భరద్వా

నేలసాగిలి చిఱుతరంగాల కేలు
మోడ్చి యర్థించు సెలపాట మురు వెఱింగి
పల్లవముఖాల నొదలల్ వంచి మ్రొక్కు
తీవలు రచించు సహజభక్తిని దలంచి
కదలు కొనకొమ్మ నవనతవదన మొప్పఁ
బలుకు రాచిల్క నుడిలోనిభావ మరసి
తడవతడవకు నభయహస్తము నొసంగు
దేవదేవుఁడు నరులు ప్రార్థింప వినఁడె!
వినఁడె 'జకరయ' తొలి నేయు విన్నపమ్ము!
వజ్రముల నీను పుడమి గర్భమ్ము మాడ్కి
పూలనిండిన తీవియపొదవిధాన
దినముఖమ్మునఁ దూరుపుదిక్కువోలెఁ
జడలు విరిసిన పూర్ణిమాసంధ్యపగిది
మిలమిల చలించి సరిక్రొత్త మెఱుఁగు నించి
పాండిమముఁ జల్లి వెలుఁగునంపదల నల్లి
వేల్పుగుడిలోనఁగల ధూపవేదిచెంతఁ
బొడమె 'జకరయ' కొక దివ్యపూరుషుండు
తెలికనుంగవఁ దరళకాంతులు జనింప
విమలవక్షానఁ బండుగడ్డము చలింప
వెలుఁగు కెరటాల ముడుతల వ్రేళ్లు కదల
వడలు ముడుపలిమెయి గగుర్పాటుపొదల

' హృదంతరాళమ్ము సంభ్రమించె
లు' దర్శనము కటాక్షించునాడు.
ను వస్తుతత్త్వమ్ముఁ జూడలేక
శబ్దార్థసత్యమ్ము వెదకలేక
ను దేవదేవు గుర్తింపలేక
యెను 'జకరయ' ముగ్ధగళము
శాభిరుచిఁ గట్టువడ్డనాల్క
మ లెటింగి కీర్తింపఁగలదె?
వృక్షముల ఛాయ బెదరుటీవ
క్కులఁబడి డస్సి నేలఁ గలియు
పుష్పములఁ జేరనోడు తేఁటి
డి రెక్కలురాలఁ గూలు
జలాశయముల నీనడించి
జీవకృషికుఁడు రిత్తవోవు
ఁడని ప్రభునిమార్గమునఁ బోని.
గాఢాంధకారాన నవసిపోవు
వకు వినమె? పెద్దలు వచింప
త్మా వినశ్యతి" జగతి ననుచు.
డిపడ్డ బొగ్గు రత్నముగఁ జేసి
స్నిటిఁ దరళమౌక్తికముఁ జేసి
పొట్టలను బానకమ్ము నించి
బ్బల మించుతీవియలఁ బెంచుఁ
'జకరయ' సంతానవంతుఁ జేయఁ
దివ్యమహిమమ్ము జాలుకొనఁగ?
బాన రవిరశ్మి సాగినట్లు

గాలికెరటాలఁ బూతావి గ్రమ్మినట్లు
మబ్బుముక్కల వనరాసి మలసినట్లు
'ఎలిజబెతు' గర్భకోశాన నిమిడి వెలిఁగె
'జాను'రూపాన దివ్యతేజమ్ము నాఁడు.
మధురమధుమాసపుష్పసంభవముఁ దెలుప
జిలుఁగు లేఁగొమ్మఁ బొడము క్రొంజివురువోలె
నమృతరసమొలుక ప్రణయోదయమ్ముఁ దెలుప
బ్రాయమునఁ దోచు లలితయౌవనమువోలె
బాలభాస్కరబింబోద్భవంబుఁ దెలుపఁ
గడలఁ బ్రాకెడు నుదయరాగమ్ముపోలెఁ
బ్రభుకుమారుని మురిపెంపురాకఁ దెలుప
ము 'స్నెలిజబెతు' గర్భానఁ బొడమె 'జాను'
అతఁడు ప్రవిమలదివ్యతేజాత్ముఁ డగుచు
ననుపమానప్రశస్తవర్తనుఁడు నగుచు
సజ్జనుండయి వ్యసనసంసక్తిఁ బోక
సకలజన పాపకల్మష స్నాపకుఁడయి
వెలసె లోకాలు 'యోహాను' విబుధుఁ డనఁగ.
పృథులవిజ్ఞాన మధుపూర్ణహృదయసుమము
విమలజీవనప్రభాత హిమకణాళి
స్నానమొనరిచి నవవికాసమునఁ దనర
దెసలఁ బ్రాకెను 'యోహాను' దివ్యలతిక
చెలఁగు తదీయజలాభిషేచనమునఁ
బూతమయి దివ్యమకరందమును గ్రహించి
కరము వర్ధిల్లె మర్త్యబంభరగణమ్ము.

---

# వివాహచట్టము

వేమూరి విశ్వనాథ శర్మగారు, యమ్. ఏ., యల్. టి

## ఇందలి పాత్రలు

| | |
|---|---|
| 1. రామారావు<br>2. శర్మ<br>3. సోమనాథము | సనాతన ధర్మవాదులు |
| 4. గురుమూర్తి<br>5. సూరయ్య<br>6. శంకరరావు | సంస్కారప్రియులు |
| 7. అప్పారావు<br>8. నరసింహారావు<br>9. సుబ్రహ్మణ్యము<br>10. సోమయాజులు | తటస్థులు—సమయోచితముగ కాలక్షేపము చేయువారు |

స్థలము—శర్మగారియిల్లు

### ప్రవేశము

(రాత్రి భోజనానంతరము కుడిచేతితో పొడుముపట్టి యెడమచేతితో బొజ్జతడవుకొనుచు స్వగృహమునుండి బయలుదేరి సోమనాథము స్వగతముగ)

అబ్బా! వర్ష ఋతువు కూడ మండువేసంగి వలె మాడిపోవుచున్నది. కర్మభూమిలో జన్మమెత్తి, వైదికధర్మమును పాటించక, మ్లేచ్ఛ సంపర్కమువలన భారతీయులబుద్ధు లెట్లుమారి పోయినవో అట్లే ఋతుధర్మములు కూడ మారుచున్నవి. రాజమహేంద్రవరములో సంవత్సరమునకు పండ్రెండునెలలు పగలు ఎండ, రాత్రిగుమాయింపు. నిద్రపట్టదు. పనితోచదు. శర్మగారిధర్మమా యని వక్కపొడి తమలపాకులు నమలుచు కబుర్లతో కాలక్షేపము జరుగుచుండబట్టి కొంతవరకైనా కాలయాప మగుచున్నది. అది లేనియెడల రోజులు దుర్భ రము లగును. ఓర్చలేనివారు మా కూటమి ఊకదంపుసమాజమని పేరుపెట్టిన నేమి? నడుమ శాసించిన శారదాగారి వివాహ చట్ట మునుగూర్చి మేము చేసిన కూలంకష చర్చ శాసనసభ్యులకుగూడ ఆదర్శప్రాయముగనుండ గలదు. శాస్త్రప్రమాణ విచారణలో శా సభకు తీసిపోదు. యుక్తివాదములో రిఫార్మర్ల నోరుమూయించితిమి. ఎంత యుద్ఘోషించి నేమిఫలము? సంస్కారప్రియులదినాలు బాగ న్నవి. గవర్నమెంటువారు వారిపాలిటి దే ళ్లయి వెలిశారు. బ్రాహ్మణ్యము నిర్మూలము కావించెడి చట్టమును చేశారు. (ఆలోచన నటించి) ఆ! ఏమంటిని? సోమనాథం గొంతుకలో ప్రాణమున్నంతవరకు బ్రాహ్మణ్యమును నశిం నిచ్చునా? ఎంతటిమాట! నాశక్తి నాకే తెలియ కున్నది! శారదాబిల్లు నిర్బంధశాసన మైన గనుక యికమీద మహజర్లతో పనిలేదు మందలింపులతో పనిలేదు గవర్నమెంటువా మంచిచెడ్డలతో మన కవసరము లేదు. భా కర్తవ్యమును చక్కగా నాలోచించి తదే దీక్షతో పోరాడి సనాతనధర్మమును నిలబెట్ట గాక! (తలుపుతట్టి) శర్మగారూ! రామారా వచ్చాడా? లేక బొజ్జ సవరించుకుంటూ, చుట్ట తగలేస్తూ యింటిదగ్గిర కూర్చున్నాడా?

శర్మ

రావడమైతే వచ్చాడుగాని నీ వనుకున్న చేస్తున్నాడు. గురుమూర్తి, సూరయ్య, రావు మన ప్రెసిడెంటును గోలపెట్టిస్తు. అతని కేమి తోచక బిక్కముఖము కేసి చూస్తున్నాడు. ఇప్పుడు నీవుకూడ వు గనుక మనము వారి యాక్షేపణలకు న సమాధానముచెప్పి రిఫార్మర్ల నోరు యించి మన రామారావు గౌరవమును డవలెను.

సోమనాథము

రే! వీరూ యిక్కడనే వున్నారు? అదే చారమో కాని యెప్పుడు కాస్తనందు ని మంచిచెడ్డలు ఆలోచించుకుండా అప్పుడే. మన ప్రతిపక్షులుకూడ సిద్ధ రు. మీరు వాళ్లను వెల్లిపొమ్మనలేరు. మిమ్ముల వదలరు. ఇదంతా చూస్తే రామారావు పైకి మాతో నున్నట్లు లోలోపల వాళ్లకే సహాయము చేస్తు తోస్తుంది.

గురుమూర్తి

సంగతి యిప్పుడా నీవుగ్రహించింది? నీ టలకు చాలా సంతోషించాను.

శంకరరావు

రిద్దరిని నమ్ముకొని నీ వ్యవహారంలోకి పని కుక్కతోకపట్టుకొని గోదావరీదన ది.

సూరయ్య

మొన్న జరిగిన టవునుసభలో శర్మగారు గోడమీది పిల్లివాటముగా తప్పుకున్నారు. మా ప్రెసిడెంటు రామారావుగారు శారదా బిల్లును సంపూర్ణముగ ఆమోదించారు. ఆమోదకుల సభ కూర్చినవారిలో రామారావు గారిదే మొదటిపేరు.

నరసింహారావు

మన మిప్పు డెవరిపక్షము?

సుబ్రహ్మణ్యము, సోమయాజులు

సోమనాథం వంటరిగా డైయేటట్లున్నది. అతనిపక్షము వాదిస్తాము.

అప్పారావు

మనకిప్పుడే తొందరలేదు. ఇప్పు డేపక్షములోను చేరవద్దు. వాదప్రతివాదములు కొంత వరకు జరిగినతరువాత ఆలోచిస్తాము.

సోమనాథము

నా కెవరిసహాయము అక్కరలేదు. ఆశ్రేయమగు సనాతన ధర్మములో బీజమువుంటే పాతిపెట్టినా పైకివస్తుంది. వైదికధర్మఘాతకుల కుట్రలు కొండంతలైనను గోరంతలై నశించుతవి. ధర్మమే సత్యము. అధర్మమే అసత్యము.

తటస్థులు

మా సహాయము నీ కక్కరలేకపోతే రామారావు, శర్మ నీకు తగినంత సహాయము చేయడంలేదని గోలయెందుకు?

సోమనాధము

ఎందుకా? గౌరవార్థము హోదాలన్ని సంపాదించి దమ్మిడియెత్తు పనిచేయకుండా సనాతనధర్మరక్షణమంతా తమ నెత్తిమీదు గానే నడుస్తున్నదని పేపర్లలో సాటించుకుం టుంటే నాకు అరికాలిమంట నెత్తికెక్కి గోల పెట్టాను. శారదాచట్టమునకు వ్యతిరేకంగా వేనకువేలు సభలుజరిగాయి కదా! ఒక్కసభ లోనైనా రామారావు నోరువిప్పిన పాపాన పోలేదుకదా! పోని సభల సమీపములోనైనా చుట్టకాల్చడము మానమని బ్రతిమాలితే మానేడా?

రామారావు

అగు. శర్మ కారాకిల్లీ మానేడా?

తటస్థులు

అలా నోరు మూయించు.

గురుమూర్తి, సూరయ్య, శంకరరావు

సోమనాధం కాఫీహోటలు మానేడా? వచ్చి రిఫార్మర్ల యిండ్లల్లో భోజనాలు మానేడా?

సోమనాధము

(విననట్లు నటించి) ఇట్టి మహావక్త, సదాగ్ని హోత్రి అఖిలభారత బ్రాహ్మణ మహామండలికి ప్రెసిడెంటవ. ఈనకుతగిన సెక్రెటరి శర్మగారు దొరికారు. కర్మంజాలక మొన్నటి టవును హాలుసభలో ఆకు నంటకుండా పోకను పొంద కుండా వకసారి మాట్లాడారు. సనాతన ధర్మ ము నుద్ధరించుటకు శర్మగారా మీాకు దొరికా రని రిఫార్మర్లు మమ్ములచూచి నవ్వారు.ఆయన చెప్పిన ఉపన్యాసము మా కనుకూలమో రిఫార్మర్ల కనుకూలమో యెవరికి తెలియలే మేము సిగ్గుపడి తలవంచుకున్నాము. చే కుంటె వూరుకుండాలిగాని గౌరవ పదవు యింత దేవులాట యెందుకు? ఈలాటి శు ప్రియాలు చెప్పేవారినిచూసి వళ్లుమండింద మండదూ?

రామారావు

నన్నువిను సోమనాధం. చెప్పుడుమాటలు చెడిపోకు. మనశత్రుకోటి పన్నినవలలో తగి కొని నామీాద శర్మమీాద అనుమాన తున్నావు. మిత్రభేదమే వారి రాజనీతి. న్నటిసభలో నేను మాట్లాడకపోవుటకు ణము లేకపోలేదు. అంతకు పూర్వము జ సభలో శారదాచట్టమునకు అనుకూలమ మాట్లాడెదనని నాకు తెలియకుండా యయ్య నాపేరు ప్రకటించాడు. అందుకు త చేట ట్లతనిని చీవాట్లువేసి ఆసభకు వెళ్లక తప్పకున్నాను. మనసభలో నేను మాట్ల పోతేనేమి? నాతరువాత నా అంతటివా నాసెక్రటరి—శర్మ గంభీరోపన్యాసమిచ్చి కోటికి వాగ్బంధనము చేయలేదా? ఉపన్యాసములతో నేమి ప్రయోజనము? జరగాలె.

శర్మ

(రామారావును జూచి) శంకరరావు, య్య పన్నినవ్యూహములో మన సోమ నిజంగా తగులుకున్నాడు. గురుమూర్తి

న్నాడు. తక్కినవారు అటోపుల్ల
ల్లవేసి సోమనాధంలో నంకురించిన
ప్నిని ప్రజ్వలింపజేయుచున్నారు. వారు
ట్ట పెద్దది. దానికితోడు మన సోమ
డమీాదనున్నది తలకాదు; మట్టిముద్ద.
వారి వలలోనుండి తప్పించుట కష్ట
గ నున్నది. (సోమనాధంవైపు తిరిగి)
డెంటు రామారావువిషయమైనీఅపో
ారణములేదు. నా విషయంలో నీవే
ప్పటికి నేను నీతో వాదించతలుచు
కాని రామారావునుగూర్చి దురుద్దే
వారు రౌరవాది నరకాన పడతారని
ా చెప్పగలను. ఈ వివాహచట్టవివా
అతని యవస్థ జూచినవారికి జాలి
ాని ద్వేషభావము జనించదు. అట్టి
స్థితులలో నతడు చూపుచున్న ధైర్య
కు మనమేకాక మన ప్రతిపక్షులు
ర్యపడి సగౌరవముగ సానుభూతి
రు. నావిషయమై నీ వేమి వాగినా
లేదు. శారదాబిల్లునుగూర్చి నాయభి
లను నిర్భయముగ నిదివరకే చాటిం
ాకు ముసుకులో గుద్దులాటలు ఇనికి
ోపలనున్నది. పైకి పెళ్లకక్కాలి. నా
మును గ్రహించలేని మృత్పిండములకు
వాదిని కాను.

సోమనాథము

ాపును వెనకవేసుకొని నేనే దుర్మార్గు
ంస్తున్నారుగాని మన కిద్దకిలేని ప్రతి
బంధకములు ఆయనకుమాత్ర మేమి సంభవిం
చాయొ నాకు కాస్తచెప్పండి. నన్ను వెర్రి
వాణ్ని చేసి మసిపూసిమారేడుకాయచేస్తారా?
ఎంత ఛాందసుణ్ణైనా యింత మాత్రము
గ్రహించలేకపోలేదు.

తటస్థులు

బలే సోమనాథం! కుతికపట్టుకునే ప్రశ్న వేశావు.

శర్మ

అలాగైతే తెలుగుచేసి చెపతానువినండి. మన
ప్రెసిడెంటుగారియింట్లో అందరు శారదాచట్ట
ము కావలెనంటారు. చిన్నతనములో పెండ్లి
చేయుటకు వప్పుకోరు. కూతురు చిన్నదైనను
ఇంగ్లీషుబడిలో చదువు ప్రారంభించిన తరువాత
పెండ్లి వద్దని దెబ్బలాడుచున్నది. ఇట్టి విషమపరి
స్థితులలోకూడా మన రామారావు సనాతన
ధర్మము నిలబెట్టుటకై కంకణముగట్టుకొని అస
హాయ శూరత్వమును జూపుచున్నాడు.

శంకరరావు

అలాగైతే మొన్న బెజవాడలోజరిగిన ఆంధ్ర
మహాసభలో ఆడకూతురు దువ్వూరి సుబ్బమ్మ
గారు శారదాచట్టమునకు వ్యతిరేకముగా
హోరాహోరీన దెబ్బలాడిందికదా! మా ప్రెసి
డెంటు ఆమెకన్న తీసిపోయినా యియ్యనక్కు?
తటస్థు డెందుకు కావలసివచ్చింది?

సోమనాథము

అలా సిగ్గుచెప్పండి. నోరు విప్పకపోతే చేతికేమి
జబ్బు?

రామారావు

మీరు బెజవాడ రాలేదుకదా! మీ కీసంగతి యేలా తెలిసింది?

గురుమూర్తి, సూరయ్య

వారులేకపోతే ఆసభలో మేములేము? దొంగ తనం దాగుతుందా?

శర్మ

అంతమాత్రముచేత చంకలుకొట్టుకోకండి. బెజవాడసభలో మా ప్రెసిడెంటు మూకీభావము వహించుటకు కారణము లేకపోలేదు. ఆ సభలో నేనుంటే నేనుకూడ రామారావువలెనే యూరకుండేవాడను. ఆసభలోనుండిన వేయిమందిసభ్యులలో ముగ్గురుమాత్రము శారదా చట్టమునకు వ్యతిరేకులు. వ్యతిరేకులను సావకాశముగా మాట్లాడనీయక గగ్గోలుపెట్టి లేవిడీలేపుటకు ప్రారంభించిరి. మీదుమిక్కిలి వ్యతిరేకముగా చేతులెత్త నుద్యుక్తులైనవారిని స్త్రీలందరు కన్నులెర్ర జేసుకొని బెదిరింపలోడంగిరి. ఇట్టి బీభత్సములో ఏపురుషుడు ధైర్యము చేసి బాహాటముగ చేతులెత్తగలడు? ఇంతకును కార్యశూరత్వముచూపవలెనుగాని వోట్లవలన పని జరుగునా? కతలకు కారణమగునుగాని!

రామారావు

నేను మూకీభావము వహించినది కేవలము భయముచేతనూ కాదు. బెజవాడ సభలో బ్రాహ్మణులు లెక్కకు పదిమందైనా లేరు. అందరు బ్రాహ్మణేతరులే. వివాహవిషయము లో వారికి శాస్త్రప్రతిబంధకములు లేవు. బ్రాహ్మణులు లేనిసభలో నా మొరాలకించువారుండరని భీష్మించి కూర్చుంటిని. మనీదులో నా మహావిద్యపారాయణము?

గురుమూర్తి

ఈశుష్కవాదములతో నాకుపనిలేదు. (రామారావునుజూచి) నీవు వైద్యుడవు. శారీరశాస్త్రమును చక్కగా చదివినవాడవు. ధర్మశాస్త్రములమాట కట్టిపెట్టి అనుభవములో మన చేతులమీదుగా బాలింత లెందరు కర్చగుచున్నారో గమనించితివా? దేశములో లక్షల కొలది బాలింతలకు మొదటికానుపుతో నూరేండ్లు నిండుచున్నవి. ఒకవేళ బాలింతమరణము తప్పినను మనస్త్రీలు పాతికసంవత్సరములకే సర్వము ఉడిగి జీవచ్ఛవము లగుచున్నారు. ప్రపంచములో నెక్కడలేని యీ దౌర్భాగ్యము బాల్యవివాహములవలన కాదని చెప్పగలవా?

శంకరరావు

ఏ దేశములోను చంటిపిల్లల చావులో?

సూరయ్య

బాలవితంతువులో? అతిబాల్యవివాహ మను దురాచార పిశాచమునకు మరి యే దేశములోను తావులేక మన దేశములో స్థావర మేర్పరుచుకొని మనజాతిని పీల్చి పిప్పిచేయుచున్నది. మన మది గ్రహించుటలేదు.

సోమనాథము

ఆగండి. ఈప్రశ్నలు రామారావును కాదు నన్నడగండి. నేనూ వైద్యుడనే. కొంచెమో

ు నాకూ ఆయుర్వేదము తెలుసును. కాని
శాస్త్రములను గంగలో కలిపి యిప్పుడు
క్తివాదములో దిగారా? యుక్తివాదానికి
మీారసలే నెగ్గలేరు. హనుమంతుని ముం
కుప్పిగంతులు? ఏమండీ, సూరయ్యగారూ
దేశములో బాలవితంతువు లెక్కువగా
రా? ఉంటే ప్రతి బాలవితంతువు వివా
చేసుకొనితీరవలెనని చట్టము చేయండి!
రావుగారు చంటిపిల్లలచావులకు చింతిం
న్నారు. పాపము! విచార మెందుకు?
నవిరోధచట్టమును చేసి పిల్లలు పుట్టకుం
చేయండి! గురుమూర్తిగారు మెత్తనిగుండె
డు. అందుచేత బాలింతలచావులుచూడ
బాధపడుచున్నాడు. ఎందుకీ బాధ? దానికి
తము విరుగుడులేదా? ఖీమా రంతా రిఫా
బాలింతమరణములు మాన్పవలెనంటే
డిగినతరువాతనే స్త్రీలు పెండ్లాడవలెనని
చండి. ఎక్కడ పుండుపుడితే అక్కడ
చేయాలి కాని యీ వివాహచట్టమో
నేలవిడిచిన సాము!

తటస్థులు

ోమనాథం! మంచిసంగతు లేశావు.

గురుమూర్తి

వితేటలకు నీవే మూర్ఛపోవాలి. నీకుయు
మీా ప్రెసిడెంటే సిగ్గుపడుచున్నాడు.
చేత మేము జవాబు చెప్పనక్కరలేదు.
ంటి వితండవాదమునకు దిగితే మీాకు
రాజీకుదరదు.

రామారావు

సోమనాథం చెప్పినది యుక్తికి ప్రతియుక్తిగాని సనాతనధర్మవాదుల సిద్ధాంతములని మీారను కోకూడదు. నేనుకూడా అతిబాల్యవివాహము దురాచారమనేవాడనే. శాస్త్రప్రతిబంధకము లేకున్నను, బ్రాహ్మణులను జూచి తదితరజాతులు చిన్నపిల్లలకే పెండ్లి చేస్తున్నారు. ఇవి యాపుటకు వివాహచట్ట మొకటి యవసరమనియే నామతము. కాని రజస్వలాపూర్వ వివాహములే శాస్త్రీయము లని విశ్వసించు వారికి—బ్రాహ్మణ, వైశ్య, విశ్వబ్రాహ్మణ కులములకు—ఈచట్టము వర్తించకూడ దను వారిలో నేనొకడను. వివాహము మతసంస్కారములలో నొకటి. అందుచేత ధర్మశాస్త్రములను నమ్మి రజస్వలా పూర్వ వివాహములు చేయువారిని శిక్షించుట న్యాయవిరుద్ధ మని స్పష్టముగా చెప్పగలను.

శర్మ

లౌకికదృష్టితో చూచినప్పటికి శారదాచట్టము వలన మన సంఘమునకు మరియొక నూతనోపద్రవము రావచ్చును. ౧౪ సంవత్సరములకు లోపుగ స్త్రీకి వివాహము చేయరాదని శాసించిరి. కాని అటుతరువాత విధాయకముగ స్త్రీలకు వివాహము కావలెనను నిర్బంధము లేదు. ఇప్పుడు పాఠశాలలలో స్త్రీలకు నేర్పెడి విద్యావిధానము మారనియెడల స్త్రీలకు వివాహము ఐచ్ఛికమగును కాని విధాయకము కాకపోవచ్చును. హిందూధర్మముల ననుసరించి

స్త్రీలకు వివాహము నిత్యము. శారదాచట్టము వలన మొదలుకే మోసము రావచ్చును.

సోమనాథము

అప్పుడు రిఫార్మర్లకు ఏనుగు నెక్కినంత సంతోషము వచ్చును.

శంకరరావు - సూరయ్య

ఇప్పుడు రజస్వలానంతరవివాహములు ఆచారములో నున్న బ్రాహ్మణేతర సంఘములలో స్త్రీలకు వివాహములు ఆగిపోయినవా? నిర్బంధముగ జరుగుట లేదా?

గురుమూర్తి

శిష్టాచారపరాయణులును అనుశ్రుతముగ వచ్చుచున్న వైదికధర్మముల వదలక శాస్త్రానుగుణ్యముగ నడుచుకొనుచున్న నంబూదరి బ్రాహ్మణులలో రజస్వలానంతరవివాహములు సామాన్యముగ జరుగుట లేదా!

సోమనాథము

నంబూదరులు బ్రాహ్మణులేనా? వానపామూ పామే! వారిస్మృతులే వేరు. వారిది శంకర స్మృతి; మనవి ఋషిప్రోక్తములు. శిలాశాసనములవలె ఎన్నటికి మారనివి.

శర్మ

గురుమూర్తి చెప్పినమాట సత్యమే కాని నంబూదరిస్త్రీలకు ఇంగ్లీషువిద్య చెప్పించుటలేదు. వారు పురుషులతో సమానముగ ఉద్యోగములు సంపాదించి ఆర్థికస్వాతంత్ర్యమునకయి పెనగులాడుట లేదు. పాశ్చాత్యులలోను అమెరికాదేశములోను స్త్రీలు ఆర్థికస్వాతంత్ర
మును సంపాదించి వివాహమన్న యేవగిం
చూపుచున్నారు. ఇష్టమువచ్చినన్నిరోజుల
పురుషులతో భార్యాభర్తలవలెనుండి త
వాత విడిపోవుచున్నారు. స్త్రీలకు ఆర్థికస
తంత్ర్య మున్నయెడల కొలదికాలములో మ
సంఘమున కీయవస్థ పట్టక తప్పదు.

సోమనాథము

సంస్కారప్రియులకు కావలసిన దేయది. అ
గా రుద్యోగముచేసి సంపాయిస్తుంటే అయ
గారు ఇంట్లో వంటచేసి భరణాంతించుంచా

గురుమూర్తి

స్త్రీవిద్యావిధానము పూర్తిగా మారవలెన
వారితో నేనుచేరుతాను. గృహిణీధర్మ
లను చక్కగ నెరవేర్చుకొను నేర్పుకల
వలెను. వివాహమాడుట కిచ్చలేనివారి
గత్యంతరములేని యనాథస్త్రీలకును ఇప్ప
పాఠశాలలలో నేర్పెడి విద్య యుపకరించిన
జనసామాన్యమున కీవిద్య పనికిరాదు. విద
విధానము మారినయెడల రజస్వలానం
వివాహములు చేసినను మన సంఘమున
శర్మచెప్పిన యవస్థ పట్టదు.

రామారావు

మనస్త్రీలకు కావలసినవిద్య చెప్పే పద్ధ
౧౨ సంవత్సరములకు లోపుగా పెండ్లిచే
మని సనాతన ధర్మవాదులు వాగ్దాన
చేస్తారు. ఆప్రకారముగా శారదాచట్టము
మార్చవలెను.

గురుమూర్తి

సంవత్సరములకు లోపుగా నిషేకము
ము అని సనాతనధర్మవాదులు ప్రమా
చేస్తే మీరు చెప్పిన రీతిని వివాహ చట్ట
మార్చుటకు మా కభ్యంతరము లేదు.

శర్మ

ణమెందుకు? నిషేకవయోనిర్ణయచట్ట
చేయండి.

గురుమూర్తి

వయోనిర్ణయచట్టమును అమలులో
కు బ్రహ్మతరముకాదు. భార్యాభర్తలు
కులు ఏకమవుతారు. చట్టపుదారి చట్ట
ండి.

సోమనాథము

రయ్యా శాసించడానికి? నా కూతురి
కి నాయిష్టమా? నీ యిష్టమా? చంటి
చేస్తాను. నీవెవరు అడ్డుపెట్టడానికి?

శంకరరావు, సూరయ్య

టి పెంకెతనానికి దిగితే మీకు మాకు
లో రాజీ కుదరదు.

తటస్థులు

టికి కుదరదు.

సోమనాథము

క మీరు మమ్ములచేసే దేమిటి? మీరు
సనాలు చేసుకోండి. మేము యథాప్ర
గా యిప్పటివలెనే పెండ్లిండ్లు చేసి తీరు
.

గురుమూర్తి

చేస్తే చట్టములో విధించిన శిక్షలు అనుభవించి తీరుతారు. మీరు నిర్భయముగ చట్టమును ధిక్కరించి పెండ్లిడ్లు చేయలేరు. అథవా యే కొద్దిమందో చేస్తే మేము రిపోర్టుచేయక మానము.

సోమనాథము

ఆసాంపూ చూస్తాంగా. ఏమొగాడు ఫిర్యాదు చేస్తాడో. చేసి పల్లెటూళ్లలో ఎన్నిరోజులుంటాడో! తినబోతూ కూరల రుచెందుకు? మా యేర్పాటులో మేమూ వున్నాము. పిల్లపెండ్లి చేయుటకు తల్లిదండ్రులు భయపడేయెడల కన్యాదాతలు సిద్ధంగా వున్నారు. గుడ్డిగవ్వ ఖర్చుగాకుండా పౌరోహిత్యము చేయుటకు నేను సిద్ధం. లేవండయ్యా కార్యం ముందర వీరితో వాదా లెందుకు? ఇదచాలు లేవండింక.

రామారావు

శారదాచట్ట మను పిశాచంబు మడసి

సోమనాథుడు

వేదచోదితధర్మంబె వేధదన్ని

రామారావు

చిన్నపిల్లల పెండ్లిండ్లుచేసి మమ్ము

సోమనాథము

బొజ్జ నిండంగ విందులఁ బ్రోచుఁగాక.

(అందరు నిష్క్రమింతురు.)

సెట్టి లక్ష్మీనరసింహముగారు (కవితాసమి

ఆడె వలతేఁడు నా ప్రియురాలితోడ
జూద మొకనాడు: జూదాన నాదియందె
యోడె మున్ను సంపాదించియుంచుకొన్న
యట్టి తనకనకాదుల[1] నలకుఁబోఁడి
యొడలిమార్దవంబునకు మాఱొడ్డి యతఁడు;
ఈగతిని దనయాయమ్మ[2]లెల్లఁ జెల్ల,
నెంతయును బంతమునఁ గంతుఁడంత నింతి
తీయమోవికి మాఱుపందెంబుగాఁగ
నొడ్డి, తనచేతి చెఱకువిల్లోడిపోయె;
వింటినారి నతం డళివేణి కురుల
కెదురుపణముగాఁ బెట్టి యయ్యదియు నోడె;
ధ్వజమునందున్న యట్టి మత్స్యముల మగువ
కనుఁగవకు నోడి, యోడె జంఘలకుఁ గేత
నేతరాంకంబుల మకరకేతనుండు;
చెలిపలుకులకుఁ జిలుకతేజీల నోడె:
ఇటు లతఁడు తనవిభవ మోడుటయె కాక,
కాక మది హెచ్చి యాకొమ్మ కాకలిస్వ
రమ్మునకుఁ దనసఖుని పైకమ్ము[3] నోడె;
అంతతోఁ బోక, తన యన్న హంసవాహ
నము లొయ్యారియొయ్యారంపు నడలకోడె;
జనకు కరములఁగల శంఖచక్రములను
జంక కతఁ డోడె సతి గళజఘనములకుఁ;
దల్లి పుట్టింటిసంపదం దరుణిపాణి
పాదములకోడెఁ బిదప నాజూదగాఁడు;
మేనమామకుఁ గలిగిన మిసిమి[4] నెల్ల
నాతఁ డోడెఁ జేడియమోము నందమునకు:
ఓడుటకు మఱేమియును లేకున్న తన్నుఁ
జూచి యాచెలి నవ్వఁగా సైఁచలేక,
దర్పకుఁడు దర్పమునఁ దన తనువు వెనుక
నోడినపదార్థములకు మాఱొడ్డి, యాఁచి
పాచికలువైచి, యోడె నెప్పటివిధాన:
ఆకతంబున నాతఁ డనంగుఁ డయ్యె!
హరునికంటిమంటనుబడి మరునియొడలు
భస్మమయ్యెనటన్న యాపలుకు వట్టి
పుక్కిటిపురాణమని నాకు బోధపడియె.

ఇంచువింటను విరితూపు లెక్కువెట్టి
నన్నుఁ గొట్టఁదొడంగిన యన్నుమిన్న
కాళ్లపైఁ బడితిని గావు కావుమంచుఁ.

* * *

గావుకావుమం చంతటఁ గాకులఱవఁ,
దెలివిగంటిని; కలయని తెలిసికొంటి!

---

1. కనకాదుల=సంపెఁగలు మొదలైనవి; బంగరు మొదలైనవి. 2. ఆయమ్మలు=ఆ+అమ్మలు; అర...ములు. 3. పైకమ్ము=పక్షిసమూహము; ధనము. 4. మిసిమి=కాంతి; సంపద.

# ...దుకథ

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ గారు

౧

రదాచట్టం ఆరంభించబోయేముందు జరిగిన
పెండ్లిండ్ల ప్రళయంలో పరమనైష్ఠికులైన పేరి
ారు రానున్న కుల హానికి భయపడి కట్టుతిప్పిన
నే కంగారుపడి యేడాదిపిల్లయిన కామేశ్వరిని
వాడగు శేషగిరి కిచ్చి ముడివేశారు. పెండ్లి
జనులపందడికీ పురోహితుల మంత్రపురోదకూ
దప్పుడుకూ పిల్ల అదిరిపోయి పోరుపెట్టి యేడు
పాపం తల్లిఅయిన అన్నమ్మగారు చాలావో
డ్డకు పాలిస్తూ మాడుముళ్లూ వేయించింది.
ువా ఒకరోజు పెండ్లి కాదు. అయిదురో
క్షణంగా జరిగినవి. అన్నమ్మగారికి చిన్న
పెండ్లి ముచ్చటలన్నీ కూతురుమూలకంగా మళ్లీ
యి. ఈ వివాహంలో శేషగిరి కట్నం ఒక
ా పట్టుకోటూ; కామేశ్వరికి సొమ్ము
తల్లిపాలు. అది శాస్త్రీయమైన
వాహం కాబట్టి, పెండ్లి కూతురు తల్లికే గాని,
తురుకి చీర, రవికల, చదివింపులు అవసరం
ంది. పేరిశాస్త్రిగారు, సాలంకృతికన్యా
ని పిత్రుదేవతల తరింపజేయనెంచిన నిష్ఠాగరి
బట్టి పిల్లకు పెట్టవలసిన నగలనుగూర్చి కాని,
క్లినుగూర్చి కాని ప్రస్తావనైనా చేయలేదు.
ట్టిన పుస్తెలబొందుకూ మొగానకట్టిన బాసి
ంకూ చీకాకుపడి కామేశ్వరి యేడ్చేది. పీటికి
ాటపూటా అగ్నిహోత్రానికదగ్గిర పొగా. దీనికి
కామేశ్వరి కాకుండా శేషగిరికూడా కలిమి
రికి రానని యేడ్చేవాడు. బుజ్జగింపో, మందలిం
ాగోట్లా సమాధానపెట్టి కళ్ల నీళ్లు తుడిచి తండ్రి
ం చేయిస్తూ ఉండేవాడు. ఏమయితేనేమి

క్షణంగా అప్పటి పేజావాణీ, ఊరేగింపూ
అప్పగింతలు దండాలింపులూనైనా...శే

లోటూ లేకుండా యథావిధిగా జరిగింది. ఆగ్రామంలోని బ్రాహ్మణులయిండ్లలో ఆఅయిదురోజులు పొయ్యి రాజెయ్యలేదు ఈ విధంగా అన్నదానం చేసి పేరిశాస్త్రిగారు ధన్యులైనారు. చేసుకొనేవాళ్ల ముచ్చటెట్లాఉన్నా చేసేవాళ్లముచ్చటా చూచేవాళ్లముచ్చటా బాగాతీరింది. దివ్యమైన యీపుత్రికా వివాహం జరిపి రానున్న ఉపద్రవం నుండి రక్షింపబడితినిగదా అని పేరిశాస్త్రిగారు ముదితులైనారు.

౨

శేషగిరితండ్రి సుబ్బయ్య దీక్షితులు గుంటూరి స్కూలులో తెలుగుపండితుడు. వైదికవాసన పూర్తిగా పోక పిల్లవాడికి పెండ్లిచేశాడు గాని లౌకికవృత్తిఅంటే ఆయనకు మహామోజు. ఏనాటికైనా తనకొమారుణ్ణి బి. ఏ., బి. యల్. చదివించి వాకిట్లో బల్లకట్టించాలవని ఆయనకోరిక. కాబట్టి మడిమాన్యాలు తెగనమ్మైనా శేషగిరికి యింగ్లీషుచదువు చెప్పించడానికి పూనుకొన్నాడు. సహజంగా తెలివిగలవాడైన శేషగిరి ఒక్క క్లాసూతప్పకుండా యెక్కివచ్చి ఇరవైయేండ్లు వచ్చేటప్పటికి బియేప్యాసై తండ్రిని సంతోషసాగరంలో ఓలలాడించాడు. వెంటనే సుబ్బయ్య దీక్షితులుగారు మహోత్సాహం జెంది తన యీప్సితార్థమైన లాచదువు సాధించడానికి శేషగిరిని చెన్నపురి పంపించారు.

శేషగిరికి చిన్నప్పటినుండి నవనాగరికతయందు మోహమెక్కువ. దానికి తగినట్టుగా సాహిత్యసమితిసభ్యులతో అతనికి సావాసం. వారి నిరంతరజో స్త్రీపల్ల ప్రణయగీతా లల్లడం ప్రకృతిశోభ నాస్వాదించడం నేర్చుకొన్నాడు. కాని అతడు పుట్టింది మొదలు గుంటూరులోనే ఉండి తల్లిదండ్రుల ప్రాపున చదువుకొన్నవాడు కాబట్టి అతని నవీనభావాలింకా విపులంగా విస్తరించడానికి వీలుకాలేదు.

చెన్నపురి దర్శనం అతనికి క్రొత్త. కాన, అప్పటి వింతలకూ, వినోదాలకూ ముగ్ధుడై అతనికొని ...త్త. తో.

చూచినది చూడకుండా చూస్తున్నాడు. చూడంజూడ అతనికి ప్రపంచమంతా మారిపోయినట్లు తోచింది. శారదాచట్టంతో బాల్యవివాహాలు నిషేధింపబడటంచేత బాలికలు తండోపతండములుగా పాఠశాలలో జేరి బాలకులతో సమంగా చదువుతున్నారు. వాండ్ల ముఖోల్లాసమూ, చాకచక్యమూ, తెలివితేటలూ వినయవిధేయతలూ చూస్తే అద్భుతంగా జూపట్టినవి. తనసహపాఠులైన వారిలో అనేకు లట్టి వయోవిద్యారూపగుణగణ్యలైన కన్యలను వివాహమాడడం గూడా శేషగిరి కొన్నిచోట్ల చూచాడు. తన బాల్యవివాహంతో అలనాటి వివాహాలు పోల్చి చూచుకొని లోలోపల సిగ్గుపడ్డాడు. తనకు పెండ్లయినసంగతి యెవరికీ చెప్పకూడదనుకున్నాడు. అప్పటికీ జంకుతీరక తనజందెంతీసి పెట్టెలో దాపుకోటం మొదలుపెట్టాడు. ఈవిధంగా మొదటియేడు గడచిపోయింది. శేషగిరి ఎఫ్. యల్. క్లాసులో నెగ్గి బి. యల్. క్లాసులో ప్రవేశించాడు. ఈప్రవేశించిన కొన్నాళ్లకే కామేశ్వరి రజస్వలై రెండేండ్లయింది. ఇంకా ఆపడం భావ్యంగాలేదు. కాన ఈశ్రావణశుద్ధ దశమి, నిషేకమునకు సుముహూర్తము నిర్ణయించినాము. నీవు అప్పటికి సెలవు తీసుకొని రావలసినదని తండ్రిదగ్గరనుంచి శేషగిరికి ఉత్తరం వచ్చింది.

3

కామేశ్వరి రూపసి కాదు. దానికి తగినట్లుగా పెండ్లయిన ఆఱునెల్లకే వచ్చిన చిన్నబిడ్డగుణంవల్లా ఆమ ఉపటేకు వచ్చిన స్ఫోటకంవల్లా, ఆమెమొఖాన కొన్ని మచ్చలు పడ్డాయి. ఇట్టి నైమిత్తికాలవల్ల కొన్ని వికారాలు యేర్పడ్డా దైవానుగ్రహంవల్ల బాలారిష్టాలన్నీ గడిచి పెద్దదైంది. కాని ప్రకృతియొక్క నైజంచేత ఒక యేడుకంటె మరొకయేటికి కామేశ్వరి ఆకృతియందు పెద్దదగుచున్నప్పటికీ అవయవస్ఫూర్తి చెందుచున్నప్పటికీ వయోభివృద్ధివల్ల నిజంగా మనిషి పొందవలసిన విద్యావివేకములూ లోకజ్ఞానమూ నగైరా లేమీ కామేశ్వరికి కలుగలేదు. నాగరికపు స్త్రీప్రపంచంలో జరుగుచున్న వేషభాషల మార్పులూ, విద్యావికాసాలూ ఆమె అజ్ఞానపు హృదయంలో కించిత్తుచోటునైనా ఆక్రమించలేదు. తండ్రిఛాందసమూ తల్లి మౌఢ్యమూ ఆమెను యుగధర్మాని కెడంగా చేసివైచినవి. శేషగిరిలో జరుగుచున్న విద్యాభివృద్ధి చూచైనా కొమార్తెకు కొంచెం అక్షరజ్ఞానం కలిగింతామనే తలంపు తల్లిదండ్రులకు తోచలేదు. ఎట్లాగో ఒకడి కిచ్చి ముడివేశాముగదా ఇక పరవా లేదనుకొన్నారు. అంతేగాకుండా ఆడదానికి చదువు చెప్పించడంవల్లనే యీవిపరీతపు వికృతపు వింత శాసనాలు పుట్టడానికి కారణమనీ ఆడది హద్దుమీఱకుండా ఉండడానికి సాధ్యమైనంతవఱకూ ఆడదాన్ని అడగ్రొక్కి ఉంచడమే మంచిదనీ పేరిశాస్త్రిగారి అభిప్రాయం కాబట్టి యీరెండు కారణాలవల్లా కామేశ్వరి ఒకమౌఢ్యలోకంలో పెరిగింది. ఏమయితేనేమి యుక్తవయస్కురాలైంది గనుక యిక యింట్లో ఉంచుకోడం ఉచితంగాదని పేరిశాస్త్రిగారు నిశ్చయించుకొని వియ్యంకునికి ఒకఉత్తరం వ్రాశారు. దానికి జవాబు రాకపోతే మళ్లీ వ్రాశారు. ఇక ఉపేక్షకూడదని సుబ్బయ్య దీక్షితులుగారు కొమారునికి ఉత్తరం వ్రాశారు.

౪

ఆఉత్తరం చూచిందిమొదలు శేషగిరి "నాన్నకు ఏమి సమాధానం వ్రాస్తా"మని పెద్ద యోచనలో పడ్డాడు. ఏడాదిక్రిందటనే ఒకమాఱు కామేశ్వరిని చూచాడు శేషగిరి. అతను వెళ్లేప్పటికి కామేశ్వరి తల్లితోబాటు అంట్లు తోముతూ పెనిమిటి వచ్చాడని కంగారుతో అవతలికి వెళ్లింది. అవెళ్లుటూనే ఒకమాటు తలెత్తి పెనిమిటివంక కామేశ్వరికూడా చూచింది. ఆసమయంలో ఎగుడుదిగుడుగా కట్టుకున్న చీరా, మోచేతులంటా తొడుక్కున్న చారల రవికా, అరవిరిగిన పెద్దపెడపట్టే, ఆపట్టికి వ్యత్యస్తంగా పెట్టుకున్న పిన్నూ, మెడలో జిగిలేని పుసుచ్చేరినానూ, చేతులకు పొన్నులవంటి మురుగులూ, ఆముగానికి ముందు సుత్తెంగా తొడిగించుకున్న నాలుగైదు పట్టుగాజులూ, చెవులకు పెద్దపెద్దకమ్మలూ, చెంపసరాలూ, నడిమిపాపటతీసి గట్టిగా జడల్లుకొని చుట్టుకొన్న బిళ్లచుట్టూ, దానికి యెగువగా ఒకనాగరం,

ట్టు చక్క-చేసుకోకపోవడంచేత దుఃఖ్యవలె జాట్లూ, ఈవిధముగా ఉన్న భార్యను శేషగిరి చూచాడు. ఆమెపై ఖరీ అతని కేమాత్రం ఆకర్ష లేదు. అప్రయత్నంగా అతని మనస్సులో భార్య ఒకవిధమైన అసంతృప్తి గలిగింది. తన బాల్యవి తలచి మనస్సులో కొంచెము నేవు కేఁన ు. కాని ఆవేదన యెవరికీ తెలియబడకుండానే ా యింటికి వచ్చేవాడు. కాని ఆపై ముఖ్య మాత్రం టికి వనలు బొమ్మలు వేసుకొని వృద్ధిపొందు ఉన్నది. చెన్నపురి వచ్చినతరువాత నవనవాకార నవీనశృంగారములతో చెక్కిళ్లపై అరుణదీప్తి, ్పై చిఱునగవుదొంతులూ, లోలలోచనము క్రీడావిభ్రమతలూ తొలకరింప కదిల్చినప్పుడెల్లా లు చిమ్మేచేతిబంగారుగాజులతళ్తళలతో మెదలి ల్లా మిలమిలలాడే చెవిలోలాకులచెంగలింపులతో ా గానికంతనూ శోభదెచ్చే నిడుపైన వాలుజడతో ్నములూ, కాళ్లకు స్లిప్పర్లూ, జిలుగైన చీరా, తుల రవికా మొదలైన నవనాగరికాలంకారము తెలుగూ యింగ్లీషు భాషలతో అనర్గళంగా ుకుంటూ సౌందర్యదేవతలవలె సరస్వతీ అవతార కానుపించే ఆంధ్ర బాలికారత్నములను చాల చూచాడు. చూచినకొద్దీ అతనిమనస్సులో క్రమా ెందుతున్న స్వభార్యయందలి వైముఖ్యాంకురం వృద్ధిపొంది వేళ్లుతన్ని పెళ్లగింపరాని మహావృ క్షమైంది. కాబట్టి అతడు ఉత్తరానికి జబా ుగూడ దనుకున్నాడు. ఇట్లా అనుకుంటూ ఉం ండుమూడురోజులు గడిచిపోయినాయి. తండ్రి జబాబువ్రాసినావుకాదేమి? ఆ రోజుకు నీకు ొకి వీలవుతుందా కాదా, అనకల వాళ్లు యున్నం లసి ఉంటుందని మరల ఉత్తరం వచ్చింది.

౫

మాటు సమాధాన మివ్వకతప్పదు, కాని ఏమిస్తా మాట తలుచుకుంటే శేషగిరి గుండె గుభేలు ఏడో యేట తనకు పెండ్లికావడ మనేది అతని కొక అవమానంగా ఉండడంచేత మిత్రులతో యీవిషయం యోచించడానికి అతనిచిత్త మంగీకరించలేదు. కాబట్టి ఒంటరిగానే యోచిస్తున్నాడు. అందునిమిత్తం ఆటపాటలూ సాయంకాలపుషికారులూ మానుకున్నాడు. తనగదిలో ఒంటరిగా కూర్చున్నాడు. 'ఏడాదిపిల్లకూ ఏడేండ్లపిల్లవాడికీ చేసిన వివాహం శాస్త్రీయ మెట్లా అవుతుంది? తలిదండ్రులు చేసిన యీ అత్యాచారపు వివాహంలో నాబాధ్యతేమున్నది? నేనెందుకు దీనిని అతిక్రమించగూడదు. పసితనంలో అనాలోచితంగా చేయబడ్డ యీవివాహానికి బద్ధుడనై ప్రపంచమెఱుగని ఆమోటుమానిసితో నాజీవితమేల దుఃఖభాజనం చేసుకోవాలె? దీన్ని అతిక్రమిస్తే నాకెందుకు పాపంవస్తుంది? ఏమీ యెఱుగని పసిపిల్లలమైన మమ్ము కూర్చోబెట్టి వీరి నీఅక్రమపుపెండ్లి తంతు జరుపుతున్న దెవరు? ఎవరి బాధ్యతతో వారిట్లా చేశారు? మైనరుఆస్తిని అమ్మడానికీ, అన్యాక్రాంతం చేయడానికీ లా వొప్పుకోదు. వారి మీద ఒకఋణం మోపడానికైనా గార్డియన్‌కు హక్కులేదు. అట్టిచో మైనరుయొక్క వివాహపుహక్కుమాత్రం అట్టిది గాదా? దానిని జాగ్రత్తగా సంరక్షించి ఒప్పగించడం సంరక్షకుల బాధ్యతగాని యిట్టి దుర్వినియోగం న్యాయమా? సరే పోనీ యేదో గూడా వినితో చేశారే అనుకో కామేశ్వరికి, చదువెందుకు చెప్పగూడదు? నాగరిక మెందుకు నేర్పగూడదు? ఏదోవిధంగా ముడివేశాము గదా. ఇక నెక్కడికి పోతాడని ధిలాసా కాబోలు. ఈధిలాసా వదలించడ మెంత సేపుకాని, పాపం ఆ కామేశ్వరిని తలుచుకుంటేమాత్రం కొంత జాలివేస్తున్నది. నేనంటే మగవాణ్ణి గనుక ఎట్లాగో తెగించి పెండ్లి చేసుకుంటాను కాని, అర్థం శుద్ధం యెఱుగని ఆ అమాయకురాలి గతి యేమికావాలె? డైవోర్సు చట్టం అమల్లో ఉన్నా ఆఛాందసులు పిల్లకు పునర్వివాహం చేస్తారా? ముమ్మాటికీ చేయరు. చేయకపోతే ఆ బాలిక ఉసురు నాకు కొట్టుకుందేమో గదా, ఎచ్చే నాకెందుకు కొట్టుకుంది? నేనేమెఱుగుదును? ఆతాళిబొట్టు బొందైనా నేను కట్టానో నాకు చేతకాకపోతే ఆపురోహితుడే కట్టాడో నాకు జ్ఞాపకం లేదు. ఈ

ముడివేసిన దోషమైనా యెఱుగని నాకు ఆపిల్ల ఉసురు యెందుకు కొట్టుకుంది? ఇహజీవితంలో అనుకూలదాంపత్యంకంటె స్వర్గ మేమున్నది? అట్టి ఐహికసుఖమార్గం పాడుచేసుకొని నాజీవితం దుఃఖభాజనం చేసుకోనా? టట్-వల్లపడదు. కాని మాతండ్రి కేమని సమాధానం? నే నిప్పుడాపిల్ల వద్దని వ్రాస్తే మానాన్న యెంత నొచ్చుకుంటాడు? నామాటతో నీశాడు, నాపరువు పోగొట్టాడని యెంత కటకట పడ్తాడోగదా, అయ్యో! స్వార్థంకోసం పూజ్యులైన మాతల్లిదండ్రుల ధిక్కరించనా? అయ్యో! నా బ్రతుకు యెటువంటి సంకటస్థితిలో పడ్డది? నాన్నా, నాకిటువంటి పెండ్లిచేసిన వాడవు నా కీచదు వెందుకు చెప్పించావు? ఈవిధమైన యోచనలు మనస్సులో తగిలీ:కొద్దీ శేషగిరికి కండ్లనిండా నీళ్లువచ్చినాయి. అనుకూలవతియగు భార్యలేక అల్లాడుతూ బ్రతికి ఉండడంకంటే యీజీవితపుటోడను యీలోకసాగరంనుండి తొలగిస్తే బాగుంటుందేమో అనుకున్నాడు. కాని తాను సుబ్బయ్యదీక్షితులు బుచ్చమ్మగార్ల యేకపుత్రుడు. వాళ్లు తనమీదనే ప్రాణాలు పెట్టుకొని తమ సర్వస్వం విక్రయించి తనకు చదువుచెప్పిస్తూ తానేదో గొప్ప ఉద్యోగంచేస్తే చూడాలని కొండంత ఆశతో యెదురుచూస్తున్నారు. ఇంతకోరికతో ఉన్న తల్లిదండ్రులను యీవార్ధక్యంలో నిండుదుఃఖంలో ముంచిపోవడం న్యాయమా? అన్యాయం అన్యాయః, అని అతని అంతర్వాణి ఘోషించింది. శేషగిరి తనహృదయవీణలోని ప్రతితంత్రునూ మ్రోగించి చూచాడు కాని యే రెండింటికీ పొంతన కుదరలేదు. తానిప్పుడు తల్లిదండ్రుల మనస్సు నొవ్వకుండా ఉండడానికి కామేశ్వరిని తెచ్చుకొనినా తన ఆదర్శం ప్రకారం కుటుంబసౌఖ్యానికి తిలోదకం. లేదని ఆమెను వదలిపెట్టినా ఉభయుల తల్లిదండ్రులకూ మనఃక్లేశం, ఆపిల్లకు శాశ్వతంగా దుఃఖం. ఈరెండూ నాకేలనని తాను గతించెనా కనిపెంచిన తల్లిదండ్రులకు దరిలేని శోకం. సరే అదిగాదని కామేశ్వరినీ తెచ్చుకొని తాను కోరిన భార్యనింకదాన్ని గూడా చేసుకుంటే ఒకకవరలో రెండుకత్తు లిముడవు. ఇంతకంటే అగచాట్లమారిబ్రతుకు యింకోటి లేదు. అదీ గాదని ఆవిడ నక్కడ అనాఘ్రాతకుసుమంగానే ఉ తానిక్కడ అట్లాగే ఉంటేనో; జన్మమెందుకొచ్చిం యౌవనం యెందుకు ప్రసాదింపబడ్డదో, స్త్రీపుర లెందుకు సృష్టింపబడ్డారో, జగత్తులో శృంగారమె కో, సౌందర్య మెందుకో, చదు వెందుకో సంప యెందుకో, అన్నీ వ్యర్థమేగదా భార్యలేకపోతే. విధంగా అంతులేని యోచనలతో తుకతుక ఉడి తున్నది శేషగిరి హృదయం. కాని ఒకటే తేల్చుకో వ్యథపడుతున్నాడు. ఆరాత్రి భోజనం మానుకున్నా సరిగదా కూరుకన్నమాట అసలే యెఱుగడు.

## ౬

తెల్లవాఱింది మనసు మనస్సులో లేకనే హాస్ట వెళ్లి నాలుగు మెతుకులు నంజివచ్చి పాఠాలెక్క ఉన్నాయనో పరీక్షల సమయమనో సెలవులు వనో వ్రాసి పారేద్దామా, ఈమాటు ఉపద్రవం తుం దనుకుంటూ కాలేజికి వెళ్లాడు.

అక్కడ ఉండగానే శేషగిరికి తండ్రివద్దన టెలిగ్రామ్ వచ్చింది. "నీవు రెండు ఉత్తరములు వ నా జబాబీయలేదు. ఏమిటి నీఉద్దేశం? నీదగ్గరన రేపు ఉత్తరం రాకపోతే బయలుదేరి వస్తున్నా. మామగారు తొందరపెట్టుతున్నారు" అని అందు వుంది. ఆతంతివార్త చూచుకొనేటప్పటికి తల తిరిగి క్రుంగిపోయినాడు. ఈ అగ్నిపరీక్షలో యెట్లా తేసురా బాబూ అనుకున్నాడు. ఏమైనా సరే ఉపేక్ష కూడదు. ఎదుటికి వస్తే మఱీ మొగమొ మఱీ యిబ్బందీ కాబట్టి యేదోఒకటి తేల్చి యీ టపాలో పారేయడం కర్తవ్యం అనుకున్నాడు, ఆఉత్తరం వ్రాయడానికి కొంచెపు అవకాశంచా కాబట్టి ఆపూటకు ప్రిన్సిపాల్ దగ్గఱ సెలవు తీసు తనరూముకు వచ్చాడు. కలం కాగితం చేతబట్టుకుని కూ న్నాడు. కలం విదిలిస్తే అందులో సిరా లేదు, స సిరాబుడ్డీ తెచ్చి సిరాపోసుకోబోతే చెయ్యి వణికి చేతిమీదా చొక్కామీదా పడ్డది. ఆ చొక్కా అవతల పారేసి చెయ్యి గట్టిగా రుద్ది కడుక్కొని

వ్రాయడానికి కూర్చున్నాడు. కాని వ్రాయ
డే కటకటా కొట్టుకుంది. చేయి ఎటికి కాగితం
జారింది. ఆకాగితం మళ్లీ చేతికి దీసుకొని
తే అదేమో చేయి చచ్చుకొని పోయినట్లయి
ప్పి వ్రాసిన అక్షరాలు అలుక్కుపోయినాయి,
డిపోయింది. ఛీ అని దాన్ని క్రింద పారేసి
రు పేపరు అందుకున్నాడు. ఒకదానివెనుక
లా అనేకతవకలు జరిగిన కొద్దీ "నేనేలయింత
పోతున్నాను? ఇందులో నా అక్రమం
? ఒకపసివాని భవిష్యం పాడుచేసినవారిని
లేమాత్రం రెదిరించడానికి యేల భయపడాలి?
తను కన్యను చూచుకొని పెండ్లాడడం
న్యాయమైన హక్కు. అట్టి హక్కును
క్రమింపజేసుకొని దుర్వినియోగం జేసిన తల్లి
సంఘాన్ని ధిక్కరించడం న్యాయమే గాని
అక్రమం యేమున్నది? అని ఈవిధంగా తల్లి
న్యాయం తలంచగానే శేషగిరి హృదయంలో
ఉద్దీపించింది. రక్తం ఉడుకెక్కింది. కోపం
బలంగదా! ఎప్పుడైతే కోపం శక్తి-రో
షగిరికి మనస్సులో గలిగిన జంకూ చేతుల్లో
ణుకూ ఒక్కమాఱు హుంఫన యెగిరిపోయి
కేవలం మషీరసమును స్రవించే అవూటకలం
తీక్ష్ణతజెంది యోధునిచేతి ఆయుధంలాగా
ంది. ఆవుద్వేగంతో పరపరా ఒకపెద్ద ఉత్త
వ్రాసివెళ్లి పోస్టులో పారేసి గదికి చేరాడు.

౨

గిరి వ్రాసిన ఉత్తరం సకాలంలో సుబ్బయ్య
రికి చేరింది. నేను బయలుదేరి వస్తున్నానని
తో రావలసిన కొమారుకి ఉత్తరం భార
తో రావడంచేత దీక్షితులుగారికి మనస్సులో
భారం అనిపించింది. ఆత్రంతో తిప్పాని
నీకుమారుడి దగ్గిరనుంచీ ఉత్తరం వచ్చింది.
సి భార్యను పిలిచి ఆమెవద్ద యిట్లా చదవడం
గాడు.

"బ్రహ్మశ్రీ వేదమూర్తులైన చావలి సుబ్బయ్య
దీక్షితులు నాన్నగారికి, తమకుమారుడు శేషగిరి నమ
స్కరించి వ్రాయునవి. మీరు వ్రాసిన రెండుఉత్తర
ములును పెళ్లిగ్రామును చేరినవి. కాని మీరు నాకు
అక్రమముగా చేసిన వివాహమునకు బద్ధుడను కావల
యునా? వలదా? యను నాలోచనలో నుండుటచే
మీకు వెంటనే ఉత్తరము వ్రాయుట కాలస్యమైనది.
క్షమింప గోరెదను. నాన్నా! కామేశ్వరి నాకు వివా
హము చేయబడినదని మీరుచెప్పటే గాని నాకు గుర్తు
లేదు. జ్ఞప్తియందుండుకొనజాలని యతిబాల్యమున
నవ్యక్తులును, క్రీడాసక్తులును గు నిరువురు బాలబాలిక
లకు చేయబడిన వివాహము శాస్త్రీయ మెట్లగును? అశా
స్త్రీయమగు నీవివాహమునకు యుక్తవయస్సు వచ్చిన
తరువాత వధూవరులేల బద్ధులు కావలెను? వివాహము
ప్రతిస్త్రీపురుషునకును జన్మహక్కు. అట్టి వైవాహికపు
హక్కు తల్లిదండ్రులు దుర్వినియోగముచేసినచో దానికి
వధూవరులు బాధ్యులా? సుఖమును చెలువొందను
మనిషియు జీవితసౌఖ్యమును భగ్నముచేసికొను మనిషియు
తలిదండ్రులు కట్టిపెట్టినయనను కూలయగు భార్యతో కల
కాల మల్లాడును ఏరియు సత్యమోత్తమమైన మనహిందూ
మతమైనను శాసించుచున్నదా? విద్యాపరిపూర్తియగు
వఱకు బ్రాహ్మణునకు వివాహార్హత లేదుగదా. విద్యా
భ్యాసనకాలమంతయూ పరమపవిత్రమైన బ్రహ్మచర్యమున
ప్రతియధ్యేతయు నవష్టించి తీరవలెనని హిందూమతము
స్పష్టముగా విశదీకరింపుచున్నది గదా. విద్యాపరి
పూర్తియైన వెనుకనే సమావర్తనము అనగా నేమి?
గురునికడ వివాహమున కనుజ్ఞ గొనుటగదా. ఈవిధ
ముగా బ్రహ్మచారియొక్క విధిని హిందూమతము శాసిం
పుచుండ అక్షరాభ్యాసమే చేయబడని పిల్లలకు హిందూ
మతముపేర వివాహము జరుపుట హిందూమతము నుల్లం
ఘించుటయని వేరే వక్కాణింపబనిలేదు. మన మహ
ర్షుల వివాహవృత్తాంతములు వివాహముయొక్క కాల
మును చక్కగా ప్రతిపాదించుచున్నవి. విచారించి
చూడుము. వారిలో నొక్కరును అధ్యయనము పూర్తి
గాక పెండ్లియాడలేదు. కాన మీరు మతప్రియత్వము

చేతనే మతమును ధిక్కరించితిరి. బిడ్డలయందలి వాత్సల్యముచేతనే వారి భవిష్యమును పాడుచేసితిరి. విచారించి చూచినచో దీని తాత్పర్య మేమనగా మతప్రియత్వము దురభిమానముగాను, బిడ్డలయందలి వాత్సల్యము సర్వాధికారముగాను పరిణమించినది. ఈ అతివ్యాప్తి దోషముచే ఉద్దేశము మంచిది ఆచరణ చెడ్డదియు నైనది. పరంపరాగతాచారముచేత దీనిని మీరు గమనించి యుండరు. అయితే సదుద్దేశముతో మీరుచేసిన యపకారమును సహించుట మీకుమారుడనైన నావిధియే కావచ్చును కాని ఆకామేశ్వరివిషయ మింకొక విచారించి చూడుడు. ఆబాలికకు విద్యాసంస్కారము లేదు. నాగరికతయు లేదు. అతిఛాందసమునకును మౌఢ్యమునకును నాలవాలమైన కుటుంబములో పదునారేండ్లు పెరిగి వచ్చిన యామె నాయభిప్రాయముల నామోదించి నా కోరిన విద్యార్జనము నామోదించునని నాకు విశ్వాసము లేదు. న్యాయముగా అలుసుగ లేక శరీరులు కాన వారి శరీరములో సగభాగము కేవలము మొద్దువారి నిరుపయోగముగా నుండుటకు నామనస్సంగీకరించుటలేదు. సర్వాంగములు సమానమైన వికాసములో నున్నప్పుడే శరీరికి నిజమైన ఆరోగ్యము, ఉల్లాసము, శోభ కాని యిట్టివేవియు నాకు కామేశ్వరివల్ల సమకూరునట్లు గన్పించుటలేదు. కావున నే నామెను భార్యగా నైకొనజాలను. ఇక ఒక్క సంవత్సరమునకు నావిద్య పూర్తి యగును. హిందూమతవిధిప్రకార మస్పృష్టమనురూపలక్షణాఢ్యయగు కన్యను పరిణయ మాడుదును. ఇది నా దృఢనిశ్చయము.

అయితే యీనాప్రవర్తనమువలన కామేశ్వరికిని, ఆమెతల్లిదండ్రులకును శాశ్వతదుఃఖమును, మీకు మనశ్శోకమును గలిగించినవాడ నగుదునని నాకు తెలియును. కేవలము పాలుత్రాగెడి పసిబిడ్డయగు కామేశ్వరిపై మోపబడిన యీవివాహబాధ్యత అక్రమమైనది. నిజమున కామె అవివాహితగా నెన్నదగినది. కాన ఆమె కిప్పుడు తగినవానిని జూచి పునర్వివాహము చేయుట ధర్మముకాదా? నా ఆర్జనలో కొంతభాగ మామెకు యావజ్జీవపర్యంతరు మిచ్చుటకు సంసిద్ధుడను.

ప్రపంచములో యేదేశీయులును నిట్టి శిశుక[...]ములు జరుపరు. తమబిడ్డల జీవితమునుపాడుచేయరు. [...]ర దాసులు హైందవులగుతల్లిదండ్రులకే యిది చెల్లి[...] ఇది పాశ్చాత్యనాగరికతాసంసర్గదోషమని మీరూహి[...] వచ్చును. కాని యిది హిందూమతమునకే విరుద్ధ[...]ముండే విన్నవించితినిగదా. కాన యుత్తమమైన [...]దూమతాభిమానినగు నేను కేవల మాచారోన్మాదవ[...] చేయబడిన యీవివాహము నుల్లంఘించుట ధర్మేతర[...]గాదని పూర్ణముగా విశ్వసించుచున్నాను. కాన న[...]ష్పించుటకై యనవసరముగా తంటాలు పడవద్దు. [...]శిర్పులు దండుగచేసికొని యిక్కడకు రావలదు. లాభ[...] లేదు నే నిప్పు డీవివాహధర్మము నుల్లంఘించుట [...] న్యాయముగా నాదైన దుర్వినియోగము చేయబ[...] హక్కును రాబట్టుకొనుటే గాని మరేమియుగాదు. తండ్రీ!

చ. "కులజయు నిర్మలాంగి యను
        కూలయు నయ్యయి విద్యలందు గా
శీలవతియుక్త సుశీల గుణ
        సన్నుతురాలును నైనయట్టి కో
మలి లభియించినంగద స
        మంజసమౌను గృహస్థధర్మ ము
ట్లలవడకుండెనే నిక గృ
        హస్థునిపాటులు చెప్పశక్యమే."

ప్రియకుమారుడు,
శేషగిరి.

అని యీరీతిగా ఉన్న కొడుకు ఉత్తరం చూ[...] తల్లిదండ్రులు నివ్వెఱపోయినారు. వినయవిధేయత[...] గలవాడున్నూ, విద్యాధికుడున్నూ అయిన కుమారు[...] తాము చేసినపనిని యిట్లా ధిక్కరిస్తాడనీ తమచేతిల[...] పుల్లతోనే తమకంట్లు పొడుస్తాడనీ, వారెన్నడూ అ[...]లేదు. శేషగిరి సాహసంమాత్రే సుబ్బమ్మ దీక్షి[...]లకు చాలా కోపం వచ్చింది. విధవామాలందువు చెప్ప[...]చిన దోషం యిది అనుకున్నాడు. కాని పాశ్చా[...] నాగరికత [...]ంచి లేకుండా హిందూధర్మానుసా[...]

...గిరి వాదించినవిధం కోపంలోనే కొంత పరవ
...ంప జేసింది దీక్షితులుకు. అంత పసివానికి వివా
...డానికి తనకు హక్కు లేదనుకున్నారు. కాని
...ా, అష్టకష్టాలు పడి విద్యాబుద్ధులు చెప్పిం
...గదా తప్పేఅనుకో నామాట కాస్త యెందుకు
...ాడదూ అనే శేషగిరిమీద ఆయనకొచ్చిన
...ాని ఏమి కోప మొచ్చినా యేమిచేస్తారు!
... యొక్క ఒప్పించడం పట్టిదీ అని వారిద్దటికీ
...ృథపడిపోయింది. అయితే ఆపిల్లగ తేమిటి?
... యింకోదాన్ని పెండ్లాడుతాడనుకో ఆపిల్ల
...ంది? మతం మంటగలిసిపోతుందని యేడాది
...ండ్లి చేసిన ఆఘాందకుడు పేరయ్యశాస్త్రి
... పెండ్లి జేస్తాడా? చేయడు. అయితే ఆపిల్ల
...నిపోదూ? ఏమి చేద్దామంటే యేమి చేద్దామని
...ాలపట్లు పట్టుకున్నారు. వాడిదగ్గరికి పోయి
...డ్డం పట్టుకొని ఏతిమలాడదామా అనుకు
... లాభం లేదనితమరే అక్షతలు వేసుకు
... దేశకాలపాత్రములు గుర్తించకుండా పెండ్లి
...ారబా టనుకున్నారు అయితే యిప్పుడు
...పనేమిటి? పాళ్లక్రీడ పనిపాటలన్నీ చేసు
...ుకు సున్నమూ ద్వారములకు తోరణాలూ
...ునకోసం యెదురుచూస్తుంటారే! అయ్యో ఈ
... వారికెట్లా తెలియజేస్తాము? తెలపక చేసే
...ాళ్లు మనలను నమ్మి ఉంటారు గదా. ఈ
...రోజల్లా యోచించి యోచించి శేషగిరి
...ికి పంపివేద్దామని నిశ్చయించి ఒకమనిషి
...ారు.

౭

వియ్యాలవారు వస్తారనుకునే వేళకు ఉత్తరం చేరింది. పేరయ్యశాస్త్రి ఆఉత్తరం చూచుకొని కొయ్యై పోయినాడు. కలకల్లాడుతూ శుభం కొరుతూ ఉండే కొంప క్షణంలో ఆలగోడు బాలగో డైపోయింది. తల్లీదండ్రీ, వచ్చినచుట్టాలూ, అందఱూ కామేశ్వరిని ముందుపెట్టుకొని యేడవడం సాగించారు. చిన్నవారూ కన్నవారూ శేషగిరిని చెడతిట్టారు. దేశకాలాలు గుర్తించకుండా యేడాదిపిల్లకు పెండ్లి చేసిన పాపాత్ముడను తానని తన పాపానికి ప్రాయశ్చిత్తం లేదని పేరిశాస్త్రి పెద్దగా యేడ్చాడు. తానుచేసిన పాపానికి కామేశ్వరిని గంగ చేయడం పాత్యతుల్యమని ఆయనకు తోచింది. కాబట్టి ఆదుఃఖంలో మొఖాన విభూతి రేఖలూ ధోవతికి పింజెలూ తీర్చుండలో కంఠలుడైన వాడూ, బ్రాహ్మణార్థాలకు పెనుదీటునివాడూ, శుభాశుభకర్మలు నిరాఘాటంగా జ[illegible]లవాడూ అయిన ఒకశ్రోత్రియ బ్రహ్మచారిని తీసుకవచ్చి వాడిముఖాన గొట్టినట్టు కామేశ్వరి కిచ్చి పెండ్లిచేద్దామా అనుకొన్నాడు. కాని వే: వేదాంగపారంగతులూ, అగ్నిష్టోమాది నానావిధాధ్వరకర్తలూ, పరమశ్రోత్రియులూనై ఒకేవిధంగా కీర్తిగన్న తివవంశానికి చేటి కీళశంకం కలిగించడానికి పేరిశాస్త్రి మనస్సొప్పలేదు. పాపం, బాల్యవివాహ పాపఫలమునకు గఱైయై కామేశ్వరి జీవితమట్లా నిరర్థకమై పోయింది.

---

చుట్టం కాపువాణ్ణి చూసేటందుకు వచ్చేడు. పొలం దున్నుతూన్న కాపాడు చూడకచూడక చాలాదినాలకు చూచిన చుట్టాన్ని చూచే వేళకు సంతోషం పట్టలేక పోయాడు. వాడి క్షేమసమాచార మంతా విచారించి ఆనక



"అన్నా, ఇంటికాడ పులగముంది పోదూ నే వానకవస్తా"

"అన్నా ఇంటికాడ పులగముంది పోదూ? నే వానక వస్తా" నన్నాడు. పాపం! చుట్టం రెండు దినాలుగా తిండీ తిర్థంలేక నడిచేటప్పటికి బలే ఆకలిగ ఉన్నాడు. కాపాడు ఇంట్లో పులగముంది పొ మ్మనగానే, చుట్టానికి పంచప్రాణాలూ లే వొచ్చినాయి. 'పోయి, బొజ్జనిండుగా పులగం తినేద్దా'మని వుసూరున ఇంటికి పరుగెత్తే డు. కాపాడిపెళ్లాం ఈ అపరూపపు చుట్టాన్ని చూచి నివ్వెరపడి వాడి బాగోగులంతా విచా రించి, మళ్లీ "అన్నా! నేయి వచ్చేవరకు వు టావా, లేక భోంచేస్తావా?" అంది. చుట్ట నేయి, పులగమంటే ఈదంపతుల మారుపేళ్ల తెలుసుకోలేక, 'కాపాడు ఇంట్లో పులగ ముంద చెప్పేడు, ఈవిడ పులగానికి వేసుకోను నేయ తెప్పించ యెవరినో పంపిందికాబోసు, పు గానికి నేయివుంటే నేగాని బాగుండ'దని తలచ "అక్కయ్యా! నేయి వచ్చేవరకు నాకేమి తొం దరలేదు. ఆనక నే భోంచేస్తా"నన్నాడు. కాపాడి పెళ్లాం 'తన మొగుడు వచ్చేదాక వేచి వుంటా నన్నాడుగదా? ఈచుట్టం ఎంతమంచి మని'షని సంతోషపడింది. కాస్త ప్రొద్దుకల్లా, కాపాడు మడక చేతపట్టుకొని, దున్నడానికి పట్టుకుపో యిన చుట్టాన్ని (వాళ్లు వాళ్లింటిఎద్దుకు పెట్టు కున్న మారుపేరు) తోలుకొని చక్కా ఇంటికి వచ్చేడు. భార్య అలసివచ్చిన భర్తను ఎదు రోడానికి బయిటికొచ్చింది. కాపోడు పెళ్లా న్నిచూచి "ఒసే! చుట్టాన్ని తీసుకుపోయి దొడ్లో బాగాకట్టిపెట్టు" అన్నాడు. అందుకు భార్య "కాదండీ, చుట్టాన్నేమో కట్టేస్తాను గానీ, దొడ్లోవున్న కట్టె (వాళ్లు వాళ్లింటి గేదెకు పెట్టిన మారుపేరు) ఏదో లేదు. ఎక్కడ పోయిందో ఏమో" అంది. ఈఆలుమగలసంభా షణంతా వినేటప్పటికి పాపం! వారింటి కొచ్చి వున్న చుట్టానికిపంచప్రాణాలూఒక్కేతూరి ఎగిరి పోయినట్లయింది. పీళ్లింటికివచ్చి వుండే చుట్టం తానేగదా, అందువల్ల పీళ్లిద్దరూ కలసి తన్ను



"ఓసీ చుట్టాన్ని దొడ్లో కట్టిపెట్టు"



"చుట్టం ఒకేవురుకున పరుగెత్తాడు"

కట్టేసి కట్టెతో మోదుతారని తలచి, ఓక్షణమైనా నిలవకుండా ఒకే వురూ పరుగెత్తేడు. కాపాడు నివ్వెరా పడి

"అయ్యో! అన్నా! ఎందుకట్లాపరుగెత్తుతావు! రా భోంచేసి పోదుగాని" అని వెనుక పరుగెత్తేడు.

—క్ర. వెం. జా.

---

# భారతదేశమునకుఁగలదె దాస్యమోచనంబు

పంచాంగం, నివర్తి, కుమారశర్మ గారు

అనఁగరానివారు, వినరానివా రంట
రానివారుఁ, జూడరానివారుఁ
దలఁపరానివార లలరు భారతదేశ
మునకుఁ గలదె? దాస్యమోచనంబు.

---

# జైనమత ప్రాచీన చరిత్ర

గుడిసేవ నాగమణిదేవి

క్రీస్తుకు పూర్వము ఆరవశతాబ్దాంతమందు ఎన్నో క్రొత్త క్రొత్త ధర్మములు, సాంప్రదాయములు భారతవర్షమందు జన్మించెను. బుద్ధునికాలములో బ్రాహ్మణధర్మమునకు విరుద్ధములగు ౬౩ సంప్రదాయములు ప్రచారములో నున్నటుల బౌద్ధగ్రంథములవలన తెలియుచున్నది. జైనగ్రంథములబట్టి ఇంకను నెక్కువ సంప్రదాయము లున్నటుల దెలియుచున్నది. వీనియందు కొన్ని సంప్రదాయములు బుద్ధునికి పూర్వమునుండియు కూడ నుండవచ్చును. ఈ సంప్రదాయములలో మహావీరుని జైనధర్మముకూడ నున్నది. బుద్ధునివలె మహావీరుడును వేదములను, యజ్ఞములను, బ్రాహ్మణులయొక్క పవిత్రతను, శ్రేష్ఠతను ఖండించి తనధర్మమును ప్రచారము చేసెను. కాని బుద్ధునివలె మహావీరుడును భిక్షుకుల నియమములను, వారి జీవనక్రమమును బ్రాహ్మణధర్మము నుండియే గ్రహించెను. స్మృతులయందును, ధర్మశాస్త్రములయందును హిందువుల జీవితము బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాసములను నాలుగు ఆశ్రమములుగ విభజింపబడియున్నది. కౌటిల్యుని అర్థశాస్త్రమున పరివ్రాజకుని కర్తవ్యములు చెప్పబడియున్నవి. ఇంద్రియములను అణచుట, సంసారవ్యవహారములను త్యజించుట, ధనము తనదగ్గర నుంచకుండుట, జనుల సాంగత్యము చేయకుండుట, భిక్షు అడిగి భుజించుట, వనవాసము చేయుట, ఒకస్థానమందే ఎక్కువకాలముండకుండుట, బాహ్యాంతరంగిక పరిశుద్ధతగలిగియుండుట, జీవహింస చేయకుండుట, సత్యమునే పలుకుట, ఎవరియెడ ఈర్ష్య వహింపకుండుట, అందరిపై దయగా నుండుట, క్షమించుట ఇవన్నియు సన్యాసియొక్క కర్తవ్యములై యున్నవి. జైనగ్రంథములందు కూడ భిక్షువులయొక్క ఈ కర్తవ్యములే వేఱుపదములలో చెప్పబడియున్నవి. భిక్షువుల నియమములు, వారి జీవనక్రమమున్ను మహావీరుడు బ్రాహ్మణధర్మమునుండియే గ్రహించెనని ఇంద[illegible] తెలియుచున్నది.

## జైనమతముయొక్క ప్రాచీనత

చాలకాలమువరకు జనులు జైనధర్మము కే[illegible] బౌద్ధధర్మముయొక్క ఒకశాఖయని నమ్ముచుండెడి[illegible] జైనులుకూడ బౌద్ధులేయనియు, వారు బౌద్ధధర్మ[illegible] వదలి ఆధర్మముయొక్క మరియొకశాఖను నిర్మించి[illegible] రనియు లేసన్, వేబర్, విల్సన్ మొదలగు పాశ్చా[illegible] పండితు లభిప్రాయపడిరి. బౌద్ధజైనగ్రంథముల[illegible] వారిసిద్ధాంతములందును కొంత సమానత యుండ[illegible] జైనధర్మము బౌద్ధధర్మముయొక్క [illegible] శాఖయే యని కొందరు విద్వాంసులు తలచియుండవచ్చు[illegible] కాని జర్మనుదేశీయవిద్వాంసులగు డాక్టరు బూల్హ[illegible] డాక్టరు జేకోబీ అనువారలు జైనగ్రంథములను స[illegible] ర్ణముగ పరిశీలించి బౌద్ధబ్రాహ్మణధార్మికగ్రంథము[illegible] వానిని విమర్శించుచు పైవారిమతమును పూర్తిగా ఖ[illegible] చిరి. జైనబౌద్ధమతములు రెండును ఏకకాలమున నే[illegible] కొన్ని శతాబ్దములవరకు సమానప్రచారముతో గా[illegible] నియు, అందు బౌద్ధమతము భారతదేశమందు పూ[illegible] లోపించినదనియు, జైనమతముమాత్రము ఇప్పు[illegible] భారతవర్షమున కొన్ని భాగములందు వ్యాపక[illegible] యున్నదనియు విమర్శించి నిరూపించియునా[illegible] కొందరు విద్వాంసులు జైనమతము బౌద్ధమతముకం[illegible] పురాతనమైనదనియు చెప్పుచున్నారు.

## ౨౪ గురు జైనతీర్థంకరులు

సర్వసాధారణముగ మహావీరుడే జైనమ[illegible] యొక్క నిజమైన సంస్థాపకుడని లోకాభిప్రా[illegible] కాని జైనులు తమమతము అత్యంత ప్రాచీనమై[illegible]

మహావీరునకు పూర్వము ౨౩ గురు తీర్థంక
రుు, వారు అప్పుడప్పుడు పృథ్విపై నవత
ర్వాణప్రాప్తికై సత్యధర్మమును ప్రచా
వారు చెప్పుదురు. వీరిలో ప్రథమ
ఋషభదేవుడు. ఋషభదేవుడెపుడు
ట కవకాశము లేదు. ఆయన కోట్లగా
లు జీవించియుండెనని జైనగ్రంథములు
. కనుకనే ప్రాచీనతీర్థంకరుల విష
ంథములలో వ్రాసినమాటలు పూర్తిగ
లేకున్నది. జైనగ్రంథములఁబట్టి తరువాతి
కాలము క్రమముగ తగ్గినటుల తెలియు
తీర్థంకరుడైన పార్శ్వనాథుని జీవిత
సంవత్సరములు మాత్రమే అయియుం
ాథుఁడు మహావీరునికి ౨౫౦ సంవత్సర
నిర్వాణమును పొందినటుల చెప్పుదురు.
ర వ అంతిమతీర్థంకరుఁ డని తలఁచు

## తీర్థంకరుఁడు పార్శ్వనాథుఁడు

నాథుడు చరిత్రపురుషుఁడని డాక్టరు
విద్వాంసుల యభిప్రాయము. పార్శ్వ
తమునకు వాస్తవికసంస్థాపకుఁడని వీరు
. ఆయన మహావీరుని నిర్వాణమునకు
ములు పూర్వముండినటుల చెప్పుదురు.
లము క్రీ. పూ. ౮ వ శతాబ్దమని నిశ్చ
పార్శ్వనాథుని జీవిత వృత్తాంతములఁ
యన ఉపదేశములగూర్చియు మనకు
రు. భద్రబాహురచిత మగు జైనకల్ప
అధ్యాయములో తీర్థంకరు లందరి జీవిత
డియున్నవి. పార్శ్వనాథుని జీవితము
ంక్షిప్తముగ గలదు. కాని చరిత్రదృష్టిలో
వ్రాయబడిన సంగతులన్నియు విశ్వసనీ
ఏపున తీర్థంకరు లందరిజీవితములు ఇందు
పద్ధతినే వ్రాయబడియున్నవి. ఇతర
ార్శ్వనాథుఁడుకూడ క్షత్రియుఁడని ఈ

గ్రంథములవలన తెలియుచున్నది. ఆయన కాశీరాజైన అశ్వసేనుని పుత్రుఁడు. ఆయన తల్లి పేరు వామ. ౩౦ సంవత్సరములవరకు సంసారసుఖభోగము లనుభవించి తుదకు తన రాజ్యమును వదలి సన్న్యాసమును స్వీకరించెను. ౮౪ దినములు ధ్యానమునరించి పిదప ఆయన పూర్ణజ్ఞానమును పొందెను. అప్పటినుండి ఆయన దాదాపు ౭౦ సంవత్సరములు మహోన్నతమైన అర్హత (తీర్థంకర) పదవిలో నుండెను. తుదకు సమ్మేత పర్వత శిఖరమున నిర్వాణమును పొందెను. ఆపార్శ్వనాథుని ధార్మికసిద్ధాంతములు తరుచు తదనంతరతీర్థంకరుఁ డగు మహావీరుని సిద్ధాంతము లేఅయియున్నవి పార్శ్వనాథుఁడుతనశిష్యులకే క్రింద వ్రాయబడిన నాలుగు నియమములు బోధించెనని చెప్పుదురు. (౧) జీవహింసచేయకుండుట. (౨) సత్యము పలుకుట, (౩) దొంగతనము చేయకుండుట, (౪) ధనము కూడబెట్టకపోవుట. మహావీరుడు బ్రహ్మచర్యపాలనమను అయిదవ నియమముకూడ చేర్చెను. మఱియు పార్శ్వనాథుడు తనశిష్యులకు ఒక కట్టువస్త్రము, ఒక ఉత్తరీయము ధరించుటకు అనుమతి ఇచ్చియుండెను. కాని మహావీరుడు తనశిష్యులకు కేవలము దిగంబరులుగ నుండుటకు అనుజ్ఞ ఇచ్చియుండెను. బహుశః (జైనులలోని) శ్వేతాంబరులును "దిగంబరులును" జైనమత ప్రారంభమున క్రమముగ పార్శ్వనాథునికిని మహావీరునికిని అనుచరులైయుండురని తోచుచున్నది.

## మహావీరుని జీవితము

మహావీరుని జీవిత వృత్తాంతము సంగ్రహముగ వ్రాయుట సులభము కాదు. జైనకల్పసూత్రమున మహావీరుని జీవితము అతిశయోక్తులతోడను, కల్పనలతోడను నిండియున్నది ఈగ్రంథము నిజముగ భద్రబాహుచే రచించియున్నచో భద్రబాహువు క్రీ. పూ. ౩ వ శతాబ్దమునకు పూర్వపువాఁడగుచో నీగ్రంథమందలి మహావీరుని వృత్తాంతములు తప్పక చారిత్రకములని నమ్మవచ్చును. ఇదిగాక అనేకజైనగ్రంథములందు గూడ మహావీరుని భిన్నభిన్న వృత్తాంతములు పెక్కు తెలియుచున్నవి. బౌద్ధగ్రంథములవలనకూడ మహావీరుని వృత్తాంతములు కొన్ని తెలియుచున్నవి. ఈ అన్ని గ్రంథముల

ఆధారముపై మహావీరుని జీవితము సంగ్రహముగ దిగువ వ్రాయబడుచున్నది.

క్రీస్తుకు ౫౦౦ సంవత్సరములకు పూర్వము ప్రాచీన విదేహరాజవంశమునకు రాజధానియగు వైశాలీ నగరము భారతవర్షమున మహైశ్వర్యముతో తులతూగుచుండెను. ఈ నగరమున ఒకవిధముగ ప్రజాప్రాతినిధ్యముగల రాజ్యముండెను. ఈ ప్రజారాజ్యమును నడుపువది లిచ్ఛవులు. వీరినే రాజులనుచుండెడివారు. వైశాలికి సమీపముననే కుండగ్రామమను పట్టణముండెను. అక్కడ ధనాఢ్యుడును, కులీనక్షత్రియుడునగు సిద్ధార్థుడను పేరుగల ఒకరాజుండెను. ఆయన జ్ఞాతృకనామక క్షత్రియులలో ముఖ్యుడై యుండెను. వానిభార్య పేరు త్రిశల. ఆమె వైశాలిరాజైన చేటకుని సోదరి. మగధ రాజైన బింబిసారుని కీచేటకుని కుమార్తెనిచ్చి వివాహము చేసిరి. ఈ విధముగ సిద్ధార్థునికి మగధరాజ్యకుటుంబముతో బంధుత్వము గలిగెను. సిద్ధార్థునికి ఒకకుమార్తెయు, ఇరువురు కుమారులును ఉండిరి. వీరిలో చిన్నవాని పేరు వర్ధమానుడు. ఆయనయే తరువాత మహావీరుడను పేరుచే ప్రసిద్ధిచెందెను. మహావీరుడు పుష్పోత్తరమను స్వర్గము నుండి అవతరించునపుడు ప్రథమమున ఋషభదత్తుడను బ్రాహ్మణుని పత్నియగు దేవానందగర్భమున ప్రవేశించెనని జైనకల్పసూత్రమున వ్రాయబడినది. ఈ బ్రాహ్మణ సతీపతులిరువురును కుండగ్రామమందే ఉండెడివారు. కాని ఇంతకుమున్న ఏమహాపురుషుడును బ్రాహ్మణకులమున జన్మించక పోవుటచే ఇంద్రుడు దేవానంద గర్భమునుండి తొలగించి ఆమహాపురుషుని త్రిశలగర్భమున ఉంచెనట. ఈ కథను కేవలము శ్వేతాంబరులే నమ్ముచున్నారు. కాని దిగంబరులు నమ్ముటలేదు. దిగంబర శ్వేతాంబర జైనమతభేదములలో ఇదియు నొకటి.

వర్ధమానుడు జన్మించినపుడు సిద్ధార్థుడు గొప్ప ఉత్సవముచేసెను. పెద్దవాడైనపిమ్మట అన్నిశాస్త్రములు, కళలు బాగుగ నేర్పించిరి. యుక్తవయస్సురాగానే యశోద యను రాజకుమారి నాయన వివాహమాడెను. వర్ధమానున కీమెయందొక కుమార్తె జన్మించెను. తరువాత ఆమెను జమాలి యనువానికిచ్చి వివాహము చేసిరి. వర్ధమానుడు అర్హతపదవి నధిష్ఠించి తనమత ప్రచారము చేయునపుడు జమాలి తన మామకు డాయెను. అతనిమూలముననే జైనమతమున తొలి అభిప్రాయభేదము వాటిల్లెను. వర్ధమానుడు తన త గ్రులు గతించినపిమ్మట తన పెద్ద అన్నగారైన న నని అనుజ్ఞ తీసుకొని ముప్పదవయేట ఇల్లు విడిచి వ్రతము గ్రహించెను. భిక్షుకసంప్రదాయము గ్రహి పిమ్మట వర్ధమానుడు కఠోరమైన తపస్సు ప్రారం ౧౩ నెలలవఱకు కట్టువస్త్రమునుగూడ మార్చ యుండెను. అందుచే పెక్కుపురుగులుపట్టి శరీరముపై ప్రాకసాగెను. అటుపిమ్మట ఆయన వస్త్రములను పారవేసి దిగంబరిగా దిరుగుచుండెను. తరధ్యానముచేతను, పవిత్రజీవనము చేతను, అన్నపా కఠిననియమముల చేతను, ఆయన తనఇంద్రియము పూర్తిగ నిగ్రహింపగలిగెను. ఆయన నీడలేని లలో నివసించుచు తిరుగుచు ఒకచోటనుండి మఱి చోటకు తిరుగుచుండెను. అప్పుడప్పుడు ఆయనకు సంకటములు తటస్థించుచుండెను. కాని ఆయన మును శాంతమును ఎప్పుడును విడువలేదు. తనకు అ రము చేయువారిపైగూడ ఆయన యెప్పుడును ద్వే వహించకుండెను.

ఒకసారి ఈయన రాజగృహముదగ్గర నా యనుపట్టణమున గోసాల్ మంఖలిపుత్రయను భిక్షు గలసికొనెను. వానితో మహావీరునకు ఎ గాఢమైన మైత్రి గలిగి ౬ సంవత్సరములవరకు ఇరు ఒకచోటనే చాల కఠిన తపస్సు చేయుచుండిరి. కాని వాత ఏదోఒక సాధారణ విషయమున విరోధము టచే గోసాల్ మహావీరుని విడిచి తాను వేఱొక స దాయమును స్థాపించి తాను మహావీరుని క రెండు సంవత్సరములు పూర్వమే తీర్థంక నైతినని ప్రకటించెను. గోసాల్ స్థాపించిన సం యము 'ఆజీవిక'మను పేరున ప్రసిద్ధమాయెను. గోసా సిద్ధాంతములు, అభిప్రాయములు జైన, బౌద్ధగ్రంథ నుండియే తెలియుచున్నవి. గోసాల్ గాని, అ శిష్యులుగాని తమసిద్ధాంతముల గ్రంథరూపమున ర

జైన గ్రంథములలో గోసాలుని గూర్చి
దాంభిక మొదలగు కఠినశబ్దములు ప్రయో
ీనినిబట్టి జైనులకును, ఆజీవికులకును
యున్నటుల తెలియుచున్నది. ఈమతభేద
న మహావీరుని ప్రభావమునకు కొంత
గోసాలుని ప్రధానస్థానము శ్రావస్తీనగర
ిరి దుకాణము. దీనికి యజమానురాలు
సాలుడు శ్రావస్తిలో చాల ప్రఖ్యాతి
యుచున్నది.

డు ౧౨ సంవత్సరములు ఘోరతపస్సు
ంవత్సరమున సుఖదుఃఖ బంధనమునుండి
నొసంగు సర్వజ్ఞత్వజ్ఞానపదవిని
ప్పటినుండి మహావీరుడు తీర్థంకరుడన
. అప్పటికి ఆయనవయస్సు ౪౨ సంవత్స
నుండి ఆయన తనమతమును ప్రచారము
గ్రింథ" సంప్రదాయమును స్థాపించెను.
ంధనరహిత) శబ్దమునకు మారుగా ఇప్పుడు
వహరించుచున్నారు. మహావీరుడు నిర్గ్రిం
ృసంశజుడు. దీనిచే ఆయన విరోధులగు
ను అశబ్దశ్లేష చేయాషించెకి వారు. మహా
సంవత్సరములవరకు తనమతమును ప్రచారము
రమతములవారిని తనమతములోనికి త్రిప్పి
ల సంచారముచేసెను. ఆయన విశేష
ంగరాజ్యములలో తిరిగెను. విశేషించి
శ్రావస్తి, వైశాలి, రాజగృహము అను
నివసించుచుండెను. ఆయన మగధరాజు
అజాతశత్రులను కలసికొనెను. ఆయన
ప్ప కుటుంబములను తన మతములోనికి
గ్రంథములవలన తెలియుచున్నది. జైన
బింబిసారుడు అజాతశత్రువు మహావీరుని
ని బౌద్ధగ్రంథములలో ఇరువురును బుద్ధుని
బడినది. ఈఇరువురు రాజులను మహా
సమరూపమున ఆదరించినవారని తోచుచు
నిజమగుచో మహావీరుడు అజాతశత్రువను
కాజాలడు. మహావీరుని నిర్వాణకాలము

దాదాపు క్రీ. పూ. ౪౬౭ సంవత్సరమని హేమచంద్రుని
గ్రంథాధారమున డాక్టరు జేకోబీ మహాశయుడు చేసిన
సిద్ధాంతమే సమంజసముగ గనుపట్టుచున్నది.

## జైనమత సిద్ధాంతము

బౌద్ధమతమువలెనే జైనమతముకూడ ఒకభిక్షు
సంప్రదాయమై యున్నది. బౌద్ధులవలెనే జైనులుకూడ
జీవహింసచేయరు. కొన్ని విషయములలో వారిని మించి
రి. పశు, వృక్షములందేగాక అగ్ని, జలము, వాయువు
లందును, పృథ్వియందలి చిన్న చిన్న పరమాణువులందును
జీవమున్నదని జైనులు నమ్ముచున్నారు. బౌద్ధులవలెనే
జైనులుకూడ వేదములను ప్రమాణముగ ఒప్పుకొనరు.
వారు కర్మను, నిర్వాణమును అంగీకరించుచున్నారు
ఆత్మకు పునర్జన్మము గలదనియు విశ్వసించుచున్నారు.
వారు ౨౪గురు తీర్థంకరులను ఒప్పుకొనుచున్నారు.

మహావీరుడు ౭౨ సంవత్సరముల వయస్సులో
ఈవాశవంతమైన శరీరమును వదలి నిర్వాణమును పొం
దెను. పాట్నాజిల్లాలోని పావాయను ప్రాచీననగరమున
రాజా హస్తిపాలుని లేఖకుని ఇంటిలో ఈయనమరణిం
చెను. ఇప్పటికిని కొలకొలది జైనయాత్రికు లీస్థానమును
సేవించుచున్నారు. మహావీరుని నిర్వాణము క్రీ. పూ.
౫౨౭ సం॥ మని జైనగ్రంథములు తెలుపుచున్నవి. ఇది
యొప్పుకొనినచో మహావీరుడును బుద్ధుడును సమకాలి
కులు కాజాలరు. గనుక బుద్ధుడును మహావీరుడును సమ
కాలికులని బౌద్ధగ్రంథములలో వ్రాయుట అసత్యమై
యుండవచ్చును. బుద్ధుని నిర్వాణము క్రీ. పూ ౪౮౦-
౪౮౭ ల మధ్యయని విద్వాంసు లెల్లరును అంగీక
రించుచున్నారు. మహావీరుని నిర్వాణసమయము క్రీ.పూ.
౫౨౭ సం॥మని తలచుచో వీరియిరువురి నిర్వాణకాలము
నకు ౫౦ సంవత్సరములు వ్యత్యాసముగలదు. కాని మహా
వీరుడును బుద్ధుడును అజాతశత్రునకు సమకాలికులని బౌద్ధ
జైన గ్రంథములవలన తెలియుచున్నది గాన మహావీరుని
నిర్వాణకాలము క్రీ. పూ. ౫౨౭ సం॥ మని యొంచుటకు
వీలులేదు.

జైనుల పవిత్రగ్రంథములు అనగా ఆగమములు ౪ ాగములు. అందు అంగమనునది ప్రధానభాగము. అంగ ము మరల ౧౨ భాగములు. వానిలో ఆచారాంగ సూత్ర మున జైనభిక్షువుల ఆచరణ సంబంధనియమములు, ఉపా కదశాసూత్రమున జైనఉపాసకుల ఆచరణ నియమములు న్నవి.

## శ్వేతాంబర దిగంబర సంప్రదాయములు

మహావీరుని నిర్వాణమునకు ౨ శతాబ్దముల తరు ాత మగధదేశములో గొప్పక్షామము కలిగెనని జైన గ్రంథములవలన తెలియుచున్నది. ఆకాలమున మగధ దేశమునకు మౌర్యవంశీయుఁడగు చంద్రగుప్తుడు రాజై యుండెను. జైనసమాజమున సుప్రసిద్ధుడును, జైనకల్పసూ త్రరచయితయునగు భద్రబాహువు క్షామపీడితుడై మగ ధను విడిచి తనశిష్యులతోడను, మిత్రులతోడను కర్ణాటక మునకు వెళ్లెను. కాని చాలమంది జైనులు మగధలోనే యుండిరి. మగధయందున్న జైనులకు స్థూలభద్రుడు నా యకుడుగ నుండెను. కర్ణాటకమునకు వెళ్లిన జైనులు క్షా మముతగ్గగనే మరల మగధకు వచ్చిరి. ఈమధ్యకాలములో ర్ణాటకమునకు వెళ్లిన వారికిని, మగధలోనున్న వారి ని ఆచారవ్యవహారములలో చాలభేదము గలిగెను. మగధలోనున్న జైనులు శ్వేతవస్త్రములు ధరింపుచుం డిరి. కర్ణాటకములోనున్న జైనులు పూర్వపురీతిననుస రించి ఇప్పటివరకు నగ్నప్రాయముగనుండు ఆచారమునే అవలంబించియుండిరి. ఈ విధముగ వారు ఇరువురు శ్వేతాంబరులు, దిగంబరులని పిలువబడుచుండిరి. చివ రకు ఈ రెండు సంప్రదాయములు క్రీ. శ. ౭౯—౮౨ సం|| లందు విడిపోయెనని చెప్పుదురు. దిగంబరులు కర్ణాటకములో నున్న సమయమున శ్వేతాంబరులు తమ ధర్మగ్రంథములను సంగ్రహించి వానిని నిర్ణయించిరి. కాని శ్వేతాంబరులు నిర్ణయించిన ధర్మగ్రంథములను దిగంబరులు అంగీకరించలేదు. ఒకసమయమున శ్వేతాంబ రుల మతగ్రంథములు లుప్తప్రాయములగునను భయము తోచెను. గాన వల్లభీయులసభలో క్రీ. శ. ౪౫౪- ౪౬౭ సం|| లందు వానిని వ్రాతరూపమున నుంచిరి. ఇప్పుడు మనము చూచు జైనమతగ్రంథములు అప్పటి సంగ్రహస్వరూపమే. ఈ సమాచారములు, కథలు కాక మధురలో చాల జైనశిలాశాసనములు కూడ దొరకినవి. వానిలో పెక్కుశాసనములు కుషాణరాజగు కనిష్కుని కాలము నాటివియు, వాని తరువాతవియునై యున్నవి. శ్వేతాంబర సంప్రదాయము క్రీస్తు ప్రథమశతాబ్దములో ఉన్నటుల ఈశాసనములవలన తెలియుచున్నది.

---

# గర్భస్థశిశునిర్వేదము

(గర్భోపనిషత్తునుండి)

అల్లంశెట్టి అప్పయ్యగారు

ను వీక్షించియుంటి ననేకమైన
ర్భగోళంబులం జాలకాల మయ్యె
హువిధాహారములు గొంటి బహువిధములఁ
దరుస్తనముల నేఁ బాలు ద్రావినాఁడ.
వ్యభూమియు నాదగు జన్మభూమి
కు నిదియెల్ల తొలి శ్మశానమ్ము నిజము

నేఁ జతురశీతి లక్షయోనిప్రభేద
ములను జన్మించియుంటిని పుడమియందు.
జన్మమందితిఁ బలుమఱుఁ జచ్చియుంటి
నట్లె పలుమాఱు సంసారినై మెలఁగితి
పుట్టుటయుఁ జచ్చుటయు మఱఁ బుట్టుటయును
గలిగి నాకాలమెల్లను గడిచిపోయె,

ర్భవాసంబునందు దుఃఖంబు నిట్లు
ర్మమెత్తుటయుంగూడ చాలదుఃఖ
కట! బాల్యంబు నస్లై దుఃఖకరమాట
కపరవశతాజ్ఞతల్ నాకుఁ గలిగె.

ంచిపనుల నొనర్పక మనలుటయును
మరిగనుండి చెడుగులఁ జొచ్చుటయును
బలి, యౌవనమందు తాపత్రయములఁ
విలి బహుపీడ లందుట తప్పదయ్యె.

ుగు వార్థక్యమందు రోగములు, మరణ
న్నభయ, మాశయును నభిమానములును
తతరముగఁ దవిలి దుఃఖార్జితమయి
తాంతంబు బాధలఁ జిక్కఁగలుగు.

ఃఖబీజంబు జన్మంబు దుఃఖరూప
ట్లుగావున సహియింప నలవికాదు
అధర్మంబు దీని నివృత్తికొఱకుఁ
ు, యోగాదిసాధనల్ చేయలేదు.

ట! దుఃఖాబ్ధి మునిఁగి యిట్లయితినేను
మాన్పు లెఱుంగను జ్ఞాని నగుచు
మనంజాతబహుళసంకటము లెల్ల
ర్మమొనరింపవలయు నబ్బంబుగాఁగ.

తి జన్మించుతోడనే జననమరణ
ప సంసారశృంఖలఁ బాపుకొందు
ంఖ్యయోగసమాశ్రయాసక్తిహెంటె
తక్షణంబ గురూత్తముదరికిఁ జనుదు.

ుభములనెల్లఁ బోఁగొట్టి యధికకృపను
ాక్షమొసఁగు మహేశు నామోదినగుచు
నరగునం జని ముమ్మందు శరణుజొత్తు
తల్లియును నేను వేఱైన తక్షణంబ.

అఖిలశుభముల నొడగూర్చునట్టివాఁడు
ప్రథితపురుషార్థదాయియై పరగువాఁడు
నైన పరమేశ్వరుని హృదయమునఁ దలఁతుఁ
దల్లియును నేను వేఱైనతక్షణంబ.

సర్వశక్తులుగలవాని జ్ఞానమయుని
సర్వకారణకారణు జగదధీశు
భర్గుఁ బశుపతి రుద్రునిఁ బ్రస్తుతింతు
తల్లియును నేను వేఱైన తత్క్షణంబ.

మోక్షమిడువాఁడు నానందమూర్తియును, ని
రామయుండును నాదినారాయణుండు
నైన భగవంతుఁగూర్చి మహోత్సవం బొ
నర్చి భజియింతు నాదు మానసమునందు
తల్లియును నేనువేఱైన తక్షణంబ.

కట్టువడియుంటి నాతల్లిగర్భమందుఁ
గాని నే దీని వీడుట కలిగెనేని
వాసుదేవుని భక్తిమై ప్రార్థనం బొ
నర్తు సంతోషమందఁగ నామనంబు.

ఏ నొనర్చితిఁ బరులకై యెన్నియేని
సుకృతదుష్కృతములు తొల్లి; చూడఁ దత్ఫ
లంబు లందినవారెల్ల రరిగి రెటకొ
నే నొకండనె యిపుడు దహింపఁబడితి.

ఆదియందేను నాస్తికుఁడగు చనేక
పాపకర్మ లొనర్చితి భయము దక్క
యకట! తత్పాపఫల మిప్పు డనుభవించు
చుంటి నిఁక యాస్తికుండనై యుంట లెస్స.

---

# వసుచరిత్ర రచనాకాలము—స్థలము

కుందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఏ.

వసుచరిత్రను రామరాజభూషణుఁ డెప్పుడు విరచించె ననువిషయము ఆంధ్రసారస్వత పరిశోధకుల కంతఁగా విశదమైనట్లు గన్పట్టదు. ఆంధ్రకవులచరిత్రను వ్రాసిన కీర్తిశేషులగు శ్రీ వీరేశలింగము పంతులవారు, వసుచరిత్రకు వ్యాఖ్యానము వ్రాసి పీఠికను వ్రాసిన శ్రీ శేషాద్రిరమణ కవులు, 'వసుచరిత్ర విమర్శన మ'ను గ్రంథము వ్రాసిన సుప్రసిద్ధాంధ్రపండితులును, విమర్శకులు నగు శ్రీ సీతారామ శాస్త్రిలవారు వేర్వేఱువిధముల వసుచరిత్ర రచనాకాలమునుగూర్చి ప్రశంసించియున్నారు.

వసుచరిత్ర రచనాకాలము, స్థలము, ఆంధ్రసారస్వతమునకు, ఆంధ్రచరిత్రకు ముఖ్యమైనవిషయములు. ఎట్లు? క్రీ.శ. ౧౩౩౬ సంవత్సరము మొదలుకొని, క్రీ. శ. ౧౫౬౫ సంవత్సరము వఱకు హరిహరరాయ, ప్రౌఢదేవరాయ, శ్రీకృష్ణరాయ, రామరాయాది నృపాగ్రేసరుల భుజాస్కంధముల నాశ్రయించి సకలవిజయోపేతమై, సకలైశ్వర్యసమన్వితమై వెలసిన విజయనగరరాజ్యలక్ష్మి రమణీలలామ దురదృష్టవశమున ముష్కరులగు తురుష్క వైరివీరుల హస్తగతమై, పెంపుదక్కిన తరువాత తజ్జీర్ణకర్ణాటలక్ష్మీపునరుద్ధరణమునకుఁ గడంగిన యొక రాజన్యునకుఁ గృతిగా నొసంగఁబడిన కావ్యము వసుచరిత్ర. ఆక కర్ణాటాంధ్రసామ్రాజ్యలక్ష్మి భాగ్యహీనయైనను, ఆంధ్రకవితాకన్యకు భాగ్యోదయమై, సాహిత్యరసపోషణుఁడగు రామరాజభూషణుని యాదరణమున సర్వకళాపూర్ణయై, మనోజ్ఞశబ్దాలంకార సమన్వితయై, జాతిరత్నమై ప్రకాశింపఁగాఁ దత్కవితాకన్యకు నూతనాలంకారమైనది వసుచరిత్ర.

సుప్రసిద్ధపండితులు వ్రాసినవ్రాతలు విమర్శించుటకు అల్పజ్ఞులగు నాబోంట్లకు తగని కార్యము. అట్టి పండితభూధరములఁ దాఁకినచో శృంగభంగమౌనేమో యను సంశయమును, భయమును గలదు. అయినను ప్రయత్నింతును గాక. కీర్తిశేషులైన శ్రీవీరేశలింగము పంతులవారు తమకవులచరిత్రమున వసుచరిత్ర రచనాకాలమునుగూర్చి యిట్లు ప్రశంసించి యున్నారు.*

'ఈవసుచరిత్రము క్రీ. శ. 1570 వ సంవత్సరమునకుఁదరువాతనే రచింపఁబడినది. వసుచరిత్ర కృతిపతియైన తిరుమల దేవరాయఁడు ౧౫౬౬ వ సంవత్సరమునందు తన రాజధానిని పెనుగొండకు మార్చెను. ఈతఁడు పెనుగొండను రాజధానిగాఁ జేసికొన్నతరువాత మహమ్మదీయులతో జరిగిన యుద్ధవార్త

* ఆంధ్రకవులచరిత్రము, ద్వితీయభాగము, పుటలు 266-267

సుచరిత్రములోని యీపద్యమునందుఁ జెప్పఁ
బడినది.

"ఓ. తిరుమలరాయశేఖరుని
ధీరచమూభటరాజి, యాజిభీ
కర యవనేశ్వర ప్రహిత
ఖానబలంబులఁ జక్కనేయ ని
ద్ధరఁ బెనుగొండకొండలు మ
దద్విపచర్మ కపాలమాలికా
పరికర భూషితంబులయి
బల్విడిఁగాంచె గిరీశభావముల్."

"తిరుమల దేవరాయఁ డవసానదశలో తన
రాజ్యభారమునంతను కొడుకులమీఁద వదలి
తనతర్వాత మూఁడవ కొడుకయిన వేంకట
పతిరాజు ఆలీ అదిల్‌షాహాతో యుద్ధముచేసి
పరాజితుఁడయి ౧౫౬౭ వ సంవత్సరమునందు
రాజధానిని పెనుగొండనుండి చంద్రగిరికి మరల
మార్చెను.

"వేంకటపతిరా జోడిపోయిన సంగతిని
చెప్పకపోయినను, కవి వసుచరిత్రములోని యీ
క్రిందిపద్యములో వేంకటపతి రాజధానిని చంద్ర
గిరికి మార్చిన సంగతి సూచించియున్నాఁడు.

"మ. వారుఁ డాతారకశైల దుర్గమున న
ధ్యాసీనుఁడై రాజశే
ఖర విఖ్యాతి వహించుఁ జంద్రగిరి దు
ర్గంబందు శ్రీవేంకటే
శ్వరుఁ డొప్పెన్ బహురాజశేఖరసదా
సంసేవ్యుఁడై యారయి
ద్ధర బం టేలికవాసి తద్గిరులకున్
దద్వల్లభ శ్రీలకున్."

"ఈపద్యముల నన్నిటినిబట్టి చూడఁగా
వసుచరిత్రము ౧౫౬౭ వ సంవత్సరమునకుఁ
దరువాతనే ముగింపఁ బడినట్లు స్పష్టమగు
చున్నది." శ్రీ వీరేశలింగము పంతులవారి
యభిప్రాయమున వసుచరిత్రము ౧౫౬౭ వ
సంవత్సరమునకుఁ తరువాతనే ముగింపఁబడి
నది. వీరి యభిప్రాయముప్రకారము వసుచరిత్ర
తిరుమల దేవరాయనికి పెనుగొండలోగాని, చం
ద్రగిరిలోఁగాని రామరాజభూషణుఁడు కృతి
నొసంగి యుండునని శ్రీ శేషాద్రిరమణ కవులు
తమ వసుచరిత్ర పీఠికలో(వావిళ్లవారి ప్రతి)వసు
చరిత్రకావ్యరచనా కాలమునుగూర్చి యిట్లు
నిర్ణయించినారు. వీరును శ్రీవీరేశలింగము పం
తులవారి వాదనయే యంగీకరించినట్లు తోఁచె
డిని. "తిరుమలదేవరాయలు పెనుగొండలోఁ
గొంతకాలము జీర్ణ కర్ణాటరాజ్యము నుద్ధ
రించి పాలించుచున్న క్రీ శ. ౧౫౬౭ సంవ
త్సర ప్రాంతమునను, దరువాత చంద్రగిరికి
రాజకుటుంబము పోయిన కాలమునను కవి
యీరాజకుటుంబము నాశ్రయించి యుండె
ననియు క్రీ. శ. ౧౫౬౭ పైనను ౧౫౭౦కి గొం
చెము పూర్వమునను వసుచరిత్రము తిరుమల
దేవరాయల కంకితము గావించెననియు విశ్వ
సింపవచ్చును.[1]"

1. వసుచరిత్ర, పీఠిక పుట ౫ వావిళ్ల వారి ప్రతి.

తిరుమల దేవరాయలు వసుచరిత్రను గృతి నందెననఁగా, రామరాజ భూషణుఁడు, తిరుమల దేవరాయలు బ్రతికియుండఁగనేగదా యది సంభవించును? తిరుమల దేవరాయలు క్రీ. శ. ౧౫౭౧ సంవత్సరాంతమునఁ గాని, ౧౫౭౨ సంవత్సరారంభమునఁగాని స్వర్గస్థుఁడు కాఁగా, శ్రీరంగరాయలు క్రీ. శ. ౧౫౭౨ సంవత్సరారంభమున శ్రీ రాజాధిరాజ రాజపరమేశ్వరాది బిరుదావళితో సామ్రాజ్యమును బాలించుచుండెనని శాసనములవల్లఁ దెలియుచున్నది.[2] కావున వసుచరిత్ర క్రీ. శ. ౧౫౭౧ సంవత్సర పూర్వమునను, తళ్లికోట యుద్ధానంతరము అనఁగా ౧౫౬౫ వ సంవత్సరము తర్వాతను రచింపఁబడియుండుననుటకు సందేహము లేదు కదా. స్యూయల్ పండితుఁడు తిరుమల దేవరాయల పరిపాలనకాలమును క్రీ. శ. ౧౫౬౮ మొదలు, క్రీ. శ. ౧౫౭౫ వఱకు నని వ్రాసియున్నాఁడు.[3] తిరుమలదేవరాయలు రాజ్యమున కెప్పుడు వచ్చెను? తిరుమల దేవరాయలకు పూర్వము విజయనగర సామ్రాజ్యమును బేరునకు మాత్రము పాలించిన సదాశివరాయలు ఎప్పుడు మృతిన[ొం]దెను? సదాశివరాయల శాసనములు క్రీ. శ. ౧౫౭౦ వఱకును గాన్పించుచున్నవి.[4] తిరుమల దేవరాయలు క్రీ. శ. ౧౫౬౮ సంవత్సరమున విజయనగరమును బరిపాలించుచుండె[న]నని నెల్లూరుజిల్లా శాసన సంపుటములం ద[ు]న్నది.[5] కావున వసుచరిత్రము క్రీ. శ. ౧౫౬౮ సంవత్సరము తర్వాతను, క్రీ. శ. ౧౫౭౨ పూర్వమునను విరచింపఁ బడెనని చెప్ప వచ్చును. ఇంకను మనము నిశ్చయింపఁగలిగిన[ది] యేమి, వసుచరిత్రమునందే యీ క్రింది యా[...] ధారములు కలవు. ప్రథమాశ్వాసములోని [అవ]యవతారికలోని యీగద్యమును జూడుఁడు: 'అంభోధివసన సంభావనమాన కుంభినీ వలయ[...] సంభరణ దీక్షాసమారంభ సుభగం భావుక[...] గంభీర భేరీ భాంకరణ దంభశుంభ దంభోధర[...] గర్జాసముజ్జృంభణ సంభావితాత్మీయ పట్టాభి[...]షేకసమయ సముత్తంభిత శాతకుంభ కు[...] భనిగుంభితాంభోవర్ష విద్రావిత క్షుద్రనృపో[...] ద్రవతాప భద్రద్రవద్రసానిత్యరసార్ద్రీతాన[...] సంధాయకమైనందిన దానధారాప్రవాహ[...]

2. Inscriptions of the Madras Presidency Vol. II, Page 1093, No. 374.

3. Sewell's Forgotten Empire, Page 214-215.

4. Nellore Inscriptions, Vol. II, Page 868-870. ఈశాసనము తేదీ ప్రమోదూత (శా.శ. ౧౪౯౨ సంవత్సర చైత్ర బహుళ ౭ సోమవారము. సదాశివరాయలు వజ్రసింహాసనస్థుఁడై బ్రతికియున్నట్లు తోఁచెడి[ని] కాని యప్పటికే మృతినొందినట్లు ఇతరాధారములు కలవు.

5. Nellore Inscriptions Vol. III, 1328-1329, పుటలు. "శీమద్రాజాధిరాజ పరమేశ్వర శ్రీ వీ[ర] ప్రతాప శ్రీవీరభుజబల తిరుమలదేవరాయలయ్యవారు వజ్రసింహాసనాసీనులై విద్యానగర మేలుచుండి......శా. ౧౪౪౪". ఈ శా. శ. తప్పనియు, శా. శ.౧౪౯౧ (?) గానోపుననియు శాసనపరిశోధకులు వ్రాసియున్నా[రు] 'విభవసంవత్సర శ్రావణ శు. ౧౩ లు' శాసనము తేదీ.

' అనియు, ప్రథమాశ్వాసము పదమూఁ
పద్యములో

'జీర్ణకర్ణాటలక్ష్మీపునస్సృష్టి నె
వ్వావిలోకేశ్వరత్వము పొసంగు'

ముఁ దర్వాత 'అఖిలకర్ణాటరాజ్య పునరు
ండును' అనియు, ౬౨ వ పద్యములో

'......................

డిగికొనియె వసుంధరా కమలనయన
ార వీరప్రతాపరాజాధిరాజ
జదేవేంద్ర తిరుమలరాయచంద్ర
ంద్ర పట్టాభిషేకాంబు సముదయమున'

, షష్ఠ్యంతములలో

విధారిగిరి పవి
కిఁ గర్ణాటకాంధ్ర ధరణీపునరు
కిఁ దిరుమల దేవమ
ాయాగ్రణికి వితరణామ రమణికిఁ.

, గవి కృతిభర్తను ప్రశంసించెను. పైని
బడిన పద్యగద్యములలో రెండు విష
గమనింపఁ దగినవి. తల్లికోటయుద్ధా
తిరుమల దేవరాయలు జీర్ణకర్ణా
మ్రాజ్యమును బునరుద్ధరించె ననుట
యము. కవి తిరుమల దేవరాయలు
కాలమునాఁటి వైభవము రెండు
శంసించుట రెండవ విషయము. నా

యభిప్రాయము వసుచరిత్ర తిరుమల దేవరా
యల పట్టాభిషేకానంతరము కొలదిమానము
లలో విరచింపఁబడెనని.

తిరుమల దేవరాయల పట్టాభిషేక మెప్పు
డు జరిగెను? (శ్రీ) వేంకటరమణయ్య గారు
'విజయనగర సామ్రాజ్యము' అను గ్రంథము
నుండి భారతిలోఁ గొన్ని భాగములు ప్రచు
రించియున్నారు[1]. దానిలో 'తిరుమల దేవ
రాయలు పెనుగొండ్లలో పట్టము గట్టుకొని
యేలినయేడు ౧' అని యున్నది. ఈసంవత్స
రము ౧౫౬౯-౧౫౭౦ అయి యుండవచ్చును.
శాసనములుగూడ యితఁడు పెనుగొండనుండి
సామ్రాజ్యము నేలుచుండెనని తెలుపుచున్నవి[2].

మఱియొక విమర్శక శేఖరుని వ్రాత నీ
సందర్భమున పరిశీలింపవలసి యున్నది.

శ్రీ చినసీతారామశాస్త్రిలవారు తమ
'వసుచరిత్రవిమర్శన' మనుగ్రంథమున వసు
చరిత్ర రచనాకాలమును గూర్చి యీ క్రింది
విధమున వ్రాసియున్నారు[3]. 'వసుచరిత్రము
దిరుమల దేవరాయల కేసంవత్సరము కృతి
యీయఁబడెనో, తిరుమలరా జెంతవఱకు
జీవించెనో? యను విషయములు నిర్ణయించు
టకుఁ దగిన యాధారము లగుపడవు గాని,
అదిల్‌షాహా పెనుగొండమీఁదికి దండెత్తి
వచ్చినప్పటి యుద్ధవిషయములు వసుచరిత్ర

ారతి, అక్టోబరు, ౧౯౫౯. పుట ౬౨.
avidu Dynasty of Vizayanagara, Page 251, Epigraphia Carnatica, Vol. VIII,
సుచరిత్ర విమర్శనము, పుట ౧౩౬-౧౩౭.

మున వర్ణింపఁబడుటచే క్రీ. శ. ౧౫౭౭-వ సంవత్సరమునకుఁ బరమందే వసుచరిత్ర కృతి ప్రదానము జరిగెననియు, నాకాలమునకుఁ బైగాఁ దిరుమలదేవరాయలు జీవించెననియు గ్రహించుట కవకాశ మున్నది. మఱియు క్రీ. శ. ౧౫౮౦-వ సంవత్సరమున రాజ్యమునకు వచ్చిన మహామ్మదుకూలీ కుతుప్ షాహాను వీరు జయించిన విషయములు వసుచరిత్రమునందు వర్ణింపఁబడకుండుటచే నంతకుఁ బూర్వమే కృతిప్రదానకాల మనియుఁ దోఁచుచున్నది.'

వీరి యభిప్రాయము ప్రకారను వసుచరిత్ర క్రీ.శ. ౧౫౭౭-వ సంవత్సరము తర్వాతను, క్రీ. శ. ౧౫౮౦ సంవత్సరము పూర్వమునను విరచింపఁబడెనని—కాని యీ సుప్రసిద్ధ విమర్శకుని నిర్వచనమునం దొకకాలవిపర్యాస దోస మున్నది.

వసుచరిత్ర కృతిభర్త క్రీ. శ. ౧౫౭౦ సంవత్సర ప్రాంతమున కీర్తిశేషుఁడై, స్వర్గమలంకరించియుండఁగా, క్రీ. శ. ౧౫౭౭ సంవత్సరము తర్వాత, నతఁడు భూతలమున రామరాజభూషణునిచే నొక కావ్యమును గృతినొందుట పొసఁగదుగదా. అదియుఁగాక వసుచరిత్రములోని యీక్రిందిపద్యము ననుసరించి యందలి యుద్ధము క్రీ. శ. ౧౫౭౭ వ సంవత్సరమున జరిగినదని వ్రాసియున్నారు. అప్ప... కప్పుడే తిరుమలదేవరాయలు దివంగతుఁ... కాఁగా, అతఁడెట్లు ౧౫౭౭ వ సంవత్సరమ... మహమ్మదీయులతోఁ బోరాడెనో తెలిఁ... కున్నది.

చ. తిరుమలరాయశేఖరుని
    ధీరచమూభటరాజి యాజిభీ
కర యవనేశ్వర ప్రహిత
    ఖానబలంబులఁ జిక్కుసేయ ని
ద్ధరఁ బెనుగొండ కొండలు
    మదద్విపచర్మకపాలమాలికా
పరికర భూషితంబులయి
    బల్విడిఁ గాంచె గిరీశభావముఁ.

కాని యీపద్యము తిరుమలదేవ... యలు బ్రతికియుండఁగనే క్రీ. శ. ౧౫... సంవత్సరమునకుఁ బూర్వమే జరిగిన క... వృత్తాంతమును సూచించుచున్నట్లు మ... చరిత్రాధారము లున్నవి[1]. ఈ శాసన... ప్రకారము కవి వర్ణించిన కదనవృత్తాంత... క్రీ. శ. ౧౫౬౬ వ సంవత్సరాంతమున కా... ౧౫౭౭ వ సంవత్సరమున కాదు.

వసుచరిత్రకృతిపతి తిరుమల దేవరా... పట్టాభిషేకవర్ణనము గావించె ననఁగాఁ గ... నిబంధనమును దత్కార్యమునకుఁ దర్వా... నడిచియుండవలెను.

1. No. 341 of 1901; Epigraphical Collections తిరుమలరాయని మంత్రియైన చెన్నప్పనాయ... మహమ్మదీయ సేనానియైన రంచికీపరుఖానుని పెనుగొండ సమీపమున ౧౫౬౬ డిసంబరునెలలో జయించెన... యుచున్నది. ఈచెన్నప్పనాయఁడే పెనుగొండకోటను వృద్ధిపరచెనని శాసనమునందున్నది. శాసనము సంవత... ౧౫౭౬. అందలియుద్ధము జరిగినది ౧౫౬౬ సంవత్సరాంతము.

మలదేవరాయలు తన రాజధానిని౯కు ౧౫౬౭ సంవత్సరాంతమున చరిత్ర వక్కాణించుచున్నది². సనము ప్రకారము తిరుమలదేవరా శ. ౧౫౬౯ సంవత్సరమున విజయ సామ్రాజ్యమును బాలించుచుండె నని న్నది. ఈపరిపాలనము పెనుగొండ యని తెలిసికొన నగును. ఏలనన పోర్చుగీసుల వ్రాతలఁబట్టి ౧౫౬౭ సంవత్సర మధ్యమునఁగాని, అంత్యమునగాని తిరుమల రాయలు పెనుగొండకు రాజధానిని మార్చె ను. కావున వసుచరిత్రను రాయలు పట్టాభి షేకానంతరము పెనుగొండలో ౧౫౬౯ వ సంవత్సరమున కృతినందెననుటకు సందేహము లేదు.

---

## ...క్షువు

విశ్వనాథ సత్యానారాయణగారు, యం. ఏ.,

నే రైలులోఁ బోయినప్పుడెల్ల
తో ఒక్కచోటఁ దానెక్కు—వాని
రు నడిపించు చనుసరించు
శరథీశత కాంతరస్థ
పద్యమె పఠించు ననవరతము.

గొంతు కల్లనే—అతడు పూర్వ
నేనూతిలోననో చచ్చిపోవు
న వినువార లేని లేక
ప్రాణకంఠమధ్యములయందు
న్నవడి నేటిజన్మ కతని
దకుచు వచ్చిచేరినదిగాక.

అతనికన్నులా బొత్తలే—ఆసమయము
నందుఁ దన్నురక్షింప నేరైన వత్తు
రేమొ యని చూచిచూచి యట్లే నిలబడి
అతనిప్రాణాలు కనుగూళ్లయందు నిలచి
మరలఁ గనెగాక నేటిజన్మమున నతని.

అతనిపాడినయంత సేపల్ల, నట్టి
యతనికన్నులు చూచినయప్పుడల్ల
నూతిలో మున్గు నాతని తీతునంచు
వేగిరముపుట్టు నాదు హృద్వీథియందు.
అంతలో పాట నాపి తా నచట నచట
కానులడిగి కూతురు ముందుగా, వినిర్గ
మించు నాతడు—నే నందు మిగిలిపోదు.

---

vidu Dynasty. aPge 235.

# భావశబలత

శే. కందుకూరు వీరేశలింగము గారు

మున్నంగి లక్ష్మీనృసింహశర్మ గారు

వేశిక :

ల్పము ఇంద్రియరంజకము. లేఖనశిల్పము
రూపశబలతయని, భావశబలతయని ద్వివి
ము. రూపకల్పనము బహిః ప్రపంచమును
కటించును. భావకల్పనము అంతరప్రవృ
త్తిని వ్యక్తీకరించును. శిల్పము కళ: అది కల్ప
ము- వ్యాజము- యుక్తి- కృత్రిమము- సహ
ము. రూపకల్పనము వర్ణచిత్రము- దర్శ
యము. భావశబలత శబ్దరచన- స్పృహణీ
యము. రెంటికిని భావసాక్షాత్కారము, ప్రసా
గుణము పొసఁగవలయును. రెండును జన్మ
ాసనా లబ్ధములు. రెంటికిని మనోహరత్వమే
యోజనము. రూపకల్పనమునకు అంతర
ంస్కారము బహిరుపకరణములు ఘటింపవల
యును. రూపకల్పనమునకుఁ గాంతి చ్ఛాయలు
Light & Shade) ఎట్లో భావకల్పనమునకు
ుణదోషయుగళ మట్లు. ఉచిత మెఱిఁగి రచిం
ఁగాని మూర్తి సాక్షాత్కరింపదు. భావమే
నస్థాయి; జీవకళ. అదియ ప్రాణప్రతిష్ఠ! చైత
్యము. అది యదృష్టము; అనిర్వాచ్యము.
ైతన్య మావేశించినప్పుడే కళ సార్థకమగును.
ది విజ్ఞు లెఱుఁగనిది కాదు.

ళానియమములు

ముదురు రంగులతో బింబమును వికా
ము చేయఁగూడదు. లేతరంగులువేసి కళా
విహీనము చేయఁగూడదు. ఉచితము, స్థానము,
చరిత్ర, ప్రయోజనము నేరక వ్యత్యయము
చేయుటచే శిల్పము హింసాభాజన మగును.
ఉన్నదున్నట్లు ఉట్టిపడ రచించుట సల్లక్షణము.
ఆలక్షణము గలవాఁడు శిల్పి.

భావశబలతకు స్వభావజన్యజ్ఞాన మున్నం
జాలదు. పరేంగితజ్ఞత అతిమాత్రముగ నుండ
వలయును. అంతమాత్రమే కాదు. అంతస్స్ఫూర్తి
యుఁ, దదనుగుణముగ శబ్దసిద్ధియు ఆవశ్యక
ములు. ఏతాదృశ భావకల్పనా శిక్షణమునకై
శాంతినికేతన నికుంజములలో విహరింపనక్క
లేదు. అడయారు వాతావరణము విశ్వసింప
బనిలేదు. కజిన్సుదొర సాహచర్యము గోరవల
సినది లేదు. ఆనందకుమారస్వామి శుశ్రూష
జరూరులేదు. ప్రమదకుమారబాబు అంతేవా
సిత్వ మావశ్యకము కాదు. అభినవ కవికుమా
రుల నేస్త మవసరము కాదు. పరభాషా శ
ద్వారమున "Sparks and Fumes" గ్రంథము
నిజభావశబలతా వైదగ్ధ్యముం బ్రయోగించి
కందుకూరు ఈశ్వరదత్తు ఏకళాపరిషత్తునఁ బ
శ్రమ చేసెనో ఎఱుఁగను.

మాతృభాషాశబ్దసాహాయ్యమున నే
ఉక్తభావశబలత కెన్నఁడో ఉద్యోగించితి
సందర్భశుద్ధిగా మచ్చునకు వీరేశలింగముగా
చిత్తమును చిత్రించితిని; పదస్యమునకు ప

తిని. గుణజ్ఞులు దోషభోగ్యులు అర్హా
ంట్టి సంభావింతురు గాక.

శ్రీ వీరేశలింగము గారు

ఈయన మృతజీవి; గణ్యుఁడు. పరమ
ుఁడు; పర్కానియోగి. బహిరంతర
త్తులయందు నీతికళాచణుఁడు. నైతిక
మును మనోధర్మము ననుసరించి నడ
పుణుఁడు. ధర్మమునకు నీతి వికటించి
ు నీతి నాశ్రయించి యుక్తిని బ్రయో
వాఁడు.

పాండిత్యమునకన్న ప్రతిభ మిగిలినది.
ను తలదన్నిన పట్టుదల. హఠమున
ర్మాణుఁడు. సాహసమున క్షత్రియుఁడు.
సరళిలో వైశ్యుఁడు. కృషియందు కాఁపు
ు. పరహితకైంకర్యమున పాకీవాఁడు.
నమునకన్న సమయస్ఫూర్తి మేరలు
ినది. అనుగుణానువర్తనమునకన్న అను
ప్రమాణము మెండు. అంతకన్న అభి
రతి నిండు. క్రోధమునకన్న క్రోధావేశ
ుటము. కర్మశీలతకన్న కార్యశూరత
స్ఫు. విధినిర్వహణమున సమయాసమయ
, సాధుతాసాధుతలు పాటింపలేదు.
గోల్పడలేదు. విమర్శించునెడ దాక్షిణ్య
కుఁ దావీయలేదు. సన్నివేశమున కను
మయిన పతకము వేసినాఁడు; చాతు
ు బఱపినాఁడు. మిత్రగోష్ఠియందును
కువ గలిగి మెలఁగినాఁడు. చనవు
సీయలేదు. అనుగ్రహము నాహ్వానింప
లేదు. నిగ్రహమును లెక్కింపలేదు. పరిభవము
లేని ప్రశస్తి గడించినాఁడు. పరేంగితయందు
పండితుఁడు. పరహితానురక్తుఁడు. వ్యవహార
దక్షుఁడు. సాధ్యసాధనముల గుర్తెఱిఁగిన సమ
ర్థుఁడు. తుష్టి గానని చిత్తము; తృష్ణ తీఱని వీక్ష
ణము. స్వకార్యధురంధరత్వమున చాణక్యుఁ
డు; చెకుముకి—

పాదరసమువంటిబుద్ధి. ఆంగ్లము జదివి
నాఁడు. సంస్కృతమర్యాద ఎఱిఁగినాఁడు.
ఆంధ్రము నభ్యసించినాఁడు. చదివి గడించిన
విద్యకన్న జన్మవాసనాలబ్ధమైనదే ఈయనలో
మిక్కిలి. కవనము జెప్పినాఁడు. కథ లల్లి
నాఁడు. నవలపాకము రుచిగొల్పినాఁడు. నాటక
ఫక్కిఁ ద్రొక్కినాఁడు. ప్రాచీనకావ్యధోరణి
ననుకరించినాఁడు. ప్రహసనరీతులఁ బట్టినాఁడు.
గద్యరచనయందు సారళ్యముం దేర్చి వైలక్ష
ణ్యము సాధించినాఁడు. కాళిదాసాదులకుఁ
దెలుఁగుపోకడలం గూర్చినాఁడు.

ఉపాధ్యాయవృత్తిని వరించినాఁడు. పం
డితపదము నందినాఁడు. వాఙ్మయప్రపంచ
మున గణుతి కెక్కినాఁడు. పరీక్షాపరిషత్స
భ్యత సంపాదించినాఁడు. తన ఉపాధ్యాయో
ద్యోగమును తనపూనిన సంఘసంస్కరణా
ద్యుద్యమములకై వినియోగించినాఁడు. సంఘ
మునందలి యనర్థాచారములను బరిహసించి
పరామర్శించినాఁడు. ఎదిరి అవగుణములను
దూషించి స్వీయవాదములను భూషించి
పోషించికొనినాఁడు. వ్యక్తుల వర్తనములందలి

ిటిల్యమును రచ్చకెక్కించి రాపాడినాఁడు.
ీనీయప్రజాసంస్థలందలి వక్రతలను గర్హిం
క వదలలేదు. ఉద్యోగులఁ మఱుఁగు చేరము
ను బజారునఁబెట్టి బద్దీచేయక విడువలేదు.

సనాతనాచారపరాయణులతో సవాల్
ొట్టికు స్త్రీపట్టిన శెట్టి: కృత్రిమకులాచారదుర్గ
ులల భేదించినబంటు. సంఘబహిష్కృతులకు
ంకని దిట్ట. విరుద్ధవాదప్రవాహవేగమున కెదు
ఁదిన గజయీఁత కాఁడు. కాసరోగము అతని
ాయమును కార్శ్యమొందించెనే కాని కార్య
రణదీక్ష నాకట్టలేకపోయినది. ధైర్యము
ెఱని దక్షత; ఆలస్యములేని వ్యవసాయము.
రాశ చెందని నిశ్చయము; నిరోధమునకు వెఱ
ని నిర్ధారణము. వినోదము గోరని తీవ్రత; మితి
ూఱిన తితిక్ష. కాలజ్ఞుఁడు. గడియ ఒకయుగ
ుగ గణించినాఁడు; యుగము నొక గడియగ
డపినాఁడు. తన వెంట కాలమును నడపినాఁడు.

నిష్కారణమగు నేస్తములేదు; నిష్ప్ర
యోజనమగు పరిచయములేదు. ఉబుసుపోక
కాలక్షేపములేదు. నిరవధిక స్వతంత్రుఁడు;
ర్ద్రాక్షిణ్యచిత్తుఁడు; నిరంకుశుఁడు — ప్రాజ్ఞ
లలోఁ బామరుఁడు; పామరులలోఁ బ్రాజ్ఞుఁడు.

చిఱునగవును చిరాకు ముంచివేసెడిది.
కనికరపు టూటలు కటూక్తిధారలలోఁ బడి
చేఁదు గ్రమ్ముచుండెడివి. పెంకె బుద్ధి; పెద్ద
బుద్ధి; పెడసరపునోరు. అనుకొనిన పని విసా
పైసా సాగవలయునే కాని అడ్డుమాటలు
మధ్యాహ్న పనికిరావు. చలపాదితనమున జలగ.

కలఁతలతో, కటకటలతో, కష్టపరంపరలతోఁ
గాలగతిఁ జెందినాఁడు. సుఖజాతకుఁడు గాఁడు.

* * * *

అనాథలను సనాథలనుగఁ జేసిన పుణ్యము,
ఆపన్నులకు శరణమిచ్చిన ఉపకృతి, నిమ్నజా
తుల నుద్ధరించిన అనుకంపాయత వృత్తి, అవ
లంబించిన బ్రాహ్మధర్మము, హైస్కూలు నెల
కొల్పిన విద్యాదాన ఫలము, గ్రంథాలయము
బ్రసాదించిన వదాన్యత, తనఖ్యాతి—తన అర్థ
ము—ప్రాణము—ఇల్లు వాఁకిలి—సర్వస్వము
ఆంధ్ర దేశమునకు, అందు ఈ రాజమహేంద్రవర
మునకు సర్పించినాఁడు; ధన్యుడైనాఁడు. రాజ
మహేంద్రవరజీవనమున ఆయనజీవనము పాల
లోని పంచదారయైనది.

పురుషకారమున ఘనుఁడు. విధ్యుక్తమ
నెడఁ గృతకృత్యుఁడు. ఆంధ్రదేశమున నే
డంకురించి వికసించుచున్న సాంఘికాది నవ
స్యల కామహానీయుని చల్లినబీజములే కారణ
ములు. దేశీయైతిహాసికదర్పణమున ఆతఁడు
ప్రతిఫలించుచున్నాఁడు. ఆతని ఖ్యాతి దేశము
కమూల్యాభరణము. కీర్తిని వలచివలపించినాఁడు

* * * *

"బలము నీవ నాకు; భక్తుండ నీయెడ
ఆలు పిల్ల లేని యట్టివాఁడ
కావు నన్ను నధిక కారుణ్యమున; ఇమ్ము
నుజ్ఞ కమలదళమనోజ్ఞనయన"—

అని భీష్మ నిర్యాణముం దలపించి ప్రక
సాయుజ్య మందినాఁడు.

...ట్టమొదట దేవుడు నిన్నే సృజించెను. అతని విజ్ఞానము నిన్ను సృజించుటకే విని...యోగించెను. వాని కవిత్వములోని మొదటిపద్యము నీవే! వాని గానములోని మొదటి...నీవే! వాని చిత్రలేఖనమునకు వన్నె దెచ్చిన మొదటిప్రతిమ నీవు! సృష్టిలోని ప్రథమ...ర్యము చూచి, చూచి ఆతడు తనకుతానే మురిసి ముగ్ధుడైనాడు.

*　　　　*　　　　*

నీవిలాసమునకు వలచి రత్నాకరములోని ముత్యాలు కంఠాలింగనము చేయుచున్నవి. ...లోని సువర్ణము పాదాక్రాంత మగుచున్నది.

*　　　　*　　　　*

నీవైశ్వర్యవంతురాలవు! అయిన నేమి! నిగర్వశిరోమణివి! నీహృదయము కోమలము...నే ఎక్కడో అరణ్యములలో రాలినపూవులు నీకు మకుటాలంకారములు; అచటి ప్రశాం...ంత పల్లవచ్ఛాయలు నీవు వలచిన శయ్యాగారములు.

*　　　　*　　　　*

కవుల ఊహా సువర్ణకర్పూరమాలలలో లీనమైన నీ హృదయపరిమళమున, విజ్ఞాన...మము పులకిత మగుచున్నది. గాయకుల గీతాలాపముల మేళవించు నీయనురాగ విపంచి ...రు నమ్మోహితము చేయుచున్నది.

*　　　　*　　　　*

నీరోషకషాయవీక్షణములను కుంకుమపూవుమొగ్గలని కళాభిజ్ఞు లానందించుచున్నారు. ...భాశ్రువులను, ముత్యాలదండలని రసజ్ఞశేఖరు లనువదించుచున్నారు.

*　　　　*　　　　*

కళావేదులహృదయములలో నీరూపము ప్రతిష్ఠితమైనది. వారిభావములు నీకు ప్రద...ప్రణామము లొనర్చుచున్నవి. దేవుడు మఱుగుపడినాడు. విలాసినీ, నీవైననూ కృతజ్ఞ...!, నీ కీ అద్వితీయసౌందర్యసౌభాగ్యము నిచ్చిన దేవుని స్మరించి తరించుము.

---

# ములకనాడు

ఎస్. శ్రీకంఠశాస్త్రి గారు, యం. ఏ

ఆంధ్రబ్రాహ్మణ సముదాయమునందు వెలనాడు, ఆఱువేలు ఇత్యాదిశాఖ లెన్నియో యున్నవి. అందు ములకనాడు ముఖ్యమయినది. ప్రాయః ములకనాటి వారు స్మార్తసంప్రదాయస్థులు. అయినను కడప, కర్నూలుజిల్లాలందు మాధ్వములకనాటివా రున్నారని తెలియవచ్చుచున్నది. బహుశః పదిమూడవ శతాబ్దమందు వీరు మాధ్వమతావలంబు లైరని యూహింపవచ్చును.

"ములక" యనుపదమున కాధునికపండితులు స్వకపోలకల్పితములయిన వ్యుత్పత్తి కల్పనచేసినారు. ఆక్షేపయుమగుటచే "మునికులనాడు" అనుపదమే మూల మని యొక్కరు. ఇంకొక్కరు నిజామ్-ముల్క్-రాజ్యమునం దుండినవారు గావున ముల్క్-నాడని యుండి ములకనాడని మాఱెనని చెప్పుచున్నారు. ఇతరులు ములికి, ముర్కి ఇత్యాది విరూపములను గ్రహించి యపార్థములను గల్పించినారు. చారిత్రకదృష్టిచే జూచిన నివన్నియు నాదరణీయములు కావు. త్యాగరాజువంటి సుప్రసిద్ధభక్తాగ్రేసరులు, అభినవకాళిదాసువంటి కవితాచక్రవర్తులు, శృంగగిరి మఠాధీశులవలె వైరాగ్యసంపన్నులు నసేక విద్వద్వర్యులు, హైందవ సంస్కృతికి మహోపకారము జేసినవారందరు ములకనాటివారు గావున భారతీయ సాంఘికచరిత్రయందు ములకనాడు ముఖ్యపాత్రమును వహించియుండును. ఈ వ్యాసమునందు క్రీ. పూ. ౭ శతాబ్దము మొదలుగా ములకనాడు, తత్సంబంధముగ దేశముల విషయములను జర్చించెదను.

బౌద్ధజాతకములు, మత్స్య, వాయ్వాది పురాణములు, తదితరప్రాచీనశాసనములందు ములక యనుపదము "మూలక, మూషక, మూతిబ, మూషిక, పుషిక, మూచిప, మూరిప, ములిక, మూలిక" ఇత్యాది విధములుగ గోచరమగుచున్నది. శాతవాహనరాజులు అమరావతీ ధాన్యకటక పూర్వశిలామొదలగు కేంద్రస్థానములనుండి గోదావరీకూలమునకుపరించి తన్నదీమూలప్రాంతమగు నాసిక పట్టణమును రాజధానిగా చేసికొనిరి. ఒక శతాబ్దము కడచినమీద పురస్త్య పాశ్చాత్య ఆంధ్ర శాతవాహనుల పరస్పర సంబంధము తప్పిపోయెననియు, గౌతమీపుత్ర శాతకర్ణి పునః పూర్వదేశములను జయించెననియు నూహించుట కాధారము లున్నవి.

గోదావరీతీరమందే ములక, అశ్మక దేశము లంటి నవులకు నిదర్శనము లనేకముగా నున్నవి. ఈ రెండు దేశములు మొదలొక్కటిగా నుండి కాలక్రమముగ వేరైనాయెను. క్రీ. పూ. ౪-వ శతమానమునం దుండిన పాణిన్యాచార్యు డశ్మక దేశమును పేర్కొనెను.

"సాల్వావయవప్రత్యగ్రథకలకూటాశ్మకాదిఞ్" (IV. ౧. ౧౪౩)

"తేత్రరాజాః" (IV. ౧. ౧౪౮)

ఇంచుమించుగా సమకాలీనమగు పాళీగ్రంథములు త్తరభాగమును అశ్మకమనియు, దక్షిణభాగమును ములకమనియు వ్యక్తపఱచి అవి దంతిపురము రాజధానిగనుండిన కళింగదేశమునకు భిన్నమైనవని స్పష్టముగ చెప్పుచున్నవి. అశ్మకమునకు పోతన అథవా పోతలి రాజధానిగా నుండెననియు తెలియును (జాతక III. ౩, ౩౮). సుమారు క్రీ. పూ. ౮ శతాబ్దపు జాతకములందు అవంతిదేశము అశ్మక రాజ్యాంతర్భాగమై యుండెనని చెప్పబడినది (సోననందజాతకము). సుత్తనిపాతము (౯౪౪) అశ్మక దేశము గోదావరీతీరమున "మహాజనపద"మునం దుండెనని తెలియజేయును. అంగుత్తరనికాయముమాత్రము అవంతి అశ్మకవిషయములో చేరియుండలేదని తెల్పును.

ములకదేశమునకు ముఖ్యమయిన పత్తిట్ఠాన (ప్రతిష్ఠాన-ఇప్పటి పైఠాన్) దక్షిణాపథమునకు బృహద్ద్వారముగ నుండెను. అది వాణిజ్యమునకు, విద్యాప్రచారమునకు కేంద్రస్థానము. బావరీ యను బ్రాహ్మణ విద్యాంసుడొకడు బుద్ధసందర్శనార్థియై శిష్యబృందసహితముగ

...మున గోదావరీ తీరమం దుండు అశ్మకదేశము ...నని చెప్పబడినది. ఆతడు ములకవిషయమునం ...ట్ఠానమునుంచి వెడలి మాహిస్సతి, ఉజ్జేని, ...ప, వనసహావ్య, కోసంబి, సావత్థి, సాకేత, ...లవత్థు, కుశీనర, పావ, వెసాలి కడచి తుదకు ...సించుచుండిన పసాణకచేతియమునకు వచ్చెను. ... శాలివాహనునికి జన్మస్థలముగ నుండెననియు ...ణవమ్మ, గుణాఢ్యాది విద్వద్వర్యుల కావా ...డెననియు, గాథ లనేకములుగ నున్నవి. ఐతరేయ ...లన "వాంధ్ర పుండ్ర శబర పుళింద మూతిబు" ...త్రసంభవు లని యున్నది. సాంఖ్యాయన ...ములందు మూతిబ, మూచిప, మూవిప, ... చెప్పబడియున్నారు.

...యుపురాణము (౧౭౭-౮) అశ్మక, ములక ...క్ష్వాకుకులసంభవులని చెప్పుచున్నది. జాతకము ... అశ్మకవిషయరాజులు కొందరు చెప్పబడి ... పోతలి రెయొక్కమాలు కాశీరాజు కధీనమై ...అశ్మకజాతకము, ౨౦౭). చుల్లకలింగజాతి ...మునకు పోతలి రాజధానిగ నుండెననియు, ... అరుణుడు, నాతనిమంత్రి నందిసేనుడు ...ను జయించిరనియు చెప్పుచున్నది. మహాగో... అశ్మకరాజగు బ్రహ్మదత్తుడు కళింగసత్త ...ంతి వెస్సభాహు, సోవీరభరత, విదేహరేణు, ... కాశీధరరట్ఠ- తీరిసమకాలీనుడుగ నుండెనని ...యును (Dialogues of the Buddha ...మహాభారతమునందు అశ్మకరాజుకు సంబం...్ర-కథ గలదు.

...కోనామ రాజర్షిః పౌడన్యాం యో ని

(మ. భా. I. ౧౭౭. ౪౭)

...కాలమందు ములకనాటివారు కాక ఇత ...రువనాదుల గోష్ఠిలో చేర్చబడిరనుటకు ...యున్నవి.

...శికాః పుళిందాశ్చ మూలికా యవనా స్తథా
...భీర శబరా యే చాన్యే మ్లేచ్ఛసంభవాః

తేషాం పరే జనపదా దక్షిణాపథవాసినః
కారూషాశ్చ సహైషీకా ఆటవ్యాః శబరా స్తథా
పుళిందా విన్ధ్యపుషికా వైదర్భా దండకై స్సహ.

(మత్స్యపురాణము)

ఆభీరా సహ చైషీకాః ఆటవ్యాః శబరాశ్చ యే
పులిందా విన్ధ్య మూళికా వైదర్భా దండికైః సహ.

(వాయుపురాణము)

దక్షిణాపథజన్మానః సర్వే నరవరాంధ్రకాః
గుహాః పుళిందాః శబరా శ్చుచుకా మంద్రకై స్సహ.

(మ. భా. XII. ౨౦౭-౪౨)

ములకదేశము నందుండిన నాగరికజను లార్యమతము నవలంబించి ములకనాటివా రయిరో లేక, ఆర్యు లే యనాగరికస్థితిలో నుండిన ములకదేశమునకు వచ్చి, యా దేశమునందు నివసించి ములకనాటివారను నామమును గ్రహించిరో తెలియదు. ప్రాయః రెండును సంభవించి యుండవచ్చును.

క్రీ. పూ. ౪ శతాబ్దమునందు అలెక్సాండరు "అస్సెకినో" యను వారిని జయించెనని గ్రీకు చరిత్రకారులు చెప్పుచున్నారు. భగవాన్ లాల్ ఇంద్రాజీ యను పండితుడు అశ్మకులు "అర్సకిడే" (Arsacidae) కావచ్చునని యూహించెను. సెనార్ట్ యను పాశ్చాత్య పండితుడు అశ్మకులు, అశ్వక అవకరిషిక ఇత్యాది నామాంతరములను గల్గి యుండిరని చెప్పుచున్నాడు.

"కాంభోజ ఋషికా యేచ పశ్చిమానూపకాశ్చయే"

(మ. భా. V. ౮. ౧)

ములకలు విష్ణుపురాణమందు శక శబర జాతుల జతలో చేరిన "ముండకు" లను వారని ఇంద్రాజీ యభిప్రాయము.

"ములక" యను పదమునకు "మూషక" యను నామాంతర ముండునని సూచింపబడినది. సుమారు క్రీ. పూ. ౧౭౦ యం దుండిన ఖారవేలుం డను కలింగ దేశాధీశుని శాసనమునందు "మూషకపుర"ము పేర్కొన బడినది. రెండవ సంవత్సరమందు ఖారవేలుండు పశ్చిమ

మం దుండిన శాతకర్ణిని జయించి మూషిక నగరము నాక్రమించెను.

"దితియే చువసే అచింతయితా శాతకణ్ణిం పఛిమదిసం హయ గజ నర రధవహులం దండ పఠాపయతి, కణ్హాపేణం బతియంచ సహాయే వితాపతి మూషిక నగరం……."(Journal of the Behar and Orissa Research Seciety ౧౯౧౭).

ఈ మూషకనగరము బహుశః పైఠాణదగ్గర నుండెనని యూహింపవచ్చును. కాలము గడచినకొలది ఈ మూషక-మూలకు లుత్తర దేశమునుంచి వెడలి బృహచ్చరణాది ఇతర బ్రాహ్మణ సంఘములవలె దక్షిణాపథ మంతయు నాక్రమించిరి.

క్రీ. శ. ద్వితీయ శతాబ్దమందు ప్రసిద్ధుడయిన గౌతమీపుత్రశాతకర్ణి ములక-అస్సక దేశములను జయించెను.

"అసిక, అసక, ముళక, సురఠ, కుకుర, అపరాంత, అనూప, విదభ, ఆకర, అవంతి రాజస."

(Epi. Ind. Vol VIII)

క్రీ. శ. ౧౫౦ యందు రాజ్యమేలిన రుద్రదాముడు "పూర్వాపరాకరావంతి అనూప నీవృదానర్త సురాష్ట్ర శ్వభ్రమరుకచ్ఛ సింధుసౌవీర కుకురాపరాంత నిషాదా"దుల జయించెను. నాలవ శతాబ్దమందు సముద్రగుప్తునిచే జయింపఁబడిన దైవరాష్ట్రకమున ములక విషయ మొకటియై యుండవచ్చును.

క్రీ. శ. ౬౦౯-౬౪౨ వఱకు రాజ్యముచేసిన వాతాపి చాళుక్యుఁడగు ప్రథమ కీర్తివర్మ "వంగ, అంగ, కళింగ, వట్టూర, మగధ, కేరళ, గంగ, మూషక, పాండ్య, ద్రమిళ, చోళీయ, ఆళుక, వైజయంతు"లను జయించెనని మహాకూటశాసనము చెప్పుచున్నది (Ind. Ant. ౧౯౦౯) ఈ మూషికదేశము ఇప్పటి తిరువాంకూరుదేశస్థలమున, గంగ దేశమునకు చేరికగనుండెనని తెలియుచున్నది.

చోళరాజులు, రెడ్డినాయకులు విజయనగరము వారిక్రింద రాజమండ్రి మొదలుకొని ఉదయగిరి, గండికోటవఱకు నుండిన ప్రాంతమును ములకనాడని వ్యవహారమందుండెనని శాసనములు చెప్పుచున్నవి. కాకతీయద్వితీయ ప్రతాపరుద్రుఁడు క్రీ. శ. ౧౩౧౮ సంవత్సరమందు గండికోటను జయించి గోంకరెడ్డిని ముల్కి-నాటి కధికారిగాఁ జేసెను. చెర్నూరిసీమ, పొట్లదుర్తిసీమలు ములికి నాటిలో చేరియుండెననియు, ములికినా డుదయగిరి రాజ్యమం దుండిన గండికోట సీమాంతభాగమయియుండెననియు ప్రొద్దుటూరితాలూకు రామేశ్వరమందుండు శాసనమందు చెప్పఁబడియున్నది.

"క్రీడాభిరామము" గ్రంధకర్తయు, శ్రీనాధుని శాత్రవుదాతయు నయిన వినుకొండ వల్లభామాత్యుఁడు విజయనగరచక్రవర్తి ఇమ్మడి దేవరాయని కధీనముగ ములికినాటి మోపూరునుండి వినుకొండరాజ్యమును పాలించుచుండెను (Ind. Ant. vol. LVii. ౧౯౨౮ p ౭౦). ఇట్లెందరో చిన్న రాజులు ములికినాటి కధిపతులయి యుండిరి.

ఈవిధముగ సుమారు మూడువేల సంవత్సరములకు పూర్వము ములకనాటి బ్రాహ్మణు లుత్తరాపథమునుంచి బయలుదేరి, కన్యాకుమారిపర్యంతము దక్షిణాపథము నంతయు కాలక్రమమున నాక్రమించిరి. అత్కులవారని వ్యవహరింపఁబడువారు గోదావరీప్రాంతమునందుండు అత్కుతయను గ్రామనామమును గ్రహించిరే కాని, కొందరనుకొనునట్లు నల్లత్కులు, ఎఱ్ఱత్కులనుంచి కాదు. వెల్లాలకులమువారు తమిళశాసనములందు కృషికర్మచే జీవనము చేయుచుండిరని చెప్పబడినది. సుప్రసిద్ధగాయకాగ్రణియు, భక్తాగ్రేసరుఁడు నయిన త్యాగరాజావంశీయులు కాకర్ల వారనియు, చేబ్రోలువారనియు వ్యవహరింపఁబడుచున్నారు.

ఇట్లు సంక్షిప్తముగ సూచింపఁబడిన ములకనాటి చరిత్ర హైందవసంస్కృతి చరిత్రయందును, సాంఘికచరిత్రయందును ప్రాముఖ్యము వహించినది.

సపుత్ర యుగము

యం. రామారావుగారు, బి. యే., (ఆనర్సు); యమ్. ఆర్. ఏ. యస్.

౧

## రసపుత్రు లెవరు?

క్రీ. శ. ౯, ౧౦, ౧౧ శతాబ్దములు భారతచరిత్ర మునం దపూర్వశోభావంతములుగ నుండినవి. ...రపాలనాపీడ నెఱుంగక దేశము సద్వంశజులును స్వ...త్రులు నగు రాజపుంగవులచే పాలింపబడుచుండెను. ...ాందవసంఘమున జాతి మత వైషమ్య మించుకేనియు ...క ్యైకమత్యము ప్రబలముగ నుండెను. ఇట్టిసమయ...నం దనేకము లగు రసపుత్రవంశములు తలయెత్తినవొడం...వి. కేవల ప్రాచీనతకే గాక శౌర్య ధైర్యములకును, ...సమాన దేశభక్తినిగూడ నీవంశములు విశ్వవిఖ్యాతి ...ంచినవి. నూతనమతావేశసంవర్ధితమై మెసపొటేమి...ా, ఇరాక్, బెలూచిస్థాన్ మున్నగు దేశములను కబ...చి, లంఘితసింధువై మధ్యదేశమునంతను కబళించు ...త్సాహముతో పైబడవచ్చుచుండిన తురుష్కసైత్ర...ాత్రాదావానలమును గుహిలోట్ రసపుత్రవీరులు ...ప్రతాపాగ్నిచే ప్రతిఘటించి యుపశమింపజేసిరి. ...ప్పరావల్ మొదలగు మహావీరు లీయుత్పాతమును ...తిఘటించియుండనియెడ భారతవర్ష మంతయు యవన...క్రాంతమయి, వారాణశీవిద్యాపీఠములందును గంగా...తవేదికాస్థలములందును ఫకీరులును, మొల్లాలును మహ...మ్మదీయతత్త్వవ్యాసంగ మొనర్చుచుండియుందురు.

ఇట్టి క్లిష్టసమయమున యాదృచ్ఛికముగ రంగ...కి బయల్వెడలి తురుష్కవాహిని నడ్డగించి భారత...స్వాతంత్ర్యమును స్వబాహుబలముచే మూడు నాలుగు ...ాబ్దము లతిజాగరూకతతో సంరక్షించిన యీ రస...త్రులెవరు? వారి నివాస మెయ్యది? మహమ్మదీయు లీ...శముపై దాడిసలుపనప్పు డొక్కుమ్మడిగ వీరు రంగమున కేతెంచుట కేమికారణము. ఈ విషయములను చర్చించుటయే యీ వ్యాసముయొక్క ముఖ్యోద్దేశము.

అత్యంత వివాద్యమగు నీ విషయమునం దనేకు లనేకములగు నభిప్రాయముల నిచ్చియున్నారు. కొందరు చరిత్రకారులు, విశేషించి పాశ్చాత్యులు శక యవన బాహ్లికాది విదేశీయజాతులే రసపుత్రులైరని యభిప్రాయ పడుచున్నారు. కొందరగ్నికులీయ వాదము ననువదించుచున్నారు. మూడవది దేశీయవాదము.

### విదేశీయవాదము

పాశ్చాత్య చరిత్రకారులును, కొందరు హైందవ పండితులును ౯ వ శతాబ్దమున భారతరంగము నలంకరించిన యీ రసపుత్రులు విదేశములనుండి యీ దేశముపై దండెత్తివచ్చిన శక, పార్థివాది మ్లేచ్ఛజాతులకు చెందిన వారని యభిప్రాయపడుచున్నారు. రాజస్థాన చరిత్రము ప్రకటించిన టాడ్ దొరగారీ విదేశీయవాదము నకు ప్రథమోపపాదకులు. పిమ్మట విన్సెంటు స్మిత్ గారీ వాదమును బలపరచుచు నిట్లు వ్రాసియుండిరి.

"రాజపుత్ర స్థానముపైనను గంగామైదానము పైనను దండెత్తివచ్చిన విదేశీయులలో నెల్లరును హైందవరాజాలతో జరిగిన యుద్ధములలో నశించియుండలేదు. ఈ హతశేషులు దేశీయులలో లీనమై, హిందూమతము నకు గల మహాద్భుత పర్యగ్రహణ శక్తికి లోనై, తన్మతము నవలంబించిరి. అట్టివారిలో శౌర్య ధైర్య సంపన్నులగు నాయకులుగ నుండినవారలు హిందూసంఘమున క్షత్రియులుగ పరిగణింపబడుచుండిరి. అదేవిధముగ గాండ్లు, శబరులు, ఖర్వులు మున్నగు నడవిజాతులెల్ల రఠోడ్, ఘూర్వార్, చందేల్ మున్నగు రాజపుత్రవంశములుగ మార్పుజెందినవి"

రాజస్థాన కథావళిని ప్రథమమున ప్రకటించిన
స్ ట్రాడ్ అనువా రిట్లు వ్రాసియుండిరి.

"భారతదేశమునందలి విదేశీయగణములకును శక
ణాదుల క్షైత్రయాత్రలకును పరస్పర సంబంధము
నుట నిర్వివాదాంశము. గుప్తసామ్రాజ్య వినాశకు
శ్వేతహూణులతో సంబంధముగల ఘూర్జరగణము
రూమతము నవలంబించుటచేసి ముఖ్యములగు రస
వంశము లాగణమునుండియే బయల్వెడలినవి. మహో
లగు నీ విదేశీయులు వైదికధర్మము నవలంబించు
ప్రథమున వారలకును, భారతరామాయణాదులలోని
గణములకును సంబంధము లేర్పరుపబడియెను."

## అగ్నికులీయవాదము

ఈ వాదమునుగూడ పెక్కుచరిత్రకారు లంగీక
రున్నారు. ప్రపంచము మ్లేచ్ఛాక్రాంతమై యమిత
నుభవించుచుండగా ఋషివారణార్థమై వసిష్ఠమహో
తన హోమకుండమునుండి పరమార, చాళుక్య,
ర, చాహమానాఖ్యులగు నల్వురు యోధాగ్రేసరు
సృష్టించెనట. ఈగాథ ప్రథమమున "పృథ్విరాజ్
" యను గ్రంథమున పేర్కొనబడి ప్రజాదరమునకు
మై రసపుత్రులచేగూడ విశ్వసింప బడజొచ్చెను.
యీ వాదమునందు దోషములు పెక్కులు గలవు.
ణముగ రాజవంశములు సూర్యచంద్ర వంశములుగ
. ఈ వాద మంగీకరింపబడినయెడల ముఖ్య
రాజపుత్రవంశములు సూర్యచంద్రానుగతములు
అగ్నివంశములు గావలసి యుండును. మఱియును
త్వము, వారి యన్యదేశీయోద్భవమును, బ్రాహ్మ
నగ్నిసంపూతత్వ వ్యాజమున వారలకు క్షత్రియత్వ
ంప బడెనను వంశమును స్పష్టపరచుచున్నది.
పుత్రులు సూర్యచంద్రవంశీయు లనుటకు ప్రబల
శాసనప్రమాణము లున్నవి. ౧౦ వ శతాబ్దము
గ్వాలియర్ భోజశాసనమున కాన్యకుబ్జాధీశ్వరు
ప్రతీహార రాజపుత్రులు శ్రీరాముని తమ్ముడగు
ని సంతతివారలని పేర్కొనబడియున్నది. అటు
ర్థుని శిలాశాసనములను, హమ్మీరమహాకావ్య
యును చాహమానవంశము సూర్యవంశమని చెప్పుచున్నవి.
౧౧ వ శతాబ్దమునాటి శాసనములు చాళుక్యవంశము
వారలు భారద్వాజగోత్రులనియు చంద్రవంశీయులనియు
దెలుపుచున్నవి. ఇట్టి ప్రబల ప్రాచీనప్రమాణములను
త్రోసిపుచ్చి యాధునికుడగు 'చంద్'యొక్క గ్రంథముపై
నాధారపడి రసపుత్రుల నగ్నికులు లనుట సమంజసముగ
గన్పడదు. ఈ గ్రంథము మహమ్మదీయుల క్షైత్రయా
త్రలు జరుగుచుండినకాలమున శాసనములు విస్మృతములై
యుండిన కాలమున కల్పింపబడి యుండవలెను. లేని
యెడల నా గ్రంథమునందలి విషయము లనుచితరీతిని
సమన్వయింపబడి యుండవలెను. కవి కావ్యోపయో
గార్థ మొకగాథను కల్పింప నయ్యది వాస్తవముగ జరిగ
ణింపబడెనని చెప్పవలసి యుండును. కవి తా నుపపాదిం
చిన యీ గాథ కించుకేని చారిత్రక ప్రాముఖ్యము గలదని
విశ్వసించినచో సూర్యచంద్రవంశములతో నీ యగ్నికుల
మునుగూడ చేర్చియే యుండును. అత డటుల చెప్పియుం
డకపోవుటయే యీగాథ కేవల కల్పితము నవిశ్వసనీయ
మునని స్పష్టీకరించుచున్నది.

## భాండార్కరుగారి వాదము

వీరివాదము నూతనము గాకున్నను అగ్నికులవాద
మున కొక నూతనవ్యక్తిత్వము నొనగూర్చుచున్నది.
పైన పేర్కొనబడిన యగ్నికులులగు రసపుత్రులు హూ
ణులతో సంబంధముగల గుజారులని యభిప్రాయపడుచు
వీ క్రిందికారణముల నిచ్చుచున్నారు :

౧. "హైహయాదిక్షత్రియులు పురాణములలో
నన్యదేశీయులతో చేర్చి చెప్పబడియుండుటచే వారలు
గూడ విదేశీయులై యుండవలెను.

కాని యీవాద మంతసమంజసముగ గన్పడదు.
బాణుడు తన హర్షచరిత్రమున ప్రతాపవర్ధనుడు విదే
శీయు లగు హూణులను గుజారులను జయించెనని
వ్రాసియున్నాడు. అంతమాత్రమున గుజారులుగూడ
నన్యదేశీయులనియు, హూణులతో గూడ నీదేశ
ముపై దండెత్తివచ్చి రనియు నూహించుటయు నిష

...ంజనములు. అదియునుగాక హరివంశము మున్నగు పురాణములెల్ల హైహయు లుత్తమరాజవంశమునకు చెందినవార లనియు, హూణులు విదేశీయులనియు నేకగ్రీవముగ చెప్పుచున్నవి.

౨ "అన్యదేశీయు లత్యద్భుతముగ హిందూసంఘములోని కాకర్షింపబడి సూర్యచంద్రవంశీయు లగు క్షత్రియులుగ పరిగణింపబడి" రనుట.

ఈ యంశముగూడ వివాద్యముగనే గన్పడుచున్నది. ఎనిమిదవ శతాబ్దమునాడుగూడ హిందూసంఘమున మతసాంకర్య మసహ్యముగ నుండెనని స్పష్టపడుచున్నది.

౩. గుజారులనువారు విదేశీయులు. ప్రతీహార వంశీయులు కొందరు ఘూర్జరప్రతీహారు లని పిలువబడియుండుటచే వారుగూడ గుజారులు. ఇదియైనను సరియైన కారణముగ గన్పడదు. మూలవంశమునకు ప్రతీహారనామ మొమాత్రమే యుండుటచే, యీ ప్రతీహారవంశీయులు తమకు వ్యక్తిత్వ మేర్పడజేసికొను నుద్దేశ్యముతో, తమనివాసస్థానమునుండి ఘూర్జరప్రతీహారు లను నామమును స్వీకరించిరి.

౪. "రాష్ట్రకూటశాసనములందును అరేబియన్ యాత్రికుల వ్రాతలయందును ప్రతీహారవంశము గుజారు వంశముగ చెప్పబడియున్నది."

ఈ హేతువైనను సరియైనదికాదు. హైందవులు మహమ్మదీయులను యవనులని పిలుచుచుండిరి. యవన శబ్దము గ్రీసుదేశీయులకు వర్తించును. అంతమాత్రమున మహమ్మదీయులు గ్రీసుదేశమునుండి హిందూదేశముపై దండెత్తివచ్చి రనజనదు. ౧౩వ శతాబ్దమున రాజపుత్రులు మహమ్మదీయు లందరిని తురుష్కులని పిలచియుండిరి. అందువలననే, ఆఫ్గన్, పర్షియన్ వాస్యులగు మహమ్మదీయు లందరు టర్కీదేశీయులని చెప్పదగదు.

౫. "గుజరాత్ దేశమున కానామము చాళుక్య పరిపాలనానంతరముగూడ నొప్పుచున్నది. చాళుక్యులు ఘూర్జరవంశీయులు గానియెడల నానామ ముండి యుండదు."

ఆహేతుకత్వ మిందు స్పష్టముగ గన్పడుచున్నది. గుజరాత్ అనుదేశనామము గుజరాతీభాషనుండి వచ్చినదిగాని, తన్నివాసులగు జనులనుండి గాదు. అదియునుగాక చాళుక్యపాలనాకాలమున నానామ ముండినంతమాత్రమున చాళుక్యులు గుజారులనుట హాస్యాస్పదముగ నుండును. ఆంగ్లదేశము ఆంగిల్, శాక్సన్, జూట్, అనువారిచే నాక్రమింపబడియుండినను దేశనామ మాంగిల్ అనువారినుండియే వచ్చినది. అంతమాత్రముచే నాదేశమంతయు నాంగిల్ అనువారిచేతనే నివసింపబడియుండె ననగునా? నార్మనులు, డేనులు, ట్యూడరులు, హానోవరియనులు మున్నగు ననేకు లాదేశమున స్థిరనివాసము లేర్పరచుకొనిన పిమ్మటగూడ నాదేశమునకు నాంగ్లదేశ మనునామమే యుండియున్నది. అట్లనే భాషనుబట్టి వచ్చిన నామము చాళుక్యులను గుజారులుగ జేయజాలదు.

## దేశీయవాదము

ఈ వాదము నంగీకరించువారలు రాజపుత్రులార్య సంతతివారలని చెప్పుచున్నారు. ఈ వాదము నందలి ప్రథమాంశము రాజపుత్రులకు వేదోక్తములగు గోత్రప్రవర లుండిన వనుట. అవియే శాసనములలో నుదహరింపబడుచుండినవి. కాని కొందరు "పురోహిత ప్రవరో రాజ్ఞామ్" అను వాక్యము ననుసరించి యీ విషయమును ఖండించుచు, రసపుత్రులకు స్వగోత్ర ప్రవరలు లేవనియు, పురోహిత ప్రవరలే స్వీకరింపబడినవనియు వాదించుచున్నారు. కాని యీ విమర్శనము ప్రమాదజనితము. శాసనములలోని గోత్ర ప్రచురణము దీనిని ఖండించుచున్నది. ఆకాలమున గోత్రములను బట్టియే వ్యక్తివిభేదము చేయబడుచుండెను. పురోహిత గోత్రములనే రాజులు గ్రహించుచుండినయెడల పురోహితులు మారినపుడు రాజగోత్రములుగూడ మారుచుండవలెను. ఇత్యాది ప్రత్యక్షశాసన ప్రమాణమునకు విరుద్ధముగ నున్నది. సి. వి. వైద్య, డాక్టరు కృష్ణస్వామి అయ్యంగారు మున్నగు పండితులు దీనిని బలపరచుచున్నారు.

పుత్రస్థానమున కార్యులు చాలకాలమునకు
చ్చియుండి రనుట యీ దేశీయవాదమునందలి
శము. రఘుపుత్రు లన్యదేశీయులు గానియెడ
యు దండయాత్రలకు పూర్వ మేమయియుం
ద్దేశ మసంఖ్యాకములగు విదేశీయ దండయా
నయి కష్టపరంపరల ననుభవించుచుండుటచే,
క్షత్రియులు యథాసాధ్యమగు రీతి నీ యన్య
 నెదిర్చియు, విజయము దుర్లభమగుటచే,
, దుస్సాధ్యము నగు మరుదేశమునకు శాంతి
వలసపోయియుండిరి. ఆ ప్రదేశ మప్పుడు జం
 పిలువబడుచుండెను. ఈ నూతన నివాస
డి, తమ ప్రాచీనసంస్థలను ఆచారములను సం
కొనుచునుండి యవనానలము ప్రజ్వరిల్లి హిం
ధ్వంసనా దీక్షితమై బయల్వెడలినప్పుడు, చిర
క్షితములగు స్వమతాచారముల నకాలవిధ్వం
పడకుండ జేసికొని యాత్మగౌరవమును కాపా
రై యీ సనాతనక్షత్రియ కుటుంబము లాధ్యా
ముతో విజృంభించి, యొక్కపెట్టున రంగస్థల
ంకిరి. ఈమరుదేశమున కార్యసంపర్కముండె
నెక్కు నిదర్శనములు గలవు.

జరాసంధునిచే పీడింపబడి శ్రీకృష్ణుడు
ద్వారకకును, పిమ్మట ఘూర్జరమునకు ప్రతి
 నర్త దేశమునకును వలసపోయెను.

ఉత్తంకుడను బ్రాహ్మణుడు నిర్జలమగు
న నొక యాశ్రమము నిర్మించుకొని శ్రీకృ
యించి దానిని సజలము గావించెను. పిమ్మట
వలాశుడను నయోధ్యాధిపునిచే దుంధుమారు
సుని నిహతుని గావింపజేసెను.

శ్రీమద్రామాయణమున శ్రీరాము డీనిర్జన
 జూచి దయార్ద్రచిత్తుడై దీనిని జలవంతము
శ్యామలముగ నొనరించెనని చెప్పబడియున్నది.

అజ్మీర్ దేశమునందలి పుష్కరమును
ము మహాభారతమున చేర్కొనబడియున్నది.

౫. వసిష్ఠు డర్బుదతీర్థపరిసరమున దనయాశ్రమ
మును నిర్మించుకొనెనని గూడ నా గ్రంథముననే గలదు.

౬. కనోజపాలకులగు రాథోడ్ రాజపుత్రులు
జయచంద్రుడు యవనులచే రణనిహతుడయిన పిమ్మట
మరుదేశమునకు వలసపోయిరి.

౭. అలెగ్జాండరుతో పోరాడియుండిన మల్లాయ్
అను జాతివార లీమరుదేశమునకు వచ్చినటుల నాణెముల
నుండి తెలియుచున్నది.

౮. గౌర్ రాజపుత్రులు స్థానేశ్వరప్రాంతముల
నుండి వచ్చిరి.

ఈ పై విషయములనుండి విదేశీయవాసము కేవల
చారిత్రక ప్రమాదముపై నాధారపడి యున్నదనియు,
దేశీయవాదము ప్రబలప్రమాణ సహితమైనదనియు స్పష్ట
మగుచున్నది. విదేశీయులు హిందూమత మవలంబించి
దేశీయులతో గలసియుండిన నుండవచ్చును. గాని యంత
మాత్రమున వారికి జాతిగౌరవమును నిరుపమోత్కృష్ట
తయు నవిమర్శితములుగ నీయబడెననుట సహేతుక
ముగ గన్పడదు. ఎన్నియు త్పాతము లేతెంచినను క్షత్రి
యజాతియంతయు నంతరించెననుట యవిశ్వసనీయము.
అటుల నాజాతు లుండియుండినప్పుడు తదీయములగు
గౌరవాదులు కేవల మ్లేచ్ఛులును విదేశీయులు నగువారికి
నచిరాగతులయినవారికి మతగ్రహణవ్యాజమున నాపా
దింప బడినవనుట హేతుదూరముగ నుండును. విధి ప్రతి
కూలము మహాపురుషులకు గూడ దుర్లంఘ్యము. కాల
వైపరీత్యమునుబట్టి యుత్తములును, ప్రబలులునుగూడ
ప్రచ్ఛన్నతను వహింపవలసివచ్చును. విధి యనుకూలించి
నపుడును, ఆత్మగౌరవమును, ఆత్మసంస్థితియుగూడ సందే
హాస్పదములగు నవస్థవచ్చినప్పుడు నిర్వర్ణ్యమగు నుత్తే
జము గల్గి శతాధికవిజృంభణము నొనగూర్చుట ప్రపం
చానుభవమునకు విరుద్ధముగాదు. పాండవులు కాలవైముఖ్య
మునంజేసి ప్రచ్ఛన్నత నంది యాత్మగౌరవమును నిల్పు
కొనుటకై సత్యశౌర్యమును జూపి శత్రునిర్మూలన మొనర్చి
యుండిరి గదా. అటులనే క్షైత్రయాత్రల యలజడి
కాగలేక సనాతన క్షత్రియు లచిరకాలవిధిప్రసాదా

కాంతులై యాత్మరక్షణార్థము మధ్యదేశమునుండి మరుభూమికి వలసపోయి హైందవగౌరవమును హిందూమతస్థైర్యమును నిర్మూలింప బద్ధకంకణులై తురుష్క లీ దేశముపై దాడివెడలినప్పుడు ప్రాణాధికమగు నాత్మగౌరవమును స్వమతాచారములను రక్షించుకొనుటకై తను ప్రచ్ఛన్ననివాసమునుండి నూతనోత్సాహముతో బయల్వెడలి, యార్యశౌర్యము రక్తనాళములలో సంక్షోభము నొనగూర్ప నిరుపమధైర్యసాహసములను జూపి మ్లేచ్ఛులను ప్రతిఘటించియుండిరని చెప్పుటలో నిర్హేతుకత్వమును యవిశ్వసనీయతయు నెంతమాత్రము నుండజాలవు. రసపుత్రు లార్యక్షత్రియుల సంతతివారలే. వారలు స్వరక్తప్రాణములను ధారవోసి సంరక్షించినది వైదికమును, సనాతనమునగు హిందూధర్మమునే యనుట నిర్వివాదాంశము.

౨

## రాజపుత్రయుగమునందలి పరిస్థితులు

### క్రీ. శ. ౭౫౦—౧౨౦౦

#### భాషలు

మత రాజకీయపరివర్తనములవలన దేశభాష లెక్కుడు ప్రాముఖ్యము వహించినవి. ఇప్పటివరకు నుపయోగమునం దుండిన ప్రాకృతభాష లీకాలమున సంస్కృతసమ్మిశ్రితములై దేశభాషలుగ మారుచుండినవి.

#### సంఘము

ఈకాలమున జాతివిభేదము లిప్పటియంత సునిర్ణీతములై వివిధములగు నుపజాతులు కల్పింపబడియుండలేదు. బ్రాహ్మణులు తమ నివాసస్థానములచే గాక గోత్రప్రవరలచేతనే గుర్తింపబడుచుండిరి. క్షత్రియులలో రాజపుత్ర, క్షత్రి, బియాస్, మరాఠా మున్నగు విభేదములు లేకుండుటచే వారలలో నన్యోన్యసంబంధములు నైకమత్యమును ప్రబలియుండినవి. వైశ్యులలో పెక్కుమంది బౌద్ధమతమును విడనాడి హిందూమతమును తిరిగి స్వీకరించి విశేషముగ జైనసిద్ధాంతము ననుసరింప జొచ్చిరి. బ్రాహ్మణ క్షత్రియు లొకరివృత్తుల నింకొకరవలంబించుటకు స్వాతంత్ర్య ముండినది. ప్రజాసామాన్యము కర్షకులుగ నుండి యారవవంతు రాజునకును, ఇరువదవవంతు బ్రాహ్మణులకును, ముప్పదవభాగము దేవతలకు నిచ్చుచుండిరి. బ్రాహ్మణ క్షత్రియులు వైశ్యవృత్తియగు కృషి నవలంబించుటచే వైశ్యులు శస్త్రాభ్యాసము చేయు నధికారము గల్గియుండిరి. ఎంతటి యుపద్రవము గల్గినను బ్రాహ్మణునికి లవణ, తైల, మధు, సురా, మాంస, క్షీరవిక్రయము నిషేధింపబడెను. అహింస సామాన్యధర్మముగ నుండెను. వివిధజాతులలో సహపంక్తిభోజనము నిషేధింపబడియుండకుండుటయే గాక శూద్రులలో గొందరికిగూడ బ్రాహ్మణులతో భోజనము చేయు నధికార మొసంగబడియుండెను. చక్కని సన్నబట్టలును కుండలాద్యాభరణములును ధరింపబడుచుండినవి. స్త్రీలు ఘోషాపద్ధతి నవలంబించుచుండినను ఉత్సవోపద్రవాది యసాధారణ సమయములలో దాని త్రోసిపుచ్చుచుండిరి. ఈకాలముననే బాల్యవివాహము లాచరణలోనికి వచ్చియుండినవి.

#### మతము

జైనబౌద్ధ మతము లంతరించుటచే హిందూమతము ప్రబలుచుండెను. పురాణములు బహుసంకలనములకు లోనై ప్రధానదేవతాపరములుగ క్రోడీకరింపబడినవి. రాజులును ధనాధికులును పెక్కుదేవాలయములను నిర్మించుచుండిరి. విగ్రహారాధనమును, తత్సాధకము లగు నాగమాదిగ్రంథములును, యతి, సన్న్యాసి, తపస్విగణములు నభివృద్ధి నందుచుండినవి. వైదికధర్మము [illegible]కు నంతరించియుండలేదు. ఆత్మయందలి విశ్వాసమును పాపభీతియును, నైతికాధ్యాత్మికజిజ్ఞాసయు నాకాల హిందువులకు ప్రత్యేకముగ నలవడియుండినవి. శైవమతము మిక్కిలి ప్రబలముగ నుండెను. శంకరకుమారిలాదులు దానికి పునాదివైచిరి.

#### రాజకీయము

ఎల్లెడల నారాజులే స్వతంత్రముగ పరిపాలన మొనర్చుచుండినను, ప్రజలకుగూడ పాలనకార్యము

తంత్ర్య ముండెను. రాజనియమము ప్రజాభి
నుసరించి యుండెను. క్షేత్రదేశములు
పృథుకు నిర్ణీతరాజవంశమునందలి యొకని
సామంతునిగ నియమించుట యాచార
ను. సమ్రాట్టులు మారుచుండినను స్థానిక
యథాపూర్వముగనే సాగుచుండెను.
శిక్షితములగు స్థానికబలముల నుంచుకొను
జశాసనములు ధర్మశాస్త్రసంబద్ధములుగ
మానుకూలములుగ నుండెడివి. పన్నుముల
ంతును, వాణిజ్యమున ముప్పదవవంతును
గ్రహింపబడుచుండెను. దేశమునందనేక
ండినవి. వానిలో గొన్ని యితరులనుండి
చు సామ్రాజ్యములుగ నుండినవి. ఒక్కొక
భుక్తి, విషయ, మండల విభాగములకు
డెను. కొన్ని శాసనములనుండి యీ క్రింది
్యోగులు తెలియబడుచున్నారు:

ానకులు=సామంతులు

ులు=రాజకుటుంబములోనివారు

త్య=మంత్రులు

విగ్రహిక=అన్యరాష్ట్రములతో గల వ్యవహారములను బరిశీలించువాడు.

టలిక=రాష్ట్రదాయమును జూచువాతడు.

ాధిపతి

హారి

కనాయక

ందివారలు స్థానికోద్యోగులుగ గన్పడు

ధిక=పదివిధములగు నపరాధులను దండించు [వారు

ాగణిక=దొంగలను పట్టువారు

లు=శుల్కము వసూలు చేయువారు

=పోలీసుఠాణా అధికారులు

=వ్యవసాయమును పెంపొందించువారు

ప్రాంతపాలురు=పొలిమేర కాచువారు

కోట్టపాలురు=దుర్గములు గాచువారు

గ్రామములలో కరగ్రాహకులు వంశానుక్రమ నిర్ణీతులైనను, భుక్తివిషయాధికారులు రాజుచేతనే నియమింపబడుచుండిరి. పట్టణములు పురపాలకాధికారులచే పాలింపబడుచుండెడివి. వ్యక్తిత్వమును పలుకుబడియు గలవారలందరును మహాజనములను సంఘముగ నేర్పడిరి. వారి నాయకునికి మహావిద్యకుడని పేరు. బజారులను పరిశీలించుట, దేవాలయములకై సుంకములను విధించుట, సురావిక్రయశాలలనుండి ½ భాండమున కరద్రమ్మము వంతున గైకొనుటయు వానికి కర్తవ్యములు. నివర్తన మనుమానముచే నైనను, బీజపరిమితి ననుసరించియైనను భూములు కొల్వబడుచుండినవి. రాజభాగము ధాన్యరూపముననే పరిగ్రహింపబడి, గ్రామములందే నిలువ చేయబడుచుండెను. క్రయవిక్రయాదులు వస్తుపరివర్తనమూలముగనే జరుగుచుండెడివి. ఆదివరాహ, విగ్రహపాలీయ ద్రమ్మములను ప్రధాన నాణెములును, వింశోపక, కాకిని, కరాటక, కపర్దిక యను నితర నాణెములు నా కాలమున వాడుకలో నుండినవి.

## సైన్యములు

సామంతులు కొన్ని బలములను దమరేలికకు పంపుచుండిరి. వానిలో గజతురగపదాతులు ప్రధాన విభాగములుగ నుండినవి. వంగాధిపులగు పాలరాజులకు నౌకాబలములు గూడ నుండినవి. సైన్యమునం దుద్యోగ విభాగములును చారులును గూడ నుండిరి.

హైందవ చరిత్రమునందు తొమ్మిది పది శతాబ్దములు శాంతిమంతములుగ నుండినవి. మతవైషమ్యము లేక దేశమంతయు నొకేమతము నవలంబించి యుండెను. జైనబౌద్ధమతము లంతరించినవి. ఇస్లాము ఇంకను పాదమూపలేదు. శైవ, వైష్ణవ, ద్వైతాద్వైత విశిష్టాద్వైతాది విభాగము లింకను వచ్చియుండలేదు. పరపాలనము లేకుండుటచే దేశమునం దశాంతియు పీడనము నించుకంతయు లేకుండినవి.

## క్రీ. శ. ౧౦౭౦—౧౨౦౦

### జాతి

ఈకాలమున వివిధములగు జాతిభేదము లుద్భవించినవి. బ్రాహ్మణులలో నివాసములనుబట్టియు నింటిపేరులనుబట్టియు నుపజాతు లేర్పడసాగినవి. వంగ, కాయస్థ, ఓఢ్ర, ఆంధ్ర, ద్రావిడాది విభజన మిట్టిదే. క్షత్రియులు యౌధ, కర్షక, ఔత్తరాపథ, దక్కనీ యను భేదములను పాటింపదొడంగిరి. ఆ కాలమున పంచములలోగూడ నెనిమిదిజాతు లేర్పడినవని ఆల్ బెరూనీ యను ప్రయాణికుడు వ్రాసియుండెను. ద్విజులలో నంతర్జాతీయ వివాహములు పోయి సజాతీయులతోడనే వివాహములు జరపు నాచారము వాడుకలోనికి వచ్చెను. బాల్యవివాహములు ప్రబలి విధవావివాహములు నిషేధింపబడినవి.

### మతము

పశ్చిమోత్తరమున నిస్లాముమతము వ్యాప్తిలోనికి రాసాగెను. పంజాబునందు జైనమతము కొంచెము తలయెత్తసాగెను. దాన దిగంబర శ్వేతాంబర విభాగము లేర్పడినవి. దక్షిణమున దిగంబరజైనులు తమ్మును సంస్కృతమును వాడుకచేసి దేశభాషలను పెంపొందించిరి. వంగదేశమున వైష్ణవమతము ప్రబలజొచ్చెను. బుద్ధుడు విష్ణువు నవతారముగ నంగీకరింపబడెను. కృష్ణభక్తియు, తదారాధనమును విస్తరింప, పెక్కుమంది బౌద్ధులు వైష్ణవు లగుచుండిరి. ఉత్తరమున రాధాకృష్ణతత్త్వమును దక్షిణమున వేదాంతమును వైష్ణవమతము నకు మారెనచ్ఛాయ నొసంగినవి. ద్రావిడాంధ్ర దేశములలో వైష్ణవమతమును, కర్ణాటకమున వీరశైవమును ప్రాముఖ్యము నందినవి. వేదాధ్యయనమునం దాసక్తి మిక్కుట మగుటచే వసుకరుడను కాశ్మీరబ్రాహ్మణుడు వానిని వ్రాసిపెట్టెను. నిత్యాగ్నిహోత్రము పరిత్యజింపబడి విగ్రహారాధనము గృహస్థుల యిండ్లలో తత్స్థానము నాక్రమించెను. దేవాలయములు, మఠములును, ఆగమములు తంత్రగ్రంథములు, మితాక్షరి బ్రహ్మకర్మసముచ్చయము మొదలగు గ్రంథములు నభివృద్ధిలోనికి వచ్చుచుండినవి. స్థలపురాణములు నుపపురాణములు నీ కాలముననే రచియింపబడినవి.

### భాషలు

ఈ కాలమునకు దేశభాషలు మిక్కిలి వృద్ధిచేయబడి, వాఙ్మయములు నిర్మింపబడుచుండినవి. సిద్ధా, మాతృక, నాగరీ, అర్ధనాగరీ, సైంధవ, కర్ణాట, ఆంధ్ర, దిర్వరీ, గౌరీ మున్నగులిపులు వాడుకలో నుండినవి. సంస్కృత గ్రంథములుకూడ పెక్కులు రచియింపబడుచుండినవి. కాశ్మీరము, కాశీ, నడియా (నవద్వీపము), తంజావూరు, కల్యాణి మున్నగునవి ప్రధాన విద్యాపీఠములుగ నుండినవి. అలంకార, వేదాంత, ధర్మశాస్త్ర, న్యాయ, వ్యాకరణ, జ్యోతిష, వైద్యాది జ్ఞానాంగములన్నియు చక్కగ నభివృద్ధి నందియుండినవి.

సౌధములు మొదలగు కట్టడములు బయలుపడుచున్నవి. ప్రాచీన తత్త్వశోధకుల ప్రయత్న ఫలితముగ తక్షశిలానగరసంబంధమగు నజ్ఞాన మింకను హెచ్చుగు గాక!

బౌద్ధకాలమునకు ముందే తక్షశిలా విశ్వవిద్యాలయము స్థాపింపబడినదని చెప్పియుంటిమి. భారతదేశమందలి పెక్కు విశ్వవిద్యాలయములు ఏదియే నొక ధర్మప్రచారము నాదర్శముం దుంచుకొనియే స్థాపింపబడి యుండినవి. వినను విద్యాలయమందలి విద్యార్థుల శిక్షణమునకేమాత్రమును లోటుకలిగెడిదికాదు. కాశీ హిందూ ధర్మములకు కేంద్రస్థానమై యుండెను. హిందూధర్మము లభివృద్ధిలోనున్నపుడు కాశీపట్టణమునకు ఖ్యాతి మెండాయెను. నాలందా, విక్రమశిలా విశ్వవిద్యాలయములు బౌద్ధధర్మములకు కేంద్రస్థానములై యుండెనుగాని, తక్షశిలావిషయమై యెట్టినిర్ధారణచేయుటకును వీలుకాదు. ఇచ్చట మొదటినుండియు జీవనమున కవసరమగు ముఖ్యవిషయముల నాదర్శముం దుంచుకొని శిక్షింపుచువచ్చిరి.

ప్రాచీనకాలమున పలుసారులు విదేశీయులు భారతదేశము నాక్రమించుచువచ్చిరి. దీనికి ఫలితముగ భారతదేశమున భిన్నభిన్న మతములును, ఆదర్శములు, భాషాదికములు మిళితమైయున్నవి. వీనను ఆర్యులు సంఘీభావముచే వాటిని జయించి ఆర్యధర్మముల కాపాడిరి. తక్షశిలానగర మిట్టిసాంఘికమునకు కేంద్రము.

కనిష్కునికాలమున భారతదేశమునకు, చీనా, రోమకదేశములకు రాకపోకలుండెడివి. దీనికి ఫలితముగ చీనానుండి ధర్మములును, రోమకదేశమునుండి వ్యాపారసంబంధములగు విషయములును, చిత్రకళలును విద్యాలయమున స్థాపింపబడినవి. ఇంతియేగాక, భారతీయవిద్యలకు గూడ గొప్పకేంద్రస్థానమై యుండెనని జాతకకథలవలన తెలియుచున్నది. కాశీ, మగధ, మిథిల, ఉజ్జయిని, సింధు మొదలగు ప్రాంతములనుండియు, ఇరాన్, మధ్య ఆసియాదేశములనుండియు కూడ విద్యార్థులిట శిక్షణముబడయుటకు వచ్చుచుండెడివారు. విద్యాలయమందు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యవిద్యార్థులకేగాక యితరులకును స్థానముండియుండెను. చండాలురకుమాత్ర మచట తావుండెడిదిగాదు. విద్యాలయమందు సమర్థులగు పండితు లుపాధ్యాయులుగ నుండెడివారు. వేర్వేరువిషయముల బోధించుటకు వేర్వేరు భవనము లుండెడివి. ఒక్కొక్క యుపాధ్యాయునికడ సుమారు అయిదు వందల మంది విద్యార్థు లుండెడివారు. వీరికి తోడుగ నొక చిన్న యుపాధ్యాయుడు గూడ నుండెడివాడుకగలదు. వేదము, శాస్త్రము, శిల్పము, ఆయుర్వేదము, చిత్రకళ, రాజనీతి, ధనుర్విద్య మొదలగునవి విద్యాలయమున నేర్పబడువానిలో ముఖ్యములుగ నుండెడివి. వ్యాకరణశాస్త్రమున భారతదేశమందు "పాణిని"తో సమానుడు పుట్టియుండలేదు. ఆయన వాసస్థానము తక్షశిలాప్రాంతమై యుండెను. పాణిన్యాచార్యు లీవిద్యాలయమున అధ్యాపకులుగ నుండుట సంభవించి యుండవచ్చును.

ఇంతియేగాక తక్షశిలానగరము వైద్యశాస్త్రమునకు గూడ ప్రాముఖ్యము వహించియుండెను. విద్యాలయమున్నంతకాలము ఆయుర్వేదమున నద్వితీయకీర్తి బొందియుండెను. ఆత్రేయమహర్షి యిచట అధ్యాపకులుగ నుండి యుండిరని చెప్పుచున్నారు. బుద్ధదేవునకు సమకాలీనుడును, మగధాధిపతియునగు బింబిసారుని రాజవైద్యుడగు జీవకు డిచ్చటనే వైద్యశాస్త్ర మభ్యసించియుండెను. ఆయుర్వేదమున సుప్రసిద్ధగ్రంథమును రచించిన చరకులను భిషగ్వరు లిచ్చటనే యుండిరి. జీవకు డిచట ఏడువత్సరములు వైద్యశాస్త్ర మభ్యసించి యుండెను. చివర కుపాధ్యాయు లాతని బిలిచి "తక్షశిలానగరమున వైద్యమున కక్కరకురాని చిన్న మొక్కనుగాని, తీగెనుగాని, వెదకి తెమ్మని" యాజ్ఞాపింప, చరకు లన్వేషణము జేసి చివర కట్టి నిరుపయోగవస్తువు గానరాకుండుటచే ఊరక తిరిగివెళ్లిరట. దీనిచే తక్షశిలానగరమున నెట్టి వైద్యోపయోగములగు వస్తువులుండెడివో, యచటి విద్యార్థులెట్టి వైద్యజ్ఞానము గలిగియుండెడివారో తెలిసికొన గలుగుచున్నాము.

మరియు రాజనీతికిని యుద్ధవిద్యకును గూడ నచట విశేషస్థాన ముండుటచే మగధ, కోసల, కురు

గు దేశములనుండి చాలమంది రాజకుమారులు ంచుండెడివారని జాతకకథలయందు గలదు. వీరిసంఖ్య కముండెడిదట. దీనివలన నచట రాజకుమారులకు క శిక్షణ విద్యాశాఖ గూడ గలదని తెల్లమగు ది.

అర్థశాస్త్రనిపుణుడగు చాణక్యుడుకూడ ఇచ్చ నివసించుచుండెను. భారతదేశమును యవనుల రక్షింపబూనిన చంద్రగుప్తుడితని శిష్యుడు. దీని పై హావెల్ ఇట్లు వల్కుచున్నాడు. "సికిందర్ దేశమునుండి సంవత్సరమున కేగుననగా, ఆతడు దినచోట్లయందే విద్రోహము ప్రారంభమాయెను. ద్యాలయస్థానమగు తక్షశిలానగరమే దీనికి స్థానము. ఇచట ఉన్నతరాజకీయవేత్తలలో డగు ఒకానొకబ్రాహ్మణుడుండెడివాడు. అత రాజనీతియందును, యుద్ధవిద్యయందును పారంగ తక్షశిలాధిపతియగు అంభి సికిందర్‌తో గలసి ప వీలుగాని దేశద్రోహమొనర్చెను. ఇట్లు దేశ మొనర్చెనను ఆందోళనమే భారతీయులను లనుండి రక్షించెను. మరియు దేశమందు సువ్యవ సామ్రాజ్యమునుగూడ స్థాపింపజేసెను. దానికి క్యుడును, చంద్రగుప్తుడును మంత్రిసామంతులు. త్రియగు చాణక్యుడు తన తీక్ష్ణబుద్ధిచే తాత్కాలి ముల నూహించి, చంద్రగుప్తుని దేశోద్ధరణకు ంచి, దీక్షితుడగునట్లు జేసెను. ఆతడు చంద్ర కు యవనులను జయించుటయందును, విశాల జ్యస్థాపనమందును అత్యంతసాహాయ్య మొన సారాంశమేమనగా, తక్షశిలారాజభవనమే దేశ మునకు కారణమైనదైనను, తద్విశ్వవిద్యాలయము దేశోద్ధారకవిజయమంత్రము ఘోషింపబడి ను.

తక్షశిలా విశ్వవిద్యాలయము అర్థధర్మముల నాద ణుంచుకొని బౌద్ధకాలమునకు బూర్వమే స్థాపిం నని చెప్పబడినది. అచటివిద్యార్థులకు బ్రహ్మచర్య రణ మావశ్యకముండెడిది. విద్యాలయమందలి విద్యార్థులెట్లు జీవితమును గడపియుండినదియు, ఎట్టిశిక్షణము నొందియుండినదియు సమగ్రము వర్ణించుట సాధ్యముగాకున్నను, తెలిసినంతవరకు ఆ శిక్షణము మాత్రము మిగుల చిత్తాకర్షకమై ఆధునిక శిక్షణపద్ధతులను బోలియున్నట్లు తెలియవగును. విద్యాలయమందలి విద్యార్థులు మూడువిధములుగ నుండిరి.

౧. ధనికులగు విద్యార్థులు తమకగు వ్యయమును, గురుదక్షిణను ఇచ్చుచుండెడివారు. వీరెల్లరును గురుపుకనసే వర్తించుచుండిరి. వీరికి ప్రత్యేకముగ గూడ శిక్షను పొందు నవకాశముండెడిది. విద్యాలయమందే నివసించుటకును, భోజనాదిసౌకర్యములను ఏర్పరుపబడియుండినవి. ఉపాధ్యాయులు వారిని పుత్రసములుగ భావించుచుండిరి. విశేషముగ నీశ్రేణియందు రాజకుమారులుండెడివారు.

౨. దరిద్రులుగనుండి విద్యాసక్తిగలవారికి గూడ నచట అవకాశముండెడిది. వారు పగలంతయు శ్రమమొనర్చి, దినవెచ్చమును సంపాదించెడువారు రాత్రులందుమాత్రమే విద్యాభ్యాసమున కేతెంచెడివారు. చాలమంది విద్యార్థుల కుపాధ్యాయుల గృహములందును, విద్యాలయమునందును పని దొరకుచుండెడిది. వీరుమాత్రమే నగరమందుండెడివారు.

౩. విద్యాసక్తి గలిగి జీవితకాలమంతయు విద్యావ్యాసంగమునందే గడుపనిశ్చయించుకొనిన వారికి గూడ నచట స్థానముండెను. విద్యాభ్యాసమైనపిదప ఖర్చంతయు నీయగలవాడనని, గురువియెదుట సమ్మతించినచో, వారి కగు ఖర్చు లాచార్యులొసంగుచుండెడువారు. వీరు ప్రథమశ్రేణియందలి విద్యార్థులవలె విద్యాలయమందే యుండెడివారు.

దీనివలన విద్యాలయమందలి విద్యార్థులకు స్వయంసాహాయ్యము ముఖ్యముగ నేర్పబడుచుండెడిదని తెలియవచ్చుచున్నది. అచట దృఢవ్రతులయి, పరిశ్రమయొనర్చుచుండువారికే స్థానమును, సహాయము జేయుటయు నుండెడిది. విద్యాలయమున ఆచారాదికములననుసరించి శిక్షగరపబడుచుండెడిది. నియమానుసారముగ ప్రవర్తింపని

విద్యార్థులు దండింపబడుచుండిరి. రాజకుమారుడగు బ్రహ్మదత్తు డొకపరి తినుబండములు విద్యాలయమునకు దెచ్చుటచే దండింపబడెనట. విద్యార్థుల శిక్షావిధి వారి వినయగ్రహణశక్తినిబట్టి యెక్కువ తక్కువ లగుచుండెడిది. విద్యాభ్యాసము ముగింపబడిన వెంటనే, యనుభవముకొరకు దేశయాత్రచేయుట యత్యావశ్యకముగ బరిగణింపబడుచుండెడిది.

తక్షశిలానగరమున మహారాజగు అశోకునికాలము నుండియు బౌద్ధధర్మప్రచారము ప్రారంభ మాయెను. కనిష్కునికాలమునాటికది వృద్ధియై స్థిరరూపమును దాల్చెను. ఆవల కొంతకాలమునకు, బాహ్యప్రభావములచేతను, అంతరపరివర్తనములచేతను బౌద్ధధర్మమునకు కొత్తమార్పు గలిగెను. కనిష్కునికాలముననే యీ మహాయానమున కభివృద్ధియు, ఖ్యాతియుగల్గెను. ఉత్తరపశ్చిమోత్తర భారతదేశమం దీమతపు సాంప్రదాయప్రచారమున కచ్చటచ్చట కేంద్రస్థానములు స్థాపించబడియుండెను. తక్షశిలానగరముగూడ ముఖ్యమగు కేంద్రస్థాన మాయెను. తక్షశిలానగరము, విశ్వవిద్యాలయమును బౌద్ధధర్మమునకు ముఖ్యకేంద్రస్థానములాయెనని హేవెల్ నిర్ధారణ మొనర్చెను. ఇచట నాగార్జున, అశ్వఘోష, వసుమిత్రాది బౌద్ధపండితు లీసమయముననే యుండిరి. తక్షశిలావిశ్వవిద్యాలయము హిందూధర్మముల నాదర్శముగ గైకొని స్థాపించబడియుండెనుగాని క్రీస్తుపూర్వము ౩వ శతాబ్దమందే యది బౌద్ధధర్మమునకు కేంద్రస్థానమాయెనని రూఢియగుచున్నది.

బౌద్ధమత మభివృద్ధిగ నున్న కాలమందే తక్షశిలావిశ్వవిద్యాలయము శిల్పకళకు ప్రధానస్థానమని పేరు బొందెను. ఇచటనుండియే నూతనముగ "గాంధారశిల్ప" మను శిల్పకళాసంప్రదాయమొకటి బయల్వెడలెను. కనిష్కుని రాజ్యకాలమందును, అంతకు వేయిసంవత్సరములకు బూర్వమునుండియు భారతదేశమునకును, గ్రీసు, రోమ్‌దేశములకును సంబంధ ముండియుండెనని యిదివరకే చెప్పబడినది. భారతదేశమువలెనే యీ దేశములుగూడ శిల్పకళ కగ్రస్థానము వహించియుండెను, రానురాను శిల్పకళకు

భారతదేశమున గౌరవము హెచ్చై, అది దేశమం
వ్యాపింపజొచ్చెను. పూర్వము తక్షశిలానగర
ప్రదేశమున నేనుగూడ గాంధారశిల్పముల ననంఖ్యా
లుగ చూడగలుగుచున్నాము. శిల్పము లతిసుందర
మనోవికాసము గల్గించుచున్నవి. ప్రపంచమందలి
కళాకోవిదులలో నత్యుత్తముడు గూడ వాటిని
సించకుండలేడు. పేరు, కలకత్తా, లండన్, పా
బెర్లిన్ మొదలగు పట్టణములందలి వస్తుప్రదర్శ
లం దీశిల్పము లుంచబడియున్నవి. ధర్మసంస్థలయం
చుట కీశిల్పము లెంతయు తగియున్నవి. వీని వలన
శిలానగరమున కమరత్వము చేకూరినది.

కుషాణ్ సామ్రాజ్యశైథిల్యము ప్రారంభ
మొదలు తక్షశిలానగర ప్రాముఖ్యము క్షీణింప
ను. క్రీ. పూ. ౨౨౬ వ సంవత్సరము కుషాణ్ సా
శైథిల్యమునకు మొదలు. అటుపిమ్మట ఉత్తరభార
మందంతయు అరాజకత ప్రారంభమాయెను. దేశము
తిభద్రతలతో కాపాడుశక్తి సమర్థతలు గలవారెవరు
పోయిరి. ఇట్టిస్థితిలో బర్బరులువచ్చి భారతదేశము
మించిరి. అన్యోన్యకలహములుండుటచే భారతీయు
రక్షణకు గడంగలేదు. కుషాణ్ సామ్రాజ్యక్షీణత మొ
గుప్తసామ్రాజ్యస్థాపనమువరకును గల మధ్యకా
(౨౨౬-౩౨౦) భారతదేశచారిత్రమున అంధకార
మని చెప్పవచ్చును. ఈకాలమందలి వృత్తాంతము
మనకు తెలియుటలేదు. ఈ సమయమున దేశము
అశాంతియు, అస్థిరతయు నెలకొనియుండెను.
తక్షశిలావిశ్వవిద్యాలయపతనమునకు కారణ
యూహింపబడుచున్నది. దేశమందు శాంతియు,
మును, నెలకొల్పబడిన పిదప మరల తక్షశిలానగ
యున్నతస్థితి నొందలేదు? దీనికి కొన్ని కారణ
గలవు.

నాలవశతాబ్దమందు గుప్తసామ్రాజ్యమున
క్యముగలిగినపుడు, సామ్రాజ్యకేంద్రస్థానము ల
నుండి తూర్పునకు తారుమారాయెను. ప్రథమ
శిలానగరములకు మారుగ పాటలీపుత్ర, కాశీపట్ట

స్థానములాయెను. గుప్త సామ్రాజ్యస్థాపనానంత
హిందూ ధర్మములకు ప్రాముఖ్యము హెచ్చెను.
ధర్మములకు క్షీణత ప్రారంభించెను. ఇదియే తక్ష
నగరమున కవసానదశాసమయము. ఫాహియాన్
కము ౪ వ శతాబ్దమున భారతదేశము వచ్చినప్పుడు
ానగరమునుగూర్చి అతడు దానిని ప్రశంసింప
టి హీన స్థితికి వచ్చెను. పిమ్మట ౫ వ
మున హూణులు దీని నాక్రమించిరి. వీరికి బౌద్ధ
లన్న అనిష్టత మెండగుటచే ఉత్తరభారత
దేశమందలి కొన్ని విద్యాలయములను, కొన్ని పట్టణము
లను సర్వనాశన మొనర్చి తమ నిర్దయతను వెల్లడి
పఱచియుండిరి. ఈకారణముచే తక్షశిలానగర పునరుద్ధ
రణమున కవకాశము లేకపోయెను. నేడది నామమాత్రా
వశిష్టముగ నున్నది. విశ్వవిద్యాలయమును నగరముతో
బాటు నాశన మొందియుండవచ్చునుగాని; యేసమయ
మున నది పూర్తిగ నశించెనో తెలియదు.

(విశాలభారతినుండి)

---

## ాకమల

ప్రభల రామబ్రహ్మానందం గారు (యువకవిమండలి)

౧

నిధిని ద్రవ్వచుంటిని ఊహ సేయ
క్తినంపద సాధ్యతాసాధ్యతలును
తమసపరీవృత కాళరాత్రి
మున నొక్కమిణుగురు మంతనమున
చున్నది నిధియొ? విదాహమెత్తి
ధరణిఖండమొ? యేమొ శోణితమ్ము
బారి సంశయమున గడ్డకట్టు
పిపాసలో తెల్లవారునే మొ?

౨

ఘటము నెత్తి నెత్తుక యేలులెన్నొ
దాటి దట్టంపుకానలు దాటుకొనుచు
ఆమహోన్నత శైల శృంగాగ్రమందు
కదలు నీకు నేనందింపగావలెనటె!
మార్గమధ్యమ్మునందున మామకీన
భాండము వినిర్గతాంబువై పడెడుననుచు
నాశరీరము రక్తంపునదులు కట్టి
నాశిరసు బహుధా విభిన్నమ యగునట
ఎంత నిర్దయబుద్ధివో? యీనిశార్ధ
భాగమున మేలుకొలిపితి భాండ మెత్తి!

---

# ఆహార నియమము

పెద్దిభొట్ల వీరయ్య గారు, బి. ఏ., బి. యల్.,

౧

ప్రపంచమునందలి జాతులలో హైందవు లెక్కువ నియమబద్ధులని యెల్ల రంగీకరించు విషయము. నియమబద్ధులు కానివారు విశృంఖలవిధానము నవలంబించుట సహజము. ప్రతిసంఘమును, వ్యక్తియును ఆత్మసంరక్షణార్థము కొన్ని కట్టుబాట్లకు లోబడి సంచరించుచుండుట గలదు, నియమములకు లోబడుటకు నభ్యాసము బుద్ధివికాసము స్వార్థత్యాగము నవసరమై యున్నవి. అట్టివి మతనియమములు కావచ్చును. సాంఘీకనియమములు కావచ్చును. చిరకాలాభ్యాసము నాచార మనెదరు. అందు కొన్ని దురాచారములుగ పరిణమించుటగాని, భావింపబడుటగాని తటస్థించుచుండును. దేశకాలపరిస్థితులనుబట్టి నియమములందు వ్యత్యాసము గలుగుచుండును. మతసాంఘీకనియమముల సమ్మేళనము హిందూదేశమునందువలె నెచ్చటను లేదు. మతనియమములకు సాంఘీకనియమములకు పరస్పరసంబంధము లేని పాశ్చాత్యదేశపద్ధతులు ఎన ఆంగ్లేయవిద్యాధికులలో గొందఱకు భ్రమ, వ్యామోహము గలిగించుచున్న సంగతి మన మనుదినము జూచుచున్నాము. పై ముఖ్యనియమములలో జేరి యనదేశముయొక్క ఉత్కృష్టతకు నాధారమగు ఆహారనియమమునుగురించి పాశ్చాత్యశాస్త్రజ్ఞులు వ్రాసిన యంశములను గొన్నిటిని జదువరులకు విశదపఱుచుటకై మిత్రుల కోరిక ననుసరించి యీ వ్యాసమునకు గడంగుచున్నాను. వ్యక్తులయొక్కగాని, సంఘములయొక్కగాని లోపములను గురించి చర్చింపదలచలేదు. హైందవుల శాస్త్రములలోని సంగతులను చాలవరకు పాశ్చాత్యప్రకృతిశాస్త్రజ్ఞులు పరిశోధించి స్థిరపరచుచున్నను శాస్త్రములగొడవ నెత్తిదలచలేదు. శాస్త్రములన్న గొందరికి కంటకముగ నుండవచ్చును. ప్రకృతిశాస్త్రశోధనల ఫలితముల నిరాకరింప నెవరితరము కాదు. కాబట్టి నవనాగరికులకు సహితము వెగటులేని విధంబున చర్చింపదలచిన విషయమును ముఖ్యముగ నాంగ్లేయవిద్య నభ్యసించినవారు గమనింప ప్రార్థించుచున్నాను.

ఆహారము ముఖ్యముగ శాకాహారమని, మాంసాహారమని రెండువిధములుగ నున్నది. వీనిలో నేయాహారము ప్రశస్తమో నిర్ధారణ కావలసియున్నది. ప్రతి జీవజంతువునకు నాహారావశ్యకత గలదు. గాలి నీరు ఆహారము ప్రాణరక్షణకు ముఖ్యమైనవి. గాలి లేనియెడల కొన్ని నిమిషములకంటెను నీరులేనియెడల కొన్ని గంటలకంటెను, ఆహారము లేనియెడల కొన్ని దినములకంటెను ఎవరును జీవింపజాలరు. అన్నిటికన్న ప్రాణవాయువుయొక్క ప్రాశస్త్య మెక్కువయైనను అందుకు సంబంధించిన యోగమహిమలనుగురించి, దీర్ఘజీవిత్వమును గురించి ప్రత్యేకముగ వ్రాయవలసియుండును. అటువలెనే నీటియొక్క మాహాత్మ్యమును వేరుగ వివరించవలసి యున్నది. ప్రస్తుత మాహారమును గురించి వ్రాయుటలో గొంతవరకు మనము పీల్చెడి గాలి, త్రాగెడి నీరు కూడ లెక్కకు రాగలవు. ఎందుకనగా ఆహారపదార్థములు త్రివిధము లగు ఘనపదార్థములు, ద్రవపదార్థములు, వాయుపదార్థములునై యున్నవి. ఈ పదార్థములే సత్తువనిచ్చు ప్రోటీనులని, కండను గలిగించు క్రొవ్వుపదార్థములని, చక్కెరపదార్థములని, లవణపదార్థములని, ద్రవపదార్థములని విభజింపబడుచున్నవి. ఏయేవస్తువులలో నై వివరములుగల పదార్థము లెంతవరకు గలవో వానిలో ప్రాణరక్షణకేవి యెంతవరకు నవసరమో తెలిసికొనవలసి యున్నది. శాకాహారములలోను, మాంసాహారములలోను కొన్ని పదార్థములు హెచ్చుగను కొన్ని తక్కువగను చిక్కగలవు. సామాన్యముగా మనుజునికి కావలసిన ఆహారపదార్థములు పరిమితములై యున్నవి. అంతకు మించి భుజించిన అజీర్ణాదిరోగము లేర్పడును. అటువలెనే మనకు గావలసిన ముఖ్యపదార్థములను తగినంత భుజింపనిచో బలహీన మేర్పడి వ్యాధికి మార్గ మేర్పడగలదు

భోజనవిధానమున రెండుపద్ధతులు గలవు. ఏ
మెంతకావలెనో తెలిసికొని భుజించుట యొకటి.
లాభ్యాసమున ననుసరించి పదార్థవిజ్ఞానము లేనప్ప
భుజించుట మరియొకటి. పాశ్చాత్యశాస్త్ర పరి
లేర్పడిన తర్వాత వస్తుతత్త్వములనుగురించి
నుట కెక్కువ అవకాశము గలిగినది. శాస్త్రజ్ఞుల
ల్ల ననేకవింతసంగతులు మనకు తెలియుచున్నవి.
వసంఘములో కొన్నివర్ణములవారు చిరకాల
ంశపారంపర్యముగ శాకాహారులై యున్నారు.
వారు మాంసాహారులు. కాలక్రమమున సహవాస
వల్ల నేమి, ఆహారనియమములను బాటించుటలో
ంఘములందు లోపము లేర్పడుటచేతనేమి,
గ నాంగ్లేయవిద్య నభ్యసించినవారిలో చెక్కుం
ారాచారములందు వైమనస్య మేర్పడి యట్టి
రముల మంచి చెడుగులను గురించి పరిశీలింపక
పద్ధతుల నవలంబించుచున్నారు. అందువలన
లు కొందరు ప్రత్యక్షముగనో పరోక్షముగనో
మింటు గగులయందో, లాడ్జిలందో మాంసాహారు
న్నారు. అంతటితో జాలక 'మద్యేన మాంసంవినా'
'మాంసేన మద్యం వినా' అని ఆ రెంటికి నవినా
ంధము గలదని తెలియజేయుచున్నారు. మద్య
ము కాఫీ పొగాకు మొదలగు త్రాగుడుపదార్థముల యన
ర్థములను గురించి ప్రత్యేకముగ చర్చింపదగి యున్నది.
ప్రస్తుతము శాకాహారనియమము గలవారికి తదితరులకు
గల వ్యత్యాసములను గురించి పాశ్చాత్యశాస్త్రజ్ఞులు
వ్రాసినసంగతులనిం దుదాహరించుచున్నాను. ఇంతవరకు
నాహారశ్రేష్ఠత అందలి ముఖ్యపదార్థముల ననుసరించి
యుండునని తెలిపియున్నాను.

శారీరశాస్త్రమును జదివినవారికి మనముభుజించు
ఆహార మెవ్విధముగా రక్తముగా మారి దేహమునకు
పత్తువకండరములు గలిగించుచున్నదో దేహమునందలి
మాలిన్య మెటుల గలిగి వెలువరింపబడుచున్నదో తెలియు
చున్నది. ఒకయంత్రమును పనిచేయింపవలె నన్న అందు
బొగ్గో చమురో పొగయో విద్యుచ్ఛక్తియో ఎటుల అవ
సరమో మానవయంత్రమునకు గాలి నీరు నాహారము
నటులే యవసరములు. దేహమునం దనుక్షణము మార్పు
కెంది అట్టిమార్పువల్ల గలుగు లోటును నూతనాహారము
వల్ల భర్తీపరచుటవల్ల మానవయంత్రము పనిచేయు
చున్నది. ౧౫౪ పౌనుల బరువుగల మనుజుని శరీరము
లో నుండు ముఖ్యావయవముల బరువును వానికి కావల
సిన ఆహారపదార్థముల పరిమితి పరిశోధించి సిద్ధపరచిన
వివరముల నిట పొందుపరచుచున్నాను:

| | | పౌనులు |
|---|---|---|
| శారీరవివరములు— | కండరములు | 68 |
| | అస్థిపంజరము | 24 |
| | చర్మము | 10 ½ |
| | కొవ్వు | 28 |
| | మెదడు | 3 |
| | హృదయభాగము | 2 ½ |
| | కడుపుభాగము | 11 |
| | రక్తము | 7 |
| | మొత్తం | 154 పౌనులు |

| | పౌనులు |
|---|---|
| ఘనపదార్థములు | 66 |
| నీరు | 88 |
| మొత్తం | 154 |

ఇప్పుడు ప్రతిదినము మనుజునకు దేహావయవములవలన నెంతలోటు కలుగుచున్నదో తెలిసిన ఆలోటు నెంత్త మెంత తిరిగి భర్తీ కావలసినది తెలిసికొనవచ్చును. ఆంగ్లేయభాషలోనున్న శాస్త్రసంబంధమైన పదములకు సరియగు తెలుగుమాటలు లేనందున సాధ్యమైనంతవరకు నాంగ్ల పదప్రయోగము చే తద్భవములుగ నుపయోగించుచున్నాను. మనకు ప్రతిదినము లోటు ముఖ్యముగ యూపిరితిత్తులనుండి, చర్మమువల్ల, మూత్రసంబంధమైన కిడ్నీలనుండి, యితరముగ స్వేద మలమూత్రములు మొదలగునవి వెలువడుటవలన గలుగుచుండును. అట్టి లోటు 40 వేల గ్రెయినుల నీరు, 14500 గ్రెయినుల ఇతరపదార్థములు.

| లోటు వివరములు | నీరు | ఇతరవస్తువులు | | అంతర్భాగములు నైత్రజను | కార్బను (బొగ్గుసంబంధమైనది) |
|---|---|---|---|---|---|
| ఊపిరితిత్తులవలన | 5,000 | 12,000 | గ్రెయినులు | ... | 3,800 |
| కిడ్నీలవలన (మూత్రసంబంధమైనవి) | 28,000 | 1000 | ,, | 250 | 140 |
| చర్మమువలన | 10,000 | 700 | ,, | 10 | 100 |
| ఆసనమువలన | 2,000 | 800 | ,, | 40 | 460 |
| వెరశి | 40,000 | 14,500 | | 300 | 4,000 |
| రమారమి | (2 పౌనులు) | (6 పౌనులు) | | | (½ పౌను) |

మనము నిత్యమును భుజించు పదార్థములవలన పీల్చుగాలి మొదలగువానివలన పైలోటును భర్తీచేయుచునా

| భర్తీవివరములు— | | | లోటు వివరము | | |
|---|---|---|---|---|---|
| ఘనపదార్థములు | 8,400 | గ్రెయినులు | | | |
| ప్రాణవాయువు | 10,000 | ,, | నీరు | 40,000 | గ్రెయి |
| నీరు | 36,100 | ,, | ఇతరపదార్థములు | 14,500 | , |
| వెరశి | 54,500 | | వెరశి | 54,500 | ,, |

గ్రెయిను = వడ్లగింజ ఎత్తు

పైవిధముగ భర్తీచేయబడు ఘనపదార్థములలో నిదివరకు తెలియజేసిన ప్రకారము సత్తువ నిచ్చు ప్రొటీను చక్కెరపదార్థములు క్రొవ్వు లవణపదార్థములు గలవు.

| ఘనపదార్థముల వివరములు— | | అంతర్భాగములు నైత్రజను + కార్బను |
|---|---|---|
| ప్రొటీనులు | 2000 | (300 + 1000) |
| చక్కెరపదార్థములు | 4,500 | (— + 1800) |
| క్రొవ్వు | 1,500 | (— + 1200) |
| లవణపదార్థములు | 400 | (— + —) |
| నీరు | 36,100 | |
| వెరశి | 44,500 గ్రెయినులు | (300 + 4,000) |

రొదిరికి చేయేవిధమగు ఆహారమువల్ల పై ఘనపదార్థము లెంతవరకు చేర్పడగలవో దిగువ కనపరచబడుచు
వ పప్పుదినుసులలో ప్రొటీను కొన్నిటియందు మాంసములోనున్న ప్రొటీనుకంటె హెచ్చుగను, కొన్నిటి
వగను గలదు.

ప్రొటీనులు మొదలగునవి ఏర్పడు వివరములు—

| | గ్రెయినులు | ప్రొటీనులు | | చక్కెరపదార్థములు | కొవ్వు |
|---|---|---|---|---|---|
| 00 | మాంసముగాని పప్పుదినుసులుగాని | 1,100 | గ్రెయినులు | — | — |
| 00 | గోధుమలు | 600 | ,, | 3,600 | — |
| 00 | బంగాళాదుంపలు | 60 | ,, | 600 | — |
| 00 | పాలు | 240 | ,, | 300 | 240 |
| 60 | కొవ్వు-వెన్న మొదలగునవి | — | ,, | — | 1260 |
| 00 | నీరు | — | ,, | — | — |
| 00 | లవణపదార్థములు | — | ,, | — | — |
| | వెరశి | 2,000 | | 4,500 | 1,500 |

| | | |
|---|---|---|
| ఘనపదార్థముల వెరశి | 8,400 | గ్రెయినులు |
| నీరు | 36,100 | ,, |
| వెరశి | 44,500 | ,, |

క ముందు శాక మాంసాహారములలో నేవస్తువులవలన నెంత ప్రొటీను మొదలగు పదార్థములు సమకూడు
చికొనినపక్షమున జీవితమున కవసరమగు పదార్థములకై దేనిని భుజింపవలెనో తెలియగలదు.

హారపదార్థములు - ప్రొటీనులు మొదలగు వివరములు - నూరు గ్రెయినుల మొత్తములలో ఏపదార్థమెంతో
బడుచున్నది.

| వస్తువు | ప్రొటీను | చక్కెర | కొవ్వు | లవణపదార్థములు | నీరు |
|---|---|---|---|---|---|
| బియ్యము నూటికి | 7 | సగటున 80 (70 మొదలు 90 వరకును) | 2 | — | — |
| గోధుమలు | 11 ½ | ... | — | — | — |
| మొక్కజొన్నలు | 9 ½ | 69 | 4½ | 8¾ | — |
| జొన్నలు | 8 ¾ | ... | — | — | — |
| పప్పుధాన్యములు | 19 మొ॥ 23 వరకు | 53-55 | 2-4 | | |
| ఆకుకూరలు | 3 | 8 | — | — | 93 |
| పండ్లు మొదలగు దుంప దినుసులు | 2 | 15 | — | — | 83 79 |
| లగకాయ | | 6 | 15 | | |
| పచ్చికొబ్బరి | 5 | 22 | 60 | | |
| అరటికాయ | 1 | 28 | — | | |

| | | | | | |
|---|---|---|---|---|---|
| వేరుసెనగ | 30 | 16 | 49 | | |
| బాదంకాయ | 21 | 17 | 49 | | |
| బఠానీ | 24 | 64 | 1 | | |
| ఎండుమిరపకాయ | 9 | 70 | 7 | | |
| పచ్చిమిరపకాయ | 21 | 60 | 7 | 3 | |
| ఉల్లిగడ్డ | 1½ | 9 | ½ | ½ | 87½ |
| గొర్రెమాంసము | 24 | — | — | — | — |
| చేపలు | 17 | — | 5 | — | — |
| కోడి | 21 | — | 2 | 1 | — |
| మజ్జిగ | 6 | 10 | 1 | — | 80 |
| పాలు | 3¼ | 5 | 4 | ¾ | 87 |
| మీగడ | 2 | 5 | 18 | 1 | 74 |

ఇంతవరకు నేఆహారపదార్థములలో మనకు కావలసిన ప్రొటీను మొదలగున వెంతవరకు గలవో తెలిసికొని యున్నాము. వీనిలో కొన్ని జీర్ణమగుట కెక్కువకాలము పట్టును. కొన్ని చాల గంటలకాలమునకుగాని జీర్ణము కావు. 'అన్నం బద్ధఘామలో జీర్ణంబగును' అను భాగవతవచనము గలదు. సాధ్యమైనంతవరకు శీఘ్రకాలములో జీర్ణమగుపదార్థముల సామాన్యజను లాశించుట సహజము. దేహబలము తగినంత లేనిచో దీర్ఘకాలమునకుగాని జీర్ణముకాని పదార్థములను భుజించుట ఆరోగ్యకరముకాదు. అందువలన సులభముగా భుక్తిముక్తి దొరకినయెడల [illegible] లు కనుకూలముగానుండును. ఆహారాది నియమములన్నియు ప్రజారోగ్యమునకై యేర్పడినవైనను నవీనకాల[illegible] నియమవిచ్ఛేదమునకే ప్రజాభిలాష హెచ్చుగా నున్నది. హైందవశాస్త్ర నియమములగాకున్నను ప్రకృతిశాస్త్ర నియమములనైన ఆంగ్లవిద్యాధికులు మన్నించెదరను విశ్వాసముతో నున్నవాడను. అందుచేత పెక్కుమంది శాస్త్రజ్ఞులు వ్రాసినవిషయముల నొక్కచో క్రోడీకరింప నమకట్టినాను. ఇప్పుడు మందు జీర్ణకాలపరిమితి తెలియగల పట్టీని గనబరచుచున్నాను. జర్మనీదేశమునందలి బర్లిను వాస్తవ్యులగు అర్నెస్టు రూమల్ శాస్త్రజ్ఞునియొక్క, బోస్టనునివాసియగు ప్రొఫెసరు బంజిరియొక్క పరిశోధన లిందు గలవు.

| ఆహారపదార్థము | జీర్ణకాలపరిమితి గంటలు, నిమిషములు | ఆహారపదార్థము | జీర్ణకాలపరిమితి గంటలు, నిమిషములు |
|---|---|---|---|
| బియ్యం అన్నము | 1 | ఉల్లిగడ్డ | 3-30 |
| నగుబియ్యం | 1-35 | జొన్న | 3-30 |
| రేగుపండ్లు | 1-30 | రొట్టె | 3-30 |
| పాలు | 2 | వెన్న | 3-30 |
| తోటకూర | 2-30 | కోడి | 4 |
| బంగాళాదుంపలు | 2-30 | పందిమాంసము | 5-15 |
| బటానీలు | 2-30 | సారాయము | 6 |
| సీతాఫలము | 2-45 | గొడ్డుమాంసము | 6 |
| చిక్కుడుకాయలు | 2-30 | | |
| యాపిలు (బాక్లీ) | 2 | | |
| దుంపలు | 3-30 | | |

వీనిలో నీటితో ఉడకబెట్టినవి జీర్ణమగుటకు రెండుగంటలైన నవి వేయించబడినయెడల 4 గంటలు బట్టును.

...త్తి మనుజాని శరీరములో ౩౪ పాళ్ల ఘన
..., ౬౬ పాళ్ల నీరును గలవు.

...ఆరోగ్యమున కేర్పడిన ఆహారనియమములను
...వారు దీర్ఘజీవులగుటకు సుఖము ననుభవించు
...న అవకాశము గలదు. ఇటీవలి శాస్త్రపరి
...త కాయగూరలు మొదలగువాని పొట్టు
...లో నారోగ్యమునకు ముఖ్యాధారము లగు
...దార్థములు గలవనియు నవిలేని మరబియ్యము
...హానికరములని నారింజపండ్లు, మొదలగు
...విటమినులు విస్తరించియుండుటచే మిగుల
...తములనియు స్పష్టమగుచున్నది. ఇదివరలో
...సూక్ష్మ, విష జీవులు కారణములని పరిశో
...న్నారు. తర్వాత తగినంత ప్రొటీను మొద
...జింపనందున సరియైన ఆరోగ్యము లేదను
...ప్పుడు విటమినుల సిద్ధాంతము రోగనివారణకు
...నున్నది. సహజమైన పాలను వదలి డబ్బా
...లగునవి ఉపయోగించుటవల్ల ఎందరో శిశువు
...ందుచున్నారు. డబ్బాపాలవల్ల పెరుగు శిశు
...రకము నూటికి 95 వంతున గలదని శాస్త్ర
...లుపుచున్నారు. సారాయము ద్రోలువారి
...సాధారణముగ సంతానమే గలుగనెడల
...మాతృస్తన్యము కరువగును. మితిమీరి
...లన గలుగు వ్యాధుల కుపవాసమే పరమా
...లవణములు మొదలైనవి మితముగా వాడుట
...ను ఘనీభవింపకుండ జేయును. శీతోష్ణస్థితి
...ని వ్యత్యాసములను గమనించి సరియైన ఆహార
...గలిగియుండుట కెల్లరును ప్రయత్నించుట
...యియున్నది. ఇంతవఱకు గనబరచిన వివర
...శాకాహారము ముఖ్యమని జనులు లాహింప

...ష్టిలో కొన్ని జంతువులు మాంసాహారమువల
...న్ని శాకాహారమువలనను జీవించుట మనకు
...న్నది. అట్టి జంతువులకు స్వభావసిద్ధములగు భేద
...వు. పులియు మేకయు నట్టిభేదములకు నిదర్శ
...కి శాకాహారముగాని మేకకు మాంసాహారము
గాని యుండుటలేదు. మనుజులలోమాత్రము రెండు తెగలవారును గలరు. వారిలో కొందరిప్పుడు శాకమారగుచున్నారు. శాకాహారము సాత్త్విక స్వభావమును, మాంసాహారము రాజసస్వభావమును వృద్ధిచేయును. మాంసముజీర్ణమగుటలో గొంత కష్టముగలదు. గర్భకోశమున జీర్ణము కాబడని పదార్థములవల్ల కొన్ని విషద్రవము లేర్పడి మనుజున కాశేఖాందోళనలను గలిగించును. వారికి తీవ్రము హెచ్చు. మాంసాహారులకు జీర్ణమగుటకే వరములశక్తి హెచ్చుగా వినియోగింపబడుటచేత మెదడునకు తగినంతశక్తి గలుగుట లేదు. శాకాహారుల దేహమాలిన్యమున 5 కోట్ల అణుజీవులుండగా మాంసాహారుల దేహమాలిన్యమునందు 25 లక్షల కోట్ల అణుజీవు లున్నటుల ప్రకృతి శాస్త్రవేత్తల పరిశోధనలవలన దెలియుచున్నది. అణుజీవుల సంఖ్యను మజ్జిగ తగ్గించగలదు. డాక్టరు పార్లో అనువారు దినమున కొకసారి గాని రెండుసార్లుగాని భుజించువారు మిక్కిలి ఆరోగ్యవంతులని వ్రాయుచున్నారు. పిండివంటల దినువారికన్న సామాన్యజను లెక్కువ ఆరోగ్యవంతులు. ప్రొఫెసరు చిట్టెండనుగారు 6 గురు ధీశాలురను, ౨౦ మంది సైనికులను, ౬ గురు వస్తాదులను, ౬ మాసములు సగముభోజనముతో పెంచగా వారందరికి ఆరోగ్యము, బలము హెచ్చినటుల రుజువుపరచియున్నారు. బోనుహార్డను ఫ్రెంచి శాస్త్రజ్ఞుడు మాంసాహారము రోగాంకురములను హెచ్చుచేయునని నిరూపించియుండెను. వాన్‌సో మిరాను వలోకేసు స్లేచ్చెరు అను శాస్త్రజ్ఞులు! శారీరశాస్త్రజ్ఞుల సభలో శాకాహార మెటుల రోగాంకురములను తగ్గించునో నిరూపించియుండిరి. మనుజునకు కావలసిన శక్తికి ప్రొటీనులకు శాకాహారులకంటె మాంసాహారులకు ఖర్చు హెచ్చు. మాంసాహారమున కగు ఖర్చులో నూటికి ౫౮ వంతులకు నూటికి ముప్పదివంతుల ప్రొటీను 33 వంతుల శక్తి లభించుచుండ శాకాహారమునకగు ఖర్చులో నూటికి 3౫ వంతులకు నూటికి అరవదివంతుల ప్రొటీను నూటికి ౬౬ వంతుల శక్తి లభించునని తెలియుచున్నది. గొప్ప శాస్త్రజ్ఞుడగు ఎడిసను మాంసాహారమును మాని అట్టి మార్పువల్ల తనకు గలిగిన ఉత్సాహమును వర్ణించియుం

డెను. మనదేశములో శాకాహారులలో బాల్యవివాహ నియమముండుటను మాంసాహారులకు రజస్వలానంతర వివాహముండుటను గాంచుచున్నాము — వివాహాంశములను జర్చించుటకుగాని, ఆహారనియమములకు సంబంధించిన ఈ వ్యాసములో వివాహవిషయమును గురించి విన్నవించుటకుగాని నేను సంకల్పించలేదు. పాశ్చాత్యదేశములలో నానాటికి మాంసాహారము తగ్గి శాకాహారము హెచ్చుచున్నది. అమెరికాలో ౧౮౪౦ సంవత్సరమునాటికి మనుజునకు సగటున దినమునకు ఒకపౌను మాంసము ఖర్చుపడెడిది. ఇప్పుడది అరపౌనుకు తగ్గినది. అటులనే పాతిక సంవత్సరములకు పూర్వము గోధుములు మనుజునకు సాలుకు 4⅔ బుషెల్సు (వారికొలపరిమాణము) ఖర్చుపడుచుండ ఇప్పుడు 5½ బుషెల్లు ఖర్చు అగుచున్నవట. నూరుపౌనుల ధాన్యములనుండి రాగల కండరశక్తి ౨౮౭ పౌనుల మాంసమునుండి రాగలదు. లాయిన్ గిల్బర్టు లనువారు ౨౦ పౌనుల శాకాహారమువల్ల ౧ పౌను మాంసము సిద్ధమగు ననుచున్నారు. ౨౨౪౦ పౌనుల గోధుములనుండి ౧౭౧౦ పౌనుల నికరాహారము గలుగుచుండ ఆధాన్యము దానిగడ్డి పశువులకు మేపిన ౨౦౦ పౌనుల గొడ్డుమాంసము లభించును. అనగా ఒక యకరము పొలమువలన ౧౦ మంది శాకాహారులు జీవింపగలిగినదానిలోని పైరుపశువుల నుపయోగించిన ౧ మాంసాహారికి సరిపోవు గొడ్డుమాంసము లభించగలదు. జేమ్సు అను శాస్త్రజ్ఞుడు చేసిన పరిశోధనలలో వ్రణవ్యాధి మాంసాహారులకు శాకాహారులకు ౧౩:౧ వంతున వ్యాపించునని కనుగొనినాడు. బ్రన్టను అను శాస్త్రజ్ఞుడు ప్రపంచములో మిక్కిలి బలశాలురును పట్టుదలగలవారును శాకాహారులేయని చాటియున్నారు- గాటియర్ అను శాస్త్రజ్ఞుడు కొన్ని పందుల నొకచోటనుంచి వానికి శాకాహారమును, మరికొన్ని పందులను వేరుగనుంచి వానికిమాంసాహారమును కొన్నినెల లిచ్చి తుదకు రెండురకముల పందులను వదలగా శాకాహారము తిన్నపందులు నెమ్మదిగానుండ, మాంసాహారము తిన్నపందులు వెంటబడి కరవవచ్చినవని, మిక్కిలి తీవ్రస్వభావముగలవిగ నుండినవని వ్రాసియుండెను. మాంసాహారము తినని యస్కిమో జాతివారిలో నూటికి ఒకరికిని మన హిందువులకు నూటికి ౬ గురికిని చీనాలో నూటికి ౪౦ మంది యూరపుఖండములో నూటికి ౯౦ మందికి దంతవ్యాధి బాధ గలదని తెలియుచున్నది. వివేకచిహ్నముగు దంతమొకటి ప్రతిమనుజునికి నుండును. దంతభంగమువలన వివేకశూన్యత యేర్పడును.

డ్రెస్డెను పట్టణములో ౨౫౧ మంది దూరపు నడక పందెములో నడవగా నందు మొదటి నలుగురు శాకాహారులుగ నుండిరి. హిగ్గిన్సు అను శాస్త్రజ్ఞుడు కండరములకు గావలసిన ప్రాణవాయువుకంటె నరములకు ౪ రెట్లు హెచ్చుకావలెనని కనుగొనినాడు. మనము తీసికొను ప్రాణవాయువులో సగము మెదడునకే కావలెను. అట్టి ప్రాణవాయువు జీర్ణశక్తికి, కండరములకు యెక్కువగా వినియోగపడునెడల మెదడునకు దగినంత ప్రాణవాయువు ఉండజాలదు. కాబట్టి బుద్ధిబలము హెచ్చిన దేహపాటవము తక్కువగ నుండును. అందుచేత వ్యాయామములందు దిరుగు విద్యార్థుల నేతరగతిలోనైనను మొదటి అయిదుగురు మేధావంతులలో సాధారణముగ గాంచము. అట్టివారిస్థానము తరచు చివర అయిదుగురిలో నుండుట గలదు—సయింటిఫిక్ అమెరికను అను పత్రికలో శాకాహారులే యెక్కువ చురుకుగలవారని యొక్క శాస్త్రజ్ఞుని వ్యాసము కలదు. అంతమాత్రమున మాంసాహారులలో మేధావులు లేరనిగాని శాకాహారులందరు తెలివిగలవారని గాని తలంపరాదు. మాంసాహారులలో గల మేధావులు శాకాహారమునే గలిగియుండిన నింక నెక్కువ తెలివిగలవారుగ నుందురనిమాత్రము చెప్పవచ్చును. కొన్ని పదార్థములు అభక్ష్యములని కొన్ని పానీయములు వర్జింపదగినవని విద్యాధికులకు దెలిసియు జిహ్వాచాపల్యము గలిగి సంచరించుటచేత వారి శరీరము లుండవలసిన స్థితిలో లేవు. నియమములందు విశ్వాసముండి బాల్యమునుండి పెద్దలు నడచినమార్గము నే యవలంబించియున్నచో మనదేశ మిట్టి యధోగతిలో నుండియుండదు. కాబట్టి దేశాభిమానముచేతనేమి దేహాభిమానముచేతనేమి ఆహారనియమముల ననుష్ఠించి హైందవదేశముయొక్క పేరు, ప్రతిష్ఠలను నిలుపుటకై ముఖ్య

గ్లేయవిద్యార్థికులను విద్యార్థులను గోరుచు నిరత
రమించుచున్నాను. వ్యాసము దీర్ఘమైనందులకు
గోరుచున్నాను.

## ౨

...దివర శాకాహారనియమమును గురించి వ్రాయు
...శాకాహార ప్రాశస్త్యమునుగురించి చాలవరకు
...సి యుంటిని. ఆహారావశ్యకత ప్రతిదినము
...టును భర్తీచేయుట కేర్పడినదని మాత్రము
...ంటిని ఇప్పుడు శాస్త్రదృష్టితో దత్కారణ
...నగోరుచున్నాను. నష్టపడు జీవపదార్థమును
...ర్పాటుచేయుపద్ధతిని తెలిసికొనవలెను. జీవ
...నకు ప్రాణవాయువు అనబడు ఆక్సిజను, జల
...ను హైడ్రజను, కేవలవాయువునకు సంబంధిం
...జను, ఘనపదార్థముగు కార్బను అను నాలుగు
...క పదార్థములు కొన్నిపాళ్లుగ సమ్మేళన మగుట
...త్తి గలుగుచున్నదని శాస్త్రజ్ఞులు నిర్ధారణ
...న్నారు. పై ప్రాథమికపదార్థముల సమ్మేళ
... గాక మృతపదార్థముయొక్క సహాయముతో
... జీవపదార్థము నుత్పత్తిచేయ వీలుగలదు. కూర
... చెట్లయందుండగను, మాంసము జంతువుల శరీర
...డగను జీవపదార్థముగ నుండును. అవి వెలుపలకు
...నప్పుడు మృతపదార్థము లగుచున్నవి. ఒకప్పు
...పదార్థములుగ నుండిన కారణమున కాయగూ
...ంసము మొదలగు మృతపదార్థములను మనుజులు
...టవలన వాని సహాయమున వారు జీవపదార్థమును
... భర్తీచేసికొన గలుగుచున్నారు. చెట్లు మొదలగు
...తిలోగల నీటివలన గాలివలన మన్నువలన తమకు
... పైనాలుగు ప్రాథమికపదార్థములను తీగివ
...దీసికొని తమకు గావలసిన జీవపదార్థము నుత్పత్తి
... గలుగుచున్నవి. ప్రకృతిలో దొరకు ప్రాథ
...ర్థముల సహాయముతో జీవపదార్థమును నిర్మా
...న శక్తి మనయందు వశించినటుల గన్పట్టుచున్న
...ాట్ అను శాస్త్రజ్ఞుడు కొన్ని పరిశోధనలనుజేసి
... దగిన జీవపదార్థము ప్రాథమిక పదార్థముల

సమ్మేళనమువల్ల నేర్పాటుచేయుటకు వీలుగలదని స్థిరప
రచియుండెను. యోగాభ్యాసము చేయువారు చాలకాలము
నిరాహారులై యుండుటలో వారికి గావలసిన జీవపదా
ర్థము వారు ధారణచేయు ప్రాణవాయువు మొదలగు పదా
ర్థములవలన గొంతవర కేర్పడుటచేతనే సాధ్యమగుచున్న
దని దెలిసికొన వలసియున్నది. జీవపదార్థమును ప్రాటో
ప్లాస మందురు-అదియే ప్రాణాధారము. కాబట్టి ప్రాణ
రక్షణకై ప్రతిమనుజుడు జీవపదార్థమును నిర్మాణము
చేసికొనకతప్పదు. అందుకై మృతజీవపదార్థములగు
శాకాహార మాంసాహారముల యావశ్యకత యేర్పడు
చున్నది.

శరీరమునందలి జీవపదార్థము నష్టపడుటవలన
దానిని తిరిగి జీవపదార్థముతో భర్తీచేయవలసిన ప్రసక్తి
గలుగుచున్నది. కాబట్టి జీవపదార్థ మెటుల నష్టపడు
చున్నదో పరిశీలింపవచ్చును. పనిచేయు యంత్రమునకు
బొగ్గు మొదలగున వెటులనో మనదేహమున కాహార మటు
వంటిదని యిదివరకు వ్రాసియుంటిని. ఇతర యంత్రముల
కును మానవయంత్రమువంటి జీవయంత్రములకు ముఖ్య
భేదముగలదు. ఇతరయంత్రములు పనిచేయక ఉండ
వచ్చును. జీవయంత్రములందు ప్రాణమున్నంతవరకు నా
యంత్రములు రాత్రింబవళ్లు విధివిరామములేక పనిచేయు
చునే యుండును. అందుకై గాలి నీరు ఆహారము ఉప
యోగపడుచుండును. ఆహారసంబంధ మగునంతవర కే
ప్రస్తుతము దెలియవలసియున్నది. మనము భుజించు
ఆహారమును నోటిలో నములుటకు బూర్వము దంపుట
వల్ల వండుటవల్ల గొంతవరకు సులభముగ జీర్ణమగు పద్ధ
తుల ననుభవించుచున్నాము. ఉమ్మిలో గొన్ని రసాయన
ద్రవములుండి వానిసహాయమున గొంతవరకు గొన్ని
ఆహారపదార్థములు నోటిలోనే జీర్ణమగుటకు ప్రారంభ
మగును. అన్నము మింగిన పిమ్మట కడుపునచేరి యచ్చట
కొన్ని ద్రవపదార్థములతో మిళితమై చాలవరకు జీర్ణ
మగును. శేషించిన పదార్థములు పేగులనబడు ఇంటెస్
టైనులకు జేరి యచ్చట జీర్ణమగును. ఇందు కొంతభాగము
లివరు అను హైత్యకోశమునకు జేరి అచ్చటనుండి ఊపిరి
తిత్తుల సహాయమున ప్రాణవాయువుతో గలిసి నల్లని

## ౫

## భ్రాతృసమరము

'సమొగరు' యుద్ధరంగమందున్న ధ్వానము లాగ్రానగరమునకు వినవచ్చెను. యుద్ధ మారంభమాయెనని స్పష్టమాయెను. పురజనులు భయవిహ్వలులైరి. దారా జయించు కేని రాజధానికి ప్రమాదములేదు. మురాదౌరంగజేబులు పట్టుపడకపోయినను, భగ్నప్రయత్నులై వెనుకకు మరలుదురు. విప్లవ మంతటితో సంతరించును. ఒకవేళ వారే జయింతురేని, వారి నెవరు వారింపఁగల్గుదురు? పాదుషా యధికారము ధిక్కరించి యువరాజు నోడించు రాజకుమారులు రాజధాని నెంత కలంతురో? తా మెట్టి దురవస్థకుఁ బాల్పడవలయునోయని పౌరులు పరిపరివిధముల చింతింపుచు మిక్కిలి సంక్షోభించిరి. యుద్ధభూమినుండి యరుదెంచు పాటుఁబోతు లనేకగతులఁ బల్కుచు, వారిని మఱింత కలవరపఱచిరి.

యుద్ధమున నోటువడి యధికపరిశ్రాంతుఁడైన యువరాజు స్వల్పపరివారముతోడ రేయి తొమ్మిది గంటలకు నాగ్రానగరము జేరుకొని, పురజనులు భయసంభ్రమపరులై హాహాకారము లొనరింపఁ దన మందిరము జొచ్చి, తలుపులు బంధించి బోరున విలపించెను. నాఁటి మహాపజయముచే నాతని హృదయము చూర్ణీకృతమాయెను.

ఆ దుర్వార్త షాజహానునకును దెలియవచ్చెను. ఆవృద్ధుని విషాద మపారము; అనిర్వచనీయము. దారా హితకారిణియగు జహానారాయును అత్యంత చింతాక్రాంత యాయెను. వినను అట్టి మహాకష్టసమయమునఁ గాలహరణము ప్రాణసంకటము. పాదుషా విషాదము దిగమ్రింగి, ప్రకృతకార్యనిర్ణయార్థము దారా తన చెంతకు రావలయునని కబురంపెను. కాని, మహాపజయసంస్మరణమగ్నుఁడైన భాగ్యహీనునకుఁ బితృదర్శన మొనరించుటకు మోముచెల్లకపోయెను. మఱియు రెండుమూఁడు రాత్రులు నొప్పువాల్పక, రణభూమియం దొక్కక్షణము విశ్రాంతి గానక, ప్రథమశ్రమనుఁగూడ గీడ్పడి డీలుపడిన దారా యొకగంటయైన యూఅట గొనవలయును. అధికకాల మట విడిసియుంటయు నసాధ్యము. యమభటులవోలె వైరు లరు దేఱక మున్నె, యాతఁడు సురక్షితస్థానమునకుఁ బాఱ వలసియుండు. కావున యువరాజు తండ్రి సన్నిధికిఁ బోఁజాలక పోయెను.

దారా శీఘ్రముగ రాజధాని వీడవలయును. కావున షాజహాను తత్క్షణము తదుచితప్రయత్నము లొనరించెను. తన ధనాగారమునుండి ధనరాశి దీయించి యాతని కంపుటయేగాక, దారాకు సర్వ సదుపాయము లొనరించి యాతని యాజ్ఞానువర్తియై మెలఁగవలయునని ఢిల్లీ దుర్గపాలకునకు వర్తమాన మంపెను. దారా యొకజాము విశ్రమించి యుండెను. అమూల్యాభరణాదివస్తువులు మాత్రము గొని, పదిమంది భటులు వెంట నడువ, తన భార్యాపుత్ర పౌత్రులతోడ షాజహాను చక్రవర్తి జ్యేష్ఠకుమారుఁడు మ్రుచ్చువలె రేయి మూఁడవజామున ఢిల్లీనగరమునకుఁ బ్రయాణమాయెను.

ఔరంగజేబు రెండుదినములలో నాగ్రానగరము సమీపించి, పదిదినము లొకత్రోటపునందు విడిసియుండెను. అతని సేన యనుదినము వర్ధిల్లుచుండెను. సాధారణ సైనికులును సాధారణోద్యోగులేగాక, పయస్తభావా ప్రముఖులుగూడ నాతని యండ జేరిరి. ఔరంగజేబునకు బెన్నిధివలె దొరకిన మీర్జుమ్లాయొక్క కుమారుఁడు మహమ్మదమీనుఖా నాతని బహిరంగముగా నాశ్రయించెను. నూతనాగతులను యథాక్రమంబున సంభావించుచు, దన సేనవలన రాజధానికి గష్టములు ఘటిల్లకుండ చూచుచు నౌరంగజే బప్రమత్తుఁడై యుండెను.

ఆతఁ డింతవఱకు షాజహానును బహిరంగముగా ధిక్కరింపలేదు. షూజా, మురాదులవలె నాతఁడు నిజ జయప్రకటనాది యవివేకకార్యము లొనరింపలేదు. పాదుషాయాజ్ఞకు విరుద్ధముగ మీర్జుమ్లాను దనచెం

...నివపుడును, తాను మహాసేనాసమేతుఁడై ...తోడ బయలుదేఱినపుడును, ధర్మాతుయుద్ధము ...యశోవంతసింహమహారాజును గొట్టి విజయము ...పుడును, తుదకు 'సముగరు' యుద్ధమునందు ...భంజించి మహావిజయము జూరఁగొనినపుడును ...వన విస్పష్టదర్శ్యల సెట్టులో యాతఁడు సమ ...మచుండెను. పితృసదనసందర్శనార్థము తానరు ...ండ, వాఁడు యశోవంతునివలె, నేఁడు దారా ...ర్గావరోధ మొనరింపఁబూనుటచేతనే, నాఁటి ...డును దాను రణమాచరింపవలసి వచ్చెనని ...జేబు సముగరు యుద్ధానంతరము షాజహానుపకు ... అందులకుఁ బ్రత్యుత్తరముగాఁ దనఁ కుమా ...డఁగోరి షాజహాను వాత్సల్యపూరితమగు సందే ... అనంతర మట్టి సందేశమే గాక, 'అలంగీరు' ...యి) అను ప్రసిద్ధఖడ్గమును మఱి యనేక ...ములగూడ నాతఁ డంపెను. పితృసర్శన మొన ... మొదట సమ్మతించియు నౌరంగజేబు మఱల ...రాకరించెను. తండ్రి కుమారులు కలసి పరస్పర ...నము లోవరించి వ్యవహారము పరిష్కరించు ...వాంఛనీయము కేదైనను, దారాపక్షపాతియగు ...తన్ను బంధింపవచ్చునని యౌరంగజేబనుమానిం ...చితము గాదు.

...గ్రాదుర్గ మాక్రమించుటకు నౌరంగజేబు సంసిద్ధు ... అరక్షితమగు నగరము సులభముగా నాతని ...యెను. ఇఁకదుర్గ మాక్రమింపవలయును. ఔరం ...దుచితసన్నాహము లొనరించెను. షాజహాను ... తనదుర్గరక్షణ మొనరించుకొనఁ గృతనిశ్చయుఁ ...చితప్రయత్నములు శీఘ్రముగ నొనరించెను. ఈ ...న నొక విషయము గమనింపవలయును. ...బు పలుకులు పాటింతుమేని, అతఁడు దారా ... వైరము వహించియుండెను. తండ్రియెడ ...భావము లేకుండుటయేగాక, పితృవాత్సల్యము ...త లేనియట్టులే యాతఁడు మెలంగుచువచ్చెను, ...రా యిపు డాగ్రానగరమున లేఁడుగదా! ...డు లేకున్నను, దుర్గాక్రమణ మొనరింపనున్న యౌరంగజేబు యథాతథ్య మిపుడు పూర్తిగ వ్యక్తమాయెను. భ్రాతృసమర నాటకమునందీయది తృతీయాంకము.

పదునైదువందల బానిససైన్యమాత్రము దుర్గమునందుండెను. వారందఱు నవ్యదేశమువారైనను విశ్వసనీయులు. సేన యల్పమైనను దుర్గము సుదృఢప్రాకార పరిరక్షితమై, విశాలపరిఖాపరివృతమై, బహుళశతఘ్నీసమృద్ధమై దుర్భేద్యమై యుండెను. ఔరంగజేబు ఫిరంగులు సప్రభేదన మొనరింపఁజాలక పోయెను. సొరంగములు త్రవ్వి మందు నింపి, గోడలు నిర్భిన్న మొనరించుటయు నసాధ్యము. కష్టసాధ్యముగు పరిఖాతరణ మొనరించి గోడలకెగఁ బ్రాకఁ గడఁగిన సాహసులు శాత్రవాగ్నిగోళములచే దగ్ధమైరి. కావున బలవదాక్రమణ మసాధ్యమాయెను. ముట్టడియే శరణ్యము. కాని యది దీర్ఘకాలము గొనును. అంతఃఅకును దారాను వీడి యాతని సేన సంహరణ మొనరింప నిచ్చుట యవివేకము. అట్టిక్లిష్టసమయమునందు ధీమంతుఁడగు నౌరంగజేబు తన మంత్రులతోడ మంతన మొనరించి, యొక సూక్ష్మోపాయమున నామహాదుర్గము సులభముగా సాధించెను. అనేకరాజకులఘటితపాటవుఁడగు షాజహాను ముహూర్తమాత్రమునఁ దనపుత్రునకరిగాపాయెను. యమునానదీనీరము గొంపోవుటకు దుర్గమునం దొక ద్వార మేర్పడియుండెను. ఔరంగజేబు సైనికులు సమయము గనిపట్టి యాకస్మికముగా నాద్వార మాక్రమించిరి. అధికులు సురక్షితముగా దాగియుండి, యావంక కరుడెంచువారిని బడఁగొట్టుటకు వీలుగానుండెను. ఆకారణమున నిర్మలనదీనీరము దుర్గమునకుఁ గట్టువడెను. ప్రక్కను యమునానది యుండుటవలన దుర్గసమీపము లుపయోగింపమి నయ్యవి పాడువడెను. నిర్మలహిమాంబువులు ద్రావు శ్రీమంతులకు, సన్నతోద్యోగులకును ఆ దుర్జలంబులు దుస్సహములాయెను. వారలేగాక, మహావైభవాక్రాంతుఁడగు షాజహాను సహితము నిక్కృష్టక్షారజలపాన మొనరింపవలసినవాఁ డాయెను. అట్టి యపూర్వబాధాకరావసరమున నాతఁ డౌరంగజేబునకు వ్రాసి పంపిన పద్య భావము స్మరణీయము.—

"కుమారా! శూరుఁడా! సర్వము దైవాజ్ఞాబద్ధము; నా ప్రారావస్థకు నేను విధి నేల నిందింపవలయు ?

న్నిటిఁ బలకు సహస్ర సహస్రసేనాధినాథుఁడై రాజిల్లిన రాజునకు నేఁడు గిన్నెడు జలము కరవాయెను!

హిందువులు ధన్యాత్ములు. వారు తమ పితృదేవలకు నిరంతర జలతర్పణము లర్పింతురు: కుమారా! కో! నేను జీవించియుండఁగనే, జలమీయక బాధించున్నావు: నీవు వింత మహమ్మదీయుఁడవు!

కుమారా! నీ వర్తమానభాగ్యము వలంచి గర్వపడకుము. ఈ ప్రపంచము విశ్వాసఘాతుకము గర్వాంధుఁడవై ప్రమత్తుఁడవు గావలదు. అనిత్యమగు నీజగమునందు లోకమునకుఁ గొంపోవు మార్గము మాత్రమే యని యెఱుంగుము. దైవచింతా నిమగ్నుఁడవై మానవ దయాపరతంత్రుఁడవై మనుదేని, నీకు నిత్యైశ్వర్యము ప్రాపించును."

కాని, కార్యశూరుఁడగు నౌరంగజేబు తిలమాత్రమును మెత్తపడలేదు. షాజహాను నను దినల స్థైర్య మంతకంతకు క్షీణించుచుండెను. తన కుమారుని కాఠిన్య మెట్టులైనఁ దొలఁగించి ప్రసన్నుఁ జేసికొన వలయునని యా వృద్ధరాజు వినుత నొకదీనసందేశ మంపెను. ఔరంగజేబు తన ప్రవర్తనము సమర్థించుకొనుచు, నిట్లు ప్రతిసందేశము బంపెను. "కొన్ని కారణములచేత భవదీయ దివ్యదర్శన మొనరింపఁజాలక పోతిని. దుర్గద్వార ప్రవేశమునకు మా కనుజ్ఞ దయచేయుదువేని నా యనుమానము తీరును: అప్పుడు నీ సన్నిధి కరుదెంచి, నీ వేమి పంచినట్లు చేయుదును. నీ కపాయము వొరయనేరదు."

షాజహాను దుర్గద్వారము తీయించెను. ఔరంగజేబు సైనికులు వెంటనే యందుఁ జొచ్చి, యాద్వారము నేగాక, దుర్గ సంతతియుఁ గూడ స్వాధీనపఱచికొనిరి. ఖ్యాతిధనసమృద్ధమగు నా మహాదుర్గ మౌరంగజేబున కనువుగాఁ జిక్కెను. ఆతని విశ్వసించిన షాజహాను—మహాసామ్రాజ్యము శాసించిన మహానేత తనరాజధానియందే, తనదుర్గమునందే బంధితుఁడై పోయెను.

ఔరంగజేబు తనమాట పాటించునేమోయని జహానారా యాతనిచెంత కేగెను. ఆ సోదరి దారాపక్షపాతియైనను ఔరంగజేబు కృతజ్ఞతాభిమానములకుఁ పాత్రయై మాననీయయై యుండెను.

అలనాఁడు డాకోమల హేమగాత్రి యనలదగ్ధయై మృతప్రాయయై పోగులనప్పు డితరసోదరులవలె నౌరంగజేబుకూడ సోదరీహితార్థ మత్యాతురమున వెడలియుండెనుగదా ఆతఁడా సమయమునను దోష్యగరహితుఁడగుటయు, కరుణాసముద్రయగు జహానారాయొక్క సాహాయ్యమున నాతఁ డుద్యోగమునఁ బునఃప్రతిష్ఠితుఁడగుటయు మొదటి వ్యాసమునఁ గాంచియుంటిమి. ఔరంగజేబు తనకెండవ దక్కను ప్రతినిధిత్వమునందు జనకుఁ డకారణముగఁ దనపై గినిసి యనుమానించి మిక్కిలి యవమానించుచుండెనని విలపించుచు జహానారాకే తన హృదయారాటము తెలిపియుండెను. అట్టి జహానారా యిప్పు డౌరంగజేబును గాంచి సోదరప్రేమపురస్సరయై యాతనికి హిత ముపదేశించెను. కేవలహితోపదేశమేకాక, యాతనికిఁ గడులాభకరమగుపగిది సామ్రాజ్యవిభాగముగూడ సూచించెను. పంజాబు, బంగాళా, గుజరాతురాష్ట్రములు వరుసగా దారా షూజా మురాదులకును, దక్కనురాష్ట్రము ఔరంగజేబు కుమారునకును బంచియిచ్చి, ఔరంగజేబు యువరాజబిరుదధుర్యుఁడై తక్కుంగల దేశము పాలింపవలయునని పలికి, వృద్ధజనకుని దర్శింపవలయునని జహానారా ప్రార్థించెను. దారా హైందవమతాభిమానియై నీతిబాహ్యుఁడాయెఁ గావున వానింబట్టి వధించుటకుఁ దాను పితృదర్శన మొనరింపనని యౌరంగజేబు బదులాడెను. ఐనను, సుగుణరాశియగు జహానారామాట ద్రోసివేయఁజాలక యాతఁడు జనకునిఁ గాంచుట కియ్యకొనెను.

కాని ఔరంగజేబు దారాను వధింపవలయును; షాజహాను నధికారరహితునిగ, స్వాతంత్ర్యరహితునిగనే యుంచవలయును; రాజ్యము నిశ్శత్రవము, నిష్కంటకముగాకుండ రాజత్వము నిరాఘాటముగా సాగనేరదు. కావున, తాను బంధించిన జనకుని గాంచుట నిరర్థకము, అయుక్తము, రాజనీతి విరుద్ధము. ఐనను, ఆతఁడు లోకానుభవముగల మహాలౌక్యుఁడగుటచేత, పితృసన్నిధికిఁ బోవువానివలె గజారూఢుఁడై వైభవముతోడ దుర్గమునకుఁ బ్రయాణమాయెను. ఆసమయమున వయిస్తఖాను హయారూఢుఁడై పరుగునవచ్చి, అంతఃపురము బ్రవేశించునంతలోనే షాజహానుయొక్క శాస్త్రాదులజాతి స్త్రీఘటు

...యెను. ఆ రాజధానియం దుండి సేనలు సమకూర్చు ...ని షూజాపై దాడివెడలిన తన కుమారుఁడు సులే...ను అరుదెంచువఱకు వేచియుండి, యపు డౌరంగ...బును దాఁకవలయునని యాతఁ డేర్పఱచుకొనెను. ...రా తదుచితప్రయత్నము లొనరించెను.

కాని ఔరంగజేబుతోడి వ్యవహార మసాధారణ...వది. అంత శీఘ్రముగ నాగ్రానగర మాతని యధీన...గునని దారా యనుకొన లేదు. ఆ వార్త తెలిసినంతనే ...భ్రాంతుఁడై యాతఁడు తదనవసరకార్యాలోచన...నరించెను. ఆతని సేన యల్పమగుటచేత నపుడే ...రంగజేబును నిరోధింపఁగడంగుట యసంబద్ధము, ...ంధనము. కాని, దారాకుమారుఁడగు సులేమాను ...జాను జయించి ౨౨౦౦౧ సేనతోడఁ దూర్పున ...డెను. కాన నటుఁ బోలె దుర్భేద్యమగు సల్హాబాదు ...ర్గమున విడిచి, షూజాసాహాయ్య మపేక్షించి యౌరం...బును దాఁకవలయునా? కాని, షూజా దారా...వు; అతని శత్రునిచే నోటువడిన షూజా ద్విగుణీ...క్రోధముతోడ ఘూర్ణిలుచుండును. అట్టివాఁడు ...రంగజేబునకుఁ దోడ్పడుట సహజము. కావున ...ను పంజాబుదేశమునకుఁ బోవుట వాంఛనీయమని ...చి, యౌరంగజేబును దప్పించుకొని తను లాహోరు ...మునఁ గలియవలయునని తనకుమారునకు దారా ...సెను. పంజాబాతని రాష్ట్రము; తత్పాలకుఁడు విశ్వ...రుఁడు; లాహోరు దుర్గమునందుఁ గోటిరూప్యము..., రణోపకరణము లధికముగను కూడఁ గలవు. ఆ ... యోధజనావాసమగుటవలన సేనాసంపాదము ... సులభము. కాని సర్వము లారంభమగుసేని ...ణ మసాధ్యమగును కావున, నొకనాఁ డటిన ...హ్రము ఢిల్లీయందుండి, పాదుషా జ్యేష్ఠకుమా...కుఁడు పదివేలసైన్యముతోడఁ బంజాబునకుఁ బలాయన మొనరించెను.

ఔరంగజేబు ౧౩-వ తారీఖున నాగ్రానగరము నుండి బయలుదేఱెఁగదా. దారా ఢిల్లీనగరము వీడిన వార్త రెండుమూఁడు దినములలోఁ దెలియవచ్చెను. తద నంతరమే మురాదు బందీకృతుఁడాయెను. తాను దారానే వెన్నాడవలసిన యవసరము లేదని యోఁచి, బహదూరు ఖాను అనువాని నందులకు నియోగించెను. ప్రసిద్ధమగు సల్హాబాదదుర్గాక్రమణమునకు వేఱొకని నంపెను. మిగిలిన సేనయంతయుఁ గొంతకాలము విశ్రాంతి గాంచెను.

అట్టివిశ్రాంతి యౌరంగజేబునకుఁ గడునవసరమై యుండెను. ప్రభుత్వనిర్వహణము సులభసాధ్యము కాదు. షాజహానుతోఁ బాటు నాతని ప్రభుత్వము శిథిలమాయెను. ఔరంగజేబు నూతనప్రభుత్వనిర్మాణ మొనరింపవలయును. లేదేని దేశమంతట నరాజకము ప్రబలును. అతఁడు ప్రజావిశ్వాసపాత్రుఁడగును. కాన నాతఁడు రాజ్యాధికారము ప్రత్యక్షముగ సహించి యథా రాజ్యపాలన మొనరింపవలయును. తాను షాజహానును బంధించి, యింకను వ్యాజరహితముగ మెలంగఁ జాలుట యసంబద్ధము. ఔరంగజేబు శీఘ్రముగఁ గిరీటధారణ మొనరించి సామ్రాజ్యపాలన మొనరించుటయే యుక్త నవశ్యకర్తవ్యము *.

కార్యసాధకుఁడగు నౌరంగజేబు ఆడంబర మపేక్షింపఁడు. అప్పు డవకాశముకూడను లేదు. కావున జ్యోతిష్కులేర్పఱచిన సుముహూర్తమున ఢిల్లీనగర సమీపమున నామహాశూరుఁడు నిరాడంబరముగా సింహాసన మారోహించి అలంగీరు పాదుషా, గాజీయను బిరుదములు దాల్చెను.

---

*Cf. "At last the time had come for Aurangazib to throw away the mask and ...y realise his long-cherished ambition. The gaoler of Shah Jahan could not pretend ...e was only conductnig the administration as that Emperor's faithful servant ...bedient agent........"

J. N. SARKAR.

...్లోహసకూ? నాగరికం నాగరికం అంటారే. ...్రం ఫీజు ఏర్పాటు లేని నాగరికం ఏమి నాగరికం? ...లంలో దేనివల్ల డబ్బు వస్తుందో అదే పనికొచ్చేపని. ...ాని పని వ్యర్థం. అందుచేత మనము చేసే పను ...లటినుంచీ డబ్బురాబట్టడానికి మనం ప్రయత్నం ...ఉండాలి.

...ట్లాగంటే,

"శాస్త్రులుగారూ! ఏకాదశి ఎప్పుడండీ" అంటే "అర్ధణా"

"లేలు కుట్టింది పంతులుగారు! మందు ఉందా" ...ే ఫీజు "పావలా"

"పంకాయలు వీశె ఏలా పుచ్చుకొన్నారు బజా...?" అంటే ఫీజు "కాసు"

"టైమెంతయిందండీ" అంటే "అర్ధణా"

"క్లైంస్టేషనుకు దారి ఇదేనా" అంటే ఫీజు ...ా"

"ఈవేళ విశేషా లేమిటండీ" అంటే ఫీజు "అర్ధ...ాయి"

"ఈవేళ మీటింగు ఎప్పుడండీ" అంటే "అణా"

"అంతా బాగున్నారా" అంటే ఫీజు "బేడ"

ఈవిధంగా ఫీజు ఏర్పాటుచేసుకొని పుచ్చుకో... మంచిది. "విరోచనాలకి ఒకమాత్ర ఇవ్వండి ...రుగారూ" అంటే ఆయన తాహతుననుసరించి ..., బేడో, పావలో మాత్రకు పుచ్చుకొంటూన్నట్లే ...ూ పుచ్చుకోవచ్చును. ఇందులో ఇంకో రహస్యం .... కొందరు బుద్ధిమంతులు సర్వసాధారణముగా ...క్కి తెలిసిన, తెలియవలసిన విషయాలనుగురించి ...లు వేస్తూఉంటారు. అటువంటి ప్రశ్నలకు సమా... చెప్పవలసివస్తే ఫీజు ఎక్కువగా పుచ్చుకోవడం ...జమే అని చెప్పనక్కరలేదు.

"అమృతాంజనం తలనొప్పికి మంచిమందేనా" ...టే ఫీజు "పదిరూపాయలు"

"కవిత్వం చేసేవాళ్లకి ఉద్యోగాలు ఎందుకు దొరకవండీ" అంటే ఫీజు "అయిదురూపాయలు"

"ఇంగ్లీషు చదువుకొన్నవాళ్లకి ఇంగితజ్ఞానం ఉండదా" అంటే ఫీజు "ఇరవైరూపాయలు." "మీరు సిగరెట్లు కాలుస్తారా" అంటే ఫీజు పాతికరూపాయలు.

అయితే కొందరికి తమకు తెలిసిన విషయాలు ఇతరులకు అమ్మడం అధర్మంగా తోచవచ్చును. ఈకాలంలో ప్లీడర్లు డాక్టర్లు ఉపాధ్యాయులు, సంగీతపాటకులు, నాటకాలవాళ్లు, చిత్రలేఖకులు ఇత్యాది అందరూ ఈవ్యాపారమే చేస్తున్నారు కాబట్టి ఇందులో తప్పేమిలేదు.

ఇదిగాక మనపాలకులయిన ఇంగ్లీషువాళ్లు మనకు అనుకరణప్రాయులు కాబట్టి వాళ్లు ఇలాంటి పనులు బాహాటంగా చేస్తున్నారు కాబట్టి మనమూ వాళ్లను చూచి నేర్చుకోవచ్చునుగదా! యథా రాజా తథా ప్రజా అనే ఆర్యోక్తి ఉండనే ఉంది!

ఇక ఓట్లు ఇచ్చినందుకు తాహతుననుసరించి ఉప్మా, ఇడ్డెనులు మొదలుకొని వందలకొద్ది రూపాయలు ఫీజు పుచ్చుకొనడము దేశాభ్యుదయము సూచకమని వేరే చెప్ప నక్కరలేదు.

ఆదాయము వృద్ధిచేసుకోవడమే పరమావధిగా పెట్టుకొన్న గవర్నమెంటువారికి దివిన్యూ వృద్ధిచెందే మార్గాలు సూచిస్తున్నాను. ఇటువంటి పరోపకారం గవర్నమెంటువారికి నేను చేస్తూఉన్నందుకు నాకు ఒక రావుబహదరో దివాన్ బహదరో బిరుదు వారు దయచేస్తారని ఆశించుకొని ఉండడం అత్యాశ కాదని బుద్ధిమంతు లూహించుకొందురు గాక! ఒకవేళ అటువంటి బిరుదులు ఇటువంటి సందర్భాల్లో ఇవ్వడం సమంజసం కాదని వారికి తోచినట్లయితే అధమపక్షం ఒక కమీషనకమేనా దయచేస్తారని అనుకొంటున్నాను. తరువాత వారి చిత్తం నాభాగ్యం. ఇక నేను సూచించే మార్గాలేమిటంటే:

. దేశములో ఈ కాలములో కవులూ, నవ
లూ, కథకులూ మొదలైన గ్రంథకర్తలున్నూ,
బుక్కులు మాత్రమే వ్రాసే గ్రంథకర్తలున్నూ
ంగా వృద్ధి చెందుతున్నారు. వారి పుస్తకాలు
చడానికి ప్రత్యేకంగా కొన్ని కంపెనీలు ఏర్ప
ఆ కంపెనీల దగ్గిరనుంచిన్నీ, గ్రంథకర్తల దగ్గి
న్నీ సులభముగా పన్ను వసూలు చేయవచ్చు.
రివిన్యూ వృద్ధిచేసుకోవచ్చు.

. నల్లమందు, కల్లు, సారాయి, గంజాయి
న వస్తువుల తయారు, అమ్మకము విషయమై
ంటువారు పన్నులు విధిస్తున్నారు. సంఘ
చేసేవాళ్ల అపకారం కలుగుననీ, పన్నులు విధించి
ష్టముగా పనిచేసినట్లయితే ఉపద్రవము శాంతిం
ప్రజలు బాగుపడుదురనీ వారు అనుకోవడము
యముగానే ఉన్నది.

ఈ విధముగానే సంఘమునకు ఉపద్రవము కలి
ంకో సమస్య వారు పరిష్కరించి రివిన్యూ వృద్ధి
చ్చు. మనదేశములో ఇప్పుడు ఏదేశములో
ంతమంది బిచ్చగాళ్లు ఉన్నారు. ఇంటింటికీ
న్న జాతుల బిచ్చగాళ్లే గాక రైళ్లను ఆశ్రయించు
వాళ్లూ, తీర్థాలను ఆశ్రయించుకు బతికేవాళ్లూ,
బస్సుల నాశ్రయించుకు బతికేవాళ్లూ అనేక,
టున్నారు. ఇది గాక తను అంధత్వమునో
టికో, తన కురూపమునో జీవనాధారముగా
ని బతికేవాళ్లున్నూ, అనాదిగా వంశపరం
బిచ్చమెత్తడమే వృత్తిగా గలవాళ్లున్నూ,
చెప్పడము సోదెచెప్పడము మొదలైన తమ
జీవనాధారముగా పెట్టుకొని బిచ్చమెత్తే
లక్షలాది గలరు. వీరు గాక కొందరు బిచ్చ
ముకు సేవ చేయుటకుగాను కొందరు నౌకరులను
చేసుకొని, తాము ఏ బండిలోనో కూర్చుని
రులచే ఆ బండి లాగింపించుకొంటూ ఊరూరూ
చ్చమెత్తుకొంటూ తమ నౌకరులకు ఒప్ప
గా లిస్తూ కాలక్షేపం చెయ్యడం కూడా కద్దు.

ఇంతమంది బిచ్చగాళ్లు మనదేశంలో ఉండి దాన తత్పరులకు పుణ్యము సంపాదించి పెట్టుతూ స్వర్గద్వారకవాటాలు వదలిస్తూ ఉండగా వీరినిగురించి ఇంతవరకూ ఎవరూ పరిశోధనలు జరుపకుండడము చాలా శోచనీయమైన విషయము. తత్కళంకాన్ని బాపుకొనడముకు గాను మున్ముందుగా ఈ బిచ్చగాళ్ల సంఖ్య ఆదాయవ్యయాదులనుగురించి లెక్కలు తయారుచేయవలసి ఉన్నది. ఈ కార్యమును డబ్బులేని పరిశోధకులు పూనుకొని పని చేయడము కష్టసాధ్యము కాబట్టి దొరతనమువారు ఒక కమీషన్ ఏర్పాటుచేస్తే బాగుంటుంది. ఆ కమీషన్‌కు ఇంగ్లాండు దొరలు పదిమందినీ, ఇండియాలో ఒక బ్రాహ్మణున్నీ, అయిదుగురు బ్రాహ్మణేతరులూ, ఒక మహమ్మదీయున్నీ, ఒక క్రైస్తవున్నీ, ఒక సోదరీమణీ ఉంటే బాగుంటుందని తోస్తుంది. ఈ కమీషన్‌కు చైరుమనుగా ఒక ఇంగ్లాండు దొరను ఏర్పాటుచేయవచ్చును. ఇందుకుగాను నాలుగులక్షలరూపాయలు గవర్నమెంటువారు బడ్జెటులోనుంచి శాంక్షను చేస్తారని నమ్మకము. ఈ కమీషన్‌కు గవర్నమెంటువారు అన్ని సదుపాయాలూ చెయ్యాలెను. పోలీసు వీరికి సహాయము చెయ్యవలెను. రైల్వేకంపెనీవారు ప్రత్యేకముగా వీరికోసం కొన్ని బళ్లు నడిపించవలెను. వీరు హిందూదేశం ఆసేతుహిమాచలమూ సంచరించి అందరు బిచ్చగాళ్ల సాక్ష్యమూ పుచ్చుకొని, తరువాత వారందరూ సంప్రతించుకొని ఒక స్టేటుమెంటు ప్రకటించవలసి ఉన్నది. దానిలో ముఖ్యముగా బిచ్చగాళ్ల ఆదాయవ్యయపట్టికలూ, వారివారి వర్ణాదులు, వారివారివిద్యలూ, జబ్బులూ, వారినివాసములు మొదలైనవిషయము లుండవలెను.

తరువాత గవర్నమెంటువారు ఈవిషయములన్నీ పరీక్షించి బిచ్చగాళ్లమీద పన్ను విధించవలసి ఉన్నది. పన్ను విధించేటప్పుడు మాత్రం గవర్నమెంటువారు బ్రాహ్మణబ్రాహ్మణేతరసమస్యా, హిందూమహమ్మదీయ సమస్యా నిమ్నజాత్యుద్ధరణ సమస్యా మొదలైన సమస్యలు మనస్సులో పెట్టుకొని బ్రాహ్మణులకు ఎక్కువగానూ, బ్రాహ్మణేతరులకు తక్కువగాను, నిమ్నజాతులకు మరీ తక్కువగానూ పన్ను విధించ

# పాణిని: బౌద్ధసన్న్యాసినులు

కీ. శే. కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు

ఆంధ్రవిజ్ఞానసర్వస్వమునకు అష్టాధ్యాయిని గుఱించి వ్యాసము వ్రాయుచుండ "పాణిని" లోని ఒకసూత్రము నాదృష్టి నాకర్షించెను. రెండవ అష్టకమున "కుమారశ్రమణాదిభిః" అను సూత్రము [II.1-70] కలదు. కుమార పదము శ్రమణాదిగణముతో చేరి తత్పురుష సమాసమున సమస్తమగును అని యీసూత్రమున కర్థ మని చెప్పుటలో భాష్యకారు లందఱు ఏకీభవించుచున్నారు. శ్రమణా, ప్రవ్రజితా, కులటా, గర్భిణీ, తాపసీ, దాసీ, బంధకీ, అధ్యాపక, అభిరూపక, పండిత, పటు, మృదు, కుశల, చపల, నిపుణపదములు శ్రమణాదిగణములోనివి[1]. ఈపదము లన్నియు పండ్రెండవశతాబ్దినాటి వర్ధమానుని "గుణరత్న మహోదధి"లోను, ఏడవశతాబ్దినాటి "కాశికావృత్తి"లోను పేర్కొనబడినవి. ప్రాయికముగ తొమ్మిదవశతాబ్దినాటిది కాదగు "శాకటాయనవ్యాకరణము"నను, క్రీ. శ. అయిదవ శతాబ్దికి తరువాతిది కాబోలని "జైనేంద్ర వ్యాకరణము"నను ఈపాణినిసూత్రమువంటిదే యొకసూత్రము కలదు. వృత్తిలోను, మహాభాష్యమునను ఈసూత్రమునకు వ్యాఖ్యానము లేదు; అందువలన కాత్యాయన, పతంజలులప్రకారము ఈసూత్రార్థ మేదో తెలిసికొన వీలుకాకయున్నది.

సాధారణముగా ఈసూత్రముక్రింద నీయబడు ఉదాహరణము లివి: కుమారీశ్రమణా కుమారశ్రమణా (కాశికా); కుమారీ చాసౌ శ్రమణాచ కుమారశ్రమణా, కుమారప్రవ్రజితా (గుణరత్నమహోదధి).

ఇప్పుడు శ్రమణాదిగణములో గనబడు పదములు దాదాపుగ అన్నియు గుణరత్న

1 శ్రమణాదిగణమున ఇప్పుడు గనబడు పదునైదుపదములలో మొదటి యేడును స్త్రీలింగపదములు; మిగిలినవి పుంలింగపదములు. కుమారపదము స్త్రీలింగపదములతో చేరి స్త్రీలింగపదముగను, పుంలింగపదములతో చేరి ఉభయముగను (అనగా స్త్రీ,పుంలింగపదముగను) సమస్తమగును. "యేఽత్ర స్త్రీలింగాః పఠ్యంతే శ్రమణా ప్రవ్రజితా కులటేత్యేవమాదయ స్తైః సహ స్త్రీలింగ ఏవ కుమారశబ్దః సమస్యతే, యేతు పుంలింగాః అధ్యాపకోఽభిరూపకః పండిత ఇతి తై రుభయథా ప్రాతిపదికగ్రహణే లింగవిశిష్టస్యాపి గ్రహణ మితి" అని "కాశికా వృత్తి" అనగా కుమారపండితః, కుమారపండితా, కుమారాధ్యాపకః, కుమారాధ్యాపికా అను సమాసము లంగీకృతములైనను కుమారశ్రమణః, కుమారప్రవ్రజితః, కుమారతాపసః అను సమాసములు అంగీకరింపబడవని యర్థము. అభయనంది "జైనేంద్రవ్యాకరణము" (Pandit Edition) లోని ఇటువంటిదే యొకసూత్రము [III. 65]ను గుఱించి వ్యాఖ్యానము చేయుచు అదేవిధముగా వివరించుచున్నాడు: స్త్రీలింగై రుత్తరపదైః స్త్రీలింగః, అధ్యాపకాదిభి రుభయథా సమస్యతే". కుమారపదము ఇటువంటిసందర్భములలో మొదటిపదముగవచ్చునని స్పష్టముగ జూపుటయే ఆసూత్రము యొక్క ఉద్దేశము. "కుమారశబ్దస్య పూర్వనిపాత నియమార్థం వచనం" అని పదమంజరి.

మహోదధి, కాశికావృత్తులలో చెప్పబడినప్పటికిని పాణిన్యాచార్యులవారు ఈసూత్రము వ్రాసినప్పుడు ఆపదునైదుపదములుకూడ ఆ గణములోని కెక్కినట్లు నిశ్చయముగ జెప్పలే మని కొంద ఱనవచ్చును: ఎట్లయినను మొదటి మూడునాలుగుపదములయినను అప్పుడాగణములోని కెక్కియుండుననుటకు సంశయింప బనిలేదు; కావున పాణిన్యాచార్యులవారు ఆసూత్రమును వ్రాయునప్పటికే శ్రమణా, ప్రవ్రజితా పదములు ఆగణమున కెక్కియుండు ననకతీరదు.

వివాహము కానిపిల్లనుగాని లేక బాలికనుగాని సంస్కృతమున కుమారి యందురు. అందువలన కుమారశ్రమణ, కుమారప్రవ్రజిత యనగా అవివాహితయై బ్రహ్మచారిణిగ నుండు సన్న్యాసిని యనికాని, చాల చిన్నతనముననే సన్న్యాసాశ్రమమును స్వీకరించిన బాలిక యనికాని యర్థము. హిందూబాలిక లవివాహితలై యుండుట అరుదు. వారి కెచ్చటను సన్న్యాసము విధింపబడలేదు. అందువలన హిందూశాస్త్రములప్రకారము హిందూబాలిక సన్న్యాసాశ్రమము స్వీకరించుట కవకాశము లేదు. చాలకాలమవివాహితలుగ నుండిన బ్రహ్మచారిణులు కొందఱు ఉపనిషత్తులవలన దెలియవత్తురు కాని ప్రవ్రజనదీక్ష పొందిన స్త్రీలనుగుఱించి మనము వినము.

చాల చిన్నవారుగ నుండగనే ప్రవ్రజితా (పాలి–పబ్బజితా) సంఘమున చేరిన యీకన్యాయోగినులు, 'బాలభిక్షుణులు', బాలసన్న్యాసినులు — ఈకుమారశ్రమణలు, కుమారప్రవ్రజితలు ఎవరు? వీరు బౌద్ధ'భిక్షుణులు' కాక మఱింకెవ రగుదురు? స్త్రీలకు, శూద్రులకు హిందూమతము సన్న్యాసము నంగీకరింపదు. మొట్టమొదటిమాఱు స్త్రీలకు సన్న్యాసాశ్రమపద్ధతిని స్థాపించినవాడు బుద్ధుడే. కావున బౌద్ధవాఙ్మయమున "త్రిపిటకముల"నుండి నేటికాలపు గ్రంథములవఱకు భిక్కుణులు, సమణలు, పబ్బజితలు, భిక్కుణీమఠములు–వీటికి సంబంధించిన సూచనలు గానవచ్చును. నాసిక, కార్లి, అమరావతి శాసనములలో బౌద్ధసన్న్యాసినులీపదములతోనె పేర్కొనబడియున్నారు. తలిదండ్రుల యనుమతితో ఏడుసంవత్సరముల యీడుగల బాలికా, బాలకులు 'శ్రమణేరులు'గ (శ్రమణులుగ తయారుకావలసినవారు) స్వీకరింపబడుచుండినట్లు బౌద్ధగ్రంథములలో గలదు.[2] ఈబాలయోగినులు కుమారశ్రమణ లనబరగిరి. ఇందువలననే పాణినిలో ఒకప్రత్యేక సూత్ర మవసరమయ్యెననుటలో ఆశ్చర్యము లేదు.

హిందూమతము స్త్రీశ్రమణలను, ప్రవ్రజితలను అంగీకరింప దనునావాదమునకుండగల కొన్నియాక్షేపములనుగుఱించి విచా

2. Manual of Buddhism by H. Kern P. 77.

రించెదను. శ్రమణపదము (పుంలింగరూపమున నైతము, బౌద్ధభిక్షువునకు రూఢియైనది. అందు వలన నప్పు డాపదమునకు బౌద్ధసన్న్యాసి యనియే యర్థము. కాని చాల అరుదుగ నైనప్పటికి ప్రాయికముగ బుద్ధునికి పూర్వము కూడ హిందూమత వాఙ్మయమున సన్న్యాసి యనుసాధారణార్థమున ఆపదమునకు ప్రయోగము కలదని నాకు దెలియును. "శతపథబ్రాహ్మణమున" చండాలాః అచండాలాః, శ్రమణాః అశ్రమణాః తాపసః అతాపసః" అని కలదు.[3] "బృహదారణ్యకము"నకూడ ఇట్టిదే యొకవాక్యము కలదు.[4] "వాతరశనా హవా ఋషయః శ్రమణా ఊర్ధ్వమంథినో" అని తైత్తిరీయారణ్యకమున గలదు.[5] ఈపైవాక్యములలో (పుంలింగరూపమున) శ్రమణశబ్దార్థమునుబట్టికూడ ఆశబ్దమునకు హిందువుల దృష్టిలో నీచార్థము రాకపూర్వము అది బౌద్ధశ్రమణులనే సూచించునని చెప్పువారు కొంద ఱుండవచ్చును. ఈసందర్భమున పాణినికి ఆరణ్యకములు తెలియవనియు, అవి పాణిని, కాత్యాయనులకు నడుమనుండు కాలముననే పుట్టిన వనియు కీ. శే. ప్రొఫెసరు గోల్డుస్టకరు అభిప్రాయమని పాఠకులకు జ్ఞాపకము చేయుచున్నాను. కాని (స్త్రీలింగరూపము) శ్రమణ లేక శ్రమణి పదము బుద్ధునికి పూర్వముగల హిందూవాఙ్మయమునకు దెలియరానిది.

రామాయణమున శ్రమణిని పేర్కొన్న సందర్భము కలదని మనకు దెలియును[6]. అచ్చట ఆశ్రమణి శంసితవ్రత, తపోధన, తాపసి, సిద్ధ సిద్ధసమ్మతయని పేర్కొనబడినది. ఆమె శబరి జాతిస్త్రీగ దెలుపబడినది. సన్న్యాసిన్యాశ్రమము ను స్వీకరించిన అగ్రజాతి స్త్రీ యను సాంకేతి కార్థమున శ్రమణిశబ్దమును ప్రయోగింపలేదు ఆమెజాతియే స్పష్టముగ దెలుపుచున్నది స్త్రీలు సన్న్యాసినులు, ప్రవ్రజితలు అగుటకు ప్రాచీనకాలమున హిందూమత మంగీకరించె దని వాదించువారైనను శూద్రులలోని పు షులకే సన్న్యాసులగుటకధికారము లేనప్పుడు హిందూమతబాహ్యలైన స్త్రీలుసన్న్యాసినులు శ్రమణులు, ప్రవ్రజితలు, తాపసులు కావచ్చు నని నిశ్చితముగ జెప్పవీలులేదు. ఇందుకు నేను ప్రమాణములను జూపవలసిన యవసరము దనుకొందును. రామాయణమునందలి శంబు కథయే నేజెప్పు నంశమును విశదపఱచున కావున అడవిజాతిస్త్రీ యొకతె శ్రమణియు తాపసియు నయ్యెనన అది బౌద్ధమత ప్రభా వమువలననే యైయుండవలెను.

అదియునుంగాక రామాయణ రచ కాల మెప్పుడో మనకు నిశ్చయముగ దె యదు. మూలపాఠము చాల పురాత మైనదే, బుద్ధునికి పూర్వపుదే కావచ్చు కాని దానిలో ప్రక్షిప్తము లనేకము లున్న అవి బుద్ధునికి తరువాతికాలపువని మన మె

3. Satapatha Brahmana, XIV. 6, 122.
4. Brihadaranyaka, IV, 3, 22.
5. Ramayana, Aranynkanda, Sarga 73
6. Ramayana, Ayodhyakanda, 109, 34.

గుడుము. తథాగత, నాస్తికనామముల బరగు బుద్ధునిపేరే రామాయణమున గలదు. ఇటువంటివే కొన్ని ప్రక్షిప్తములు మహాభారతమున గూడ గలవు.

ప్రవ్రజితపదము మనుధర్మశాస్త్రము నను[7], వాత్స్యాయన కామసూత్రములందును[8], కౌటిల్యుని అర్థశాస్త్రమునందును[9] గలదు. ఈయన్ని సందర్భములందును ఈయోగినులను తిరస్కారపూర్వకముగ పేర్కొన్న విధమునుబట్టి చూడగా వారు ఎల్లరునసహించుకొను బౌద్ధప్రవ్రజితలేయని స్పష్టపడును.[10] వేశ్య, దాస్యకు నడుపుమిత్రము సాధారణముగ వీరిని అయోగ్యలైన స్త్రీలతోపాటు పేర్కొనుచుండును. స్త్రీలు సన్న్యసిన్యాశ్రమము స్వీకరించుట తమ కపరిచితమైన నూతన విషయముగుటవలనను, ఈ 'భిక్షుణుల'లో గొందరైనను సందేహాస్పద ప్రవర్తనము కలవారని తెలియవచ్చియుండుట వలనను హిందువులు వీరిని ఏవగించుకొనజొచ్చిరి. ఈకారణమున హిందువులు వీరిని గౌరవముగ జూడకపోవుట సహజమే. కాలక్రమమున శ్రమణపదమునకు బిచ్చమెత్తునది, అయోగ్యమైన స్త్రీ, శీలము లేనియందకత్తె యని యర్థము కలిగినది. శ్రమణ శబ్దమునకు వేలువేలు సంస్కృత నిఘంటువులలో నిచ్చినయర్థములలో ఇవి కొన్ని.

కావున పాణిని సూత్రమునందును, గణపాఠమునందును పేర్కొనబడిన శ్రమణ, ప్రవ్రజితలు బౌద్ధసమణులు, పబ్బజితలే యగుదురని నా యభిప్రాయము.

---

7. Manu, VIII, 363.

8. Vatsyayana's Kamasutra, V.P. 69; XXI, P. 234, XXVII, P. 290.

9. Arthasastra of Kautilya (1, 10; 1, 12.)

10. ఎవ్వడైన రహస్యముగ నొక పరివ్రాజికతో మాటాడిన అది మనుప్రకారము గొప్పనేరము కాదు; కానిపస్త్రీతో మాటాడిన నెంతనేరమో ఇదియు అంతే నేరము. ఇటువంటి నేరములకు శిక్ష చిన్నజరిమానాయే (VIII. 363). ప్రవ్రజితశబ్దమును గురించి వ్యాఖ్యానము చేయుచు వ్యాఖ్యాతలందఱు దానికి బౌద్ధసన్న్యసిని యనియే యర్థమని వివరించియున్నారు. యోగ్యలైన స్త్రీలప్రవర్తనము చెఱచుటకు ప్రవ్రజిత లుపయోగపడుదురని వాత్స్యాయనుడు తెలుపుచున్నాడు. వారిటువంటి దుష్టులని యాతడు తెలుపుచున్నను భవభూతి విరచిత మాలతీమాధవనాటకము ననుసరించి ఉదారమైనట్టియు, నిష్కళంకమైనట్టియు ప్రేమగల గుణవంతులకు 'ప్రేమికుల'ను సంధానపఱుచుటలో ఈ 'భిక్షుణులు' ఎంతో యౌదార్యముతోను, త్యాగబుద్ధితోను ప్రవర్తించుచుండినట్లు తెలియును. ప్రవ్రజితలను రాజకీయకార్యములనిమిత్తము గూఢచారిణులుగ నుపయోగింపవలెనని కౌటిల్యుని మతము.




## ఎవరు పెద్దమనిషి ?

ప్రపంచమున నాగరికత హెచ్చినకొలదిని మోసము హెచ్చినది. మానవుడు నేటి నాగరికతా రథారోహణము చేయక పూర్వము దేవతలు వానితో కలసిమెలసి తిరుగుచు ఇష్టాగోష్ఠి సలుపుచుండిరని మనపురాణములును, గ్రీకు పురాణములును సమస్తమును వేనోళ్ల చాటుచున్నవి. నేడుగూడ మహాత్మాగాంధి, టాగూరు, రోమేను రోలాండువంటి పురుషోత్తములు సత్ప్రవర్తనావశ్యకతను గూర్చి పదేపదే చెప్పుచు ఒకవు ఒచ్చెములేని తమ జీవితముల నాదర్శముగ నిచ్చుచున్నను అందరును వానిని అనుసరింప యత్నించుటలేదు. ఈవిషయమున మన యాంధ్రులుగూడ వెనుకబడి యున్నారు. మానమె ప్రాణముగా నెంచి, మానముకొరకు ప్రాణములను సైతము తృణప్రాయముగ వీడిన సత్పురుషులకును, సాధ్వీమతల్లులకును నాటపట్టయినది ఆంధ్రభూమి. అట్టి జననిబిడ్డలగు తెలుగువారెల్లరును సత్ప్రవర్తనలో పేరుపొందినవారై, కార్యదక్షులై, బుద్ధికుశలురై మనవలెనన్న పెద్దమనిషి యనుటకు వలయు గుణసంపత్తి యెట్టిదో తెలిసికొనుట అవసరము. దానినిగూర్చి విపులముగ చెప్పబడ్డవియును, ఇప్పుడు మనలో నిష్కళంక వర్తనులగు కొందరి యభిప్రాయములను పాశ్చాత్యులు కొంద రీవిషయమై యిచ్చిన యుద్దేశముల నీక్రింద బొందుపరచెదను.

### పాశ్చాత్యుల యభిప్రాయములు

౧. ఉత్తమవీరుడు పెద్దమనిషి యనదగినవాడు.

౨. మనుష్యోచితమగు ప్రవర్తన సంస్కృతి కలిగియుండి యీరెండునుగూడ తనయొద్ద నున్నవను చైతన్యమే లేనివాడు.

౩. ఎట్టి యున్నత పదవియందున్నను మర్యాద తెలిసి ప్రవర్తించువాడు.

౪. శాశ్వతినది మానవజన్మ యన్నమాట మరువక వర్తించువాడు.

౫. ధనధాన్యాగారములకన్న విశాలమగు హృదంతరాళము గలవాడు.

౬. ధర్మాచరణమున నిర్భయుడై, ఆత్మవంచన చేయక ఋజుమార్గవర్తనుడై, గౌరవనీయుడగు వాడు. పిల్లలను, వృద్ధులను మర్యాదచేసి దయతో చూచువాడు.

౭. స్త్రీలనందరను గౌరవించువాడును సేవపాదులనందరను సమానముగ మర్యాదచేయువాడును, తనలోపములను గుర్తెరింగి ఇతరులయం దాలోపములను చూచినపుడు వానిని బయల్పరుపక ఊరకొనువాడును.

౮. ధర్మసంరక్షణమున ముందంజయును, శ్లాఘములను బొందుటకు వెనుకంజయును వేయువాడు.

౯. నేను మనుష్యుడనని పిలిపించుకొన యత్నించువాడు.

౧౦. ఉపకారముచేసి మరచువాడును, ఉపకారముపొంది మరువనివాడును.

౧౧. ఎవనినిజూచి అతడు నేనున్నట్లు లేడు, నేనుండవలసినట్లున్నవాడు అనగలమో అతడు పెద్దమనిషి.

౧౨. శీనివలన ఉపకారము ఎందుకు పొందితిమి రాయని విచారింపనవసరము లేనివాడు.

౧౩. ఎవ డందరితోడను కలసిమెలసియుండి యందరికిని తనయొద్ద చనవిచ్చునో వాడు.

## తిక్కనసోమయాజి

క. ఒరు లేయవి యొనరించిన
నరవర యప్రియము తనమనంబున కగు తా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమధర్మపథములకెల్లన్.

తే. చెల్లియుండియు సైరణసేయువాఁడు
పేదవడియును నర్థికి ప్రియముతోడ
తనకు గలభంగి నిచ్చువాఁడు పుణ్య
పురుషులని చెప్పి రార్యులు బుధవరేణ్య.

## వే మ న

ఆ. సాధు సజ్జనులను సంతరించినవాడు
ప్రజల సంతసంబు నరచువాడు
కఱపి శాస్త్రములను కడకు జూచినవాడు
పొదుకొన్న ముక్తిపరుడు వేమ.

## "సు మ తీ" శ త క ము

క. వినదగు నెవ్వరు సెప్పిన
వినినంతనె వేగపడక వివరింపదగున్
కని కల్ల నిజము తెలిసిన
మనుజుడెపో నీతిపరుడు మహిలో సుమతీ.

కం.........................
..............................
అపకారికి నుపకారము
నెపమెన్నక సేయువాడు నేర్పరి సుమతీ.

## భ ర్తృ హ రి

ఉ. ఆపదలందు ధైర్యగుణ
మంచితసంపదలందు తాల్మియున్
భూప సభాంతరాళమున
పుష్కలవాక్చతురత్వ మాజి బా
హా పటుశక్తియున్ యశము
నందనురక్తియు విద్యయందు వాం
ఛాపరివృద్ధియున్ ప్రకృతి
సిద్ధగుణంబులు సజ్జనాళికిన్.

## కూచి నరసింహం పంతులుగారు

మితభాషియు, ప్రియభాషియు,
హితభాషియు, సత్యవాది యితరంబగు జీ
వతతి కుపకార మొనరుచు
మతిగల మానవుడు యోగ్యుడను జాడనదగున్.

## శేషాద్రిరమణకవులు

మానవధర్మము తోఁకగ
పూనికయును, పాపభీతి, భూతహితంబున్,
మానక పశ్చాత్తాపము
నూనిన మనుజుండు పరమయోగ్యుఁడుసఖా!

## చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు

తిక్కనచెప్పిన రెండు పద్యములతోను నేను పూర్తిగా ఏకీభవించుచున్నాను.

## రాయసం వేంకటశివుడు పంతులుగారు

పూజనీయమగు పెద్దతనము, వంశము, ప్రాయము, చదువుసాములు, అర్థవాధికారములు మొదలగు పరిస్థితులవలన ప్రాప్తించునది కాదు. సౌశీల్య సౌజన్యములచే పెంపుగాంచినదియే పెద్దతనము. సత్యమును వచించి, ధర్మమును జరించుట కలవాటుపడినవాడె పెద్దమనుష్యుఁడు. అతడు మనోవాక్కాయ కర్మలయందు పవిత్రత గలిగి, నియమ పూర్వక జీవితమును నొప్పుచుండు వాడు. జనుల యాగ్రహానుగ్రహములకై తాను నమ్మిన సత్యమునుండియు, తా ననుసరించు న్యాయమునుండియు వీసమైన వీడువాడు కాడు. వాని విశుద్ధ సంకల్పములె వాని సత్కార్యములకు నిదాన

ములు. పలికెడి పలుకునకును, చేసెడి చేతకును, అనంత రమైన వ్యత్యాసము లేక మెలంగగలధీరుడు. ఎవ్వనిమనసు నియుకును, వాక్కు సత్యమునకును, కార్యము ధర్మమునకును ప్రమాణముగను, ప్రబలదృష్టాంతముగను పరిగణింపబడునో అతడే పెద్దమనుష్యుడు. అతని వినిర్మలచరితము ఐహికజీవితసారము, ఆముష్మికమార్గ ప్రకాశకముగు గాక!

నిడమర్తి సత్యనారాయణమూర్తి

---

## టాల్‌స్టాయి 'కౌంటు' అయినవిధము

విఖ్యాతచక్రవర్తియగు పీటరు కాలములో టాల్‌స్టాయి వంశమునకు 'కౌంటు' బిరుదము వచ్చినవిధమునుంగూర్చి రష్యాపత్రికయొకటి ఈ విచిత్రకథ నుదాహరించుచున్నది.

జారు (చక్రవర్తిగారి) యంతఃపురద్వారమున ప్రతీహారియొకఁడు నిలచియుండెను. గొప్ప వంశస్థుడొకడు లోపలికి ప్రవేశింపబోగా, ప్రతీహారి "వీలుగాదు. ఎవ్వరికైనను లోపలికి రానీయకు"మని చిన్నతండ్రిగారి యాజ్ఞ" అని అడ్డుపలికెను.

"నేను ప్రభువును. దారితీయుము" అని కోపముతో నా గొప్పవంశస్థుడు ధట్టించెను.

"నా పేరు టాల్‌స్టాయి; నేను సోల్జరును. ఆజ్ఞల నిర్వహించువాడను"అని ప్రతీహారి ప్రత్యుత్తరమిచ్చెను.

ఆప్రభు వంత కొరడాతో సోల్జరును క్రూరముగా కొట్టెను. ప్రతీహారి దుస్తు రక్తముతో ముద్దయయ్యెను.

"సరే మీాయిష్టముచొప్పున నన్ను కొట్టుడు; ప్రవేశము మాత్రము మీకు కలుగదు." అని సోల్జరు చెప్పివేసెను

ప్రభువు దూషించుటకు ప్రారంభించి, తలుపునెట్టుకొనిపోవుటకు బెదరించుచుండగా పీటరు చక్రవర్తి అచటికి కేతెంచెను.

"ఎందు కింతరవ్వ" అని చక్రవర్తి విచారించెను. సోల్జరు చక్రవర్తికెఱిగెను. ప్రభువుకూడ పీటరునకు నమస్కరించి విషయమును తెలియజెప్పెను.

అంతట చక్రవర్తి "ఈ ప్రభువు నీవు నాయాజ్ఞల నిర్వర్తించినందులకై నిన్ను కొట్టినాడు. నాకొరడను పుచ్చుకొని పగతీర్చుకొనుము" అని ప్రతీహారిని ప్రోత్సహించెను.

"చక్రవర్తిగారు విపరీతము పల్కుచున్నారు. కౌంటునిసి తుచ్ఛసైనికుడు" అని ప్రభువు ఆక్షేపించెను.

"సరే నేనతనిని జెనరలు చేయుచున్నాను" అని పీటరుచెప్పెను.

"చక్రవర్తిగారు పరిహాసము చేయుచున్నారు. నేను గొప్పవంశస్థుడను. ఇతడొక నేద్యగాడు" అని ప్రభువు మరల యాక్షేపించెను.

"నే నతనిని కౌంటు(ప్రభువు)చేయుచున్నా"నని చెప్పుచు పీటరు ప్రతీహారివంక తిరిగెను.

"ఇక పని కానిమ్ము; అతఁడు నడువలేనట్లుగా బాదుము. నీసమానుని కొట్టుచున్నావు సుమా!"

సోల్జరు చక్రవర్తిగారి యాజ్ఞను నిర్వహించెను. మరుసటిదినము అతని సైన్యములో జెనరలుగా నియమించినట్లును, కౌంటుబిరుదము నను్గ్రహించినట్లును ప్రకటన అతనిహస్తములం దుంచబడెను. అతని సంతతివాడును ప్రసిద్ధ పురుషుడునునగు లియో టాల్‌స్టాయి ఆ కౌంటు బిరుదమును వదలించుకొనుటకు తన శక్తికొలది పాటుపడెను.

గు. వెం. సు.

---





ఆమి జాన్సన్ కన్య

ఈమె ఇంగ్లాండునుండి ఆస్ట్రేలియాకు—[illegible] మైళ్లదూరము—ఒక్కతెగ విమానముపై ప్రయాణించిన ఆంగ్లయువతి.

---

కీ. శే. ఆచంట సత్యనారాయణ గారు

వీరు బి. యే. పరీక్షయందుత్తీర్ణులయి యమ్ బి. వైద్యవిద్య నభ్యసించుచు, ౧౯౨౦-౧౯౨౧లో సహాయ నిరాకరణోద్యమము రాగానే దేశాభిమానపూరితులై చదువునాపివేసి ఉద్యమమున ప్రవేశించి, కొంతకాలము ప్రచారముచేసి రాజకీయగ్రంథాదులు ప్రకటించి చివరకు ఖద్దరులోనికి దిగిరి. కనిగిరి, కందుకూరు తాలూకా గ్రామములలో ఖద్దరుపరిశ్రమను కట్టుదిట్టపఱుచు నుద్దేశముతో కందుకూరులో స్థిరపడి ఖద్దరువ్యాపారమును సాగించి, తనసర్వస్వమునే కాక నిరాడంబరమైన ఆదేశసేవలో తుదకు తనప్రాణమునుగూడ ఆహుతిగ నిచ్చిరి.

---

## విరహిణి

గోపరుండు (కవితాసమితి)

నవనవోన్మేష సంధ్యారాగ విస్ఫూర్తి
కాళయామినిలోన కలిసిపోవుచునుండె
విహగసీమంతినీ విమలగీతరులెమ్ము
నిశ్శబ్దతమసాన నీరవించుచునుండె.
నాసుధానిధి వచ్చునా
ఈరేయి
నాజీవితము నిల్చునా?

ఈనీలిసౌధాన ఈమెయిలు తెరలోన
ఒకులు చొరరాని ఈపరసప్రదేశాన
తనకోసరమెపుట్టి తనకోసరమె మురసి
చిక్కి-సామైన ఈచిరుతారక నొకింత
కరముకరమున జేర్చునా
నారాజు
కౌగిలింతల దేల్చునా?

---







### శ్రీమతి ఆనందరావు సతి గారు

చెన్నపురమున గౌరవన్యాయాధికారిణిగ నియమింపబడెను. వ్యవసాయశాఖలో డిప్యూటీ డైరెక్టరుగ నున్న రా. బ., డి. ఆనందరావుగారి సతి యీమె.

---




### శ్రీమతి వెంకటరమణమ్మ

శ్రీయుతులు హరి సుబ
సంక్షిప్త లేఖనము నభ్యసించి
ఆంధ్రయువతి. స్కూలుఫైనలువరకు
హిందీ సంస్కృతముల చక్కనిజ్ఞానమును
కుట్టుపనిలోను ఈమెకు మంచి సామర్థ్యము గ

---



# పునర్విమర్శనము

## మనుచరిత్ర రచనాకాలము

యస్. వెంకటరమణయ్యగారు

'శ్రీ కాసుల శాసనకాలమైన ౧౧-౨-౧౫౧౮ తేదీ తర్వాతను, అమ్మూరు శాసనకాలమైన ౬-౧౧-౧౫౧౯ పూర్వమునను (పెద్దన) మనుచరిత్ర రచించి రాయల కంకిత మిచ్చియుండును." అని శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారు ప్రమోదూత సంవత్సరాదిసంచికయందు వ్రాసియున్నారు. ఈ సిద్ధాంతమును నిలుపుటకు వారు చూపిన కారణములు రెండు: (౧) "మనుచరిత్రరచనాకాలము నాటికి కళింగదిగ్విజయము పూర్తి కావింపబడెను." పై దిగ్విజయము ౧౧-౨-౧౫౧౮ తో పూర్తికావింపఁబడెను. (౨) "మనుచరిత్రగ్రంథోపయోగ పెద్దనకు ఆంధ్ర కవితాపితామహుఁడన్న బిరుదుకూడ లభించియుండెను." "ఆయన కాబిరుదు మనుచరిత్ర రచియించిన తరువాతనే వచ్చియుండునేకాని తత్పూర్వము కానేరదు." కోకట శాసనములలో పెద్దన్నగారి కాబిరుదున్నట్లు చెప్పబడలేదు. ఇందులో రెండవశాసనము తేదీ ౩౧-౧౦-౧౫౧౫. ఇతని కీబిరుదు ౬-౧౧-౧౫౧౯ నాటి అమ్మూరు శాసనమునందున్నది. కావున మనుచరిత్ర అమ్మూరుశాసన కాలమునకు పూర్వమునను కళింగదిగ్విజయము ముగిసిన వెనుకను వ్రాయబడెను అని వారనుచున్నారు.

ఈకాలనిర్ణయము సరియైనది కాదు: ఏలనగా, మనుచరిత్రలో కృష్ణరాయల కళింగదిగ్విజయమే గాక ఇతర దిగ్విజయములు గూడ వర్ణింపబడి యున్నవి. చూడుడు:

ద్వితీయాశ్వాసాంతమున,

ప్రళయఘనాఘనఘోష జయానక భాంకృతి భీమ చపేటలుఠ-త్కుల్బరగీ కటకక్షితిరక్షక కన్నడరాజ్య రమారమణా.

అనియు, తృతీయాశ్వాసాంతమున,

"..............యవనక్షోణీధరస్థాపనా, మందీభూత కృపాకటాక్షయశకృన్మాద్యత్కళింగాంగనా బందీగ్రాహవిగాహితోత్తరకకుబ్ధాటీ సమాటీకనా"

అనియు, పీఠికయందు,

" ఆవాడపతి శిరంధర సింధురాశ్యక్షు లరిగాపులెవ్వానిఖరతరాసి, కాపంచగౌడధాత్రీపదం బెవ్వాని కవిజాతుగా జేసునట్టిబిరుదులు"

అనియు వ్రాయబడియున్నది. కావున శ్రీ ఈశ్వరదత్తుగారనుకొన్నట్లు మనుచరిత్రలో రాయల కళింగ దిగ్విజయము మాత్రమే గాక యితరదిగ్విజయములు సయితము వర్ణింపబడినవనుట స్పష్టము. ఈదిగ్విజయము లన్నియు క్రీ. శ. ౧౫౨౦ సం. పూర్వము ముగిసినవో లేదో విచారింతము.

కలుబరిగెను రాయలు జయించినట్లు మనుచరిత్రలో వ్రాయబడియున్నది. ఈ విషయము కృష్ణరాయవిజయమందునుగలదు. రాయవాచకమున కల్యాణ, కలుబరిగెలను రెండు కోటలను ఒక్క దండయాత్రయందే రాయలు జయించినట్లు వ్రాయబడి యున్నది. కలుబరిగె కోట అదిల్ షాహసుల్తానులది. కల్యాణదుర్గము నిజాము షాహీవారిది. ఈతురక రాజుల నోడించి వారి రాజ్యములపై దాడివెడలినప్పుడే పైకోటలను రాయలుపట్టుకొనియుండవలెను.

పై తురకరాజులను రాయలు కళింగదిగ్విజయమునకుపూర్వ మొక్క పర్యాయము కృష్ణగట్టున నోడించినట్లు కృష్ణరాయవిజయము, రాయవాచకము లనుగ్రం

ములవల్ల తెలియుచున్నది*, అసలు కలుబరిగెకోటముట్టడి కళింగ దిగ్విజయానంతరమే జరిగినట్లు పై గ్రంథముల వలననే తెలియవచ్చును.

అదిల్ షాహ, నిజాము షాహులను కృష్ణదేవరాయలు జయించినది ౧౫౧౩లో నని చరిత్రకారులు నిర్ధారణ చేసియున్నను కలుబరిగె కోటముట్టడి అటుతరువాత జరిగెననుటకే యవకాశము కలదు. ఏలయన కల్యాణ, కలుబరిగెకోటలు కృష్ణ కుత్తరమున నున్నవి. కృష్ణరాయలు కళింగదండయాత్రకు పూర్వము కృష్ణను దాటలేదు. ౧౫౧౮లో రాయలు కృష్ణను దాటుట క్షేమకరము కాదని, నదిని దాటు తలంపు విరమించి గజపతివారి రాజ్యముపైకి నడచినట్లు కృ. రా. విజయములోను రాయవాచకములోను స్పష్టముగా వ్రాయబడియున్నది. కావున కలుబరిగెముట్టడి కళింగదిగ్విజయానంతరము, అనగా, ౧౫౨౦కి తరువాతనే నడచెననుట సమంజసము. కృష్ణరాయలు విజాపురసుల్తానగు అదిల్ షాను పరాజితునిజేసి కృష్ణాతుంగభద్రలకు మధ్యనున్న రాష్ట్రమును స్వాధీనము జేసుకొని, తరువాత కొంతకాలమునకు కలుబరిగెను ముట్టడిచేసి వశపఱచుకొన్నట్లు పోర్చుగీసు చరిత్రకారుడగు న్యూనిజు వ్రాసియున్నాడు. న్యూనిజ్ చెప్పిన యీ అదిల్ షా పరాజయము ౧౯-౫-౧౫౨౧లో నని సూయల్ గారు నిర్ధారణ చేసియున్నారు. కాబట్టి కృష్ణరాయలు కలుబరిగెను ౧౫౨౧లోనో, తరువాతనో ముట్టడించి యుండవలయును. ఈ విజయమును పేర్కొను పెద్దన్నగారు తమ మనుచరిత్రను రాయలకు ౧౫౨౧లోనో అటుతరువాతనో అంకిత మిచ్చియుండవలయును.

మనుచరిత్రలో వర్ణింపబడిన యీ చరిత్రాంశములవల్ల నైనను ఆగ్రంథము అంకితకాలమే కాని—అది రచనను సూక్ష్మముగ కాదు—తద్రచనాకాలము నిర్ణయించుటకు వీలుపడదు.

ఇక, మనుచరిత్ర వ్రాయుటవల్ల పెద్దనకు "ఆంధ్రకవితాపితామహ" యన్న బిరుదువచ్చె ననుట నిరాధారమైనవ్రాత. పెద్దనగారు సంస్కృతములోను తెలుగులోను పెక్కుగ్రంథములు వ్రాసినట్లు తెలియుచున్నది. రాధామాధవమును వ్రాసినందుకు సంతసించి, యల్లయకవికి 'రాధామాధవుడను బిరుదునిచ్చినట్లు రాయలు పెద్దన్నగారికి మనుచరిత్రము వ్రాసినందుకు "ఆంధ్రకవితా పితామహు" డన్న బిరుదు నిచ్చినట్లు కానరాదు. "మనుచరిత్రం బందుకొను వేళ పురమేగఁ బల్లకి దనకేల బట్టియెత్తె" అని గొప్పగా చెప్పుకొన్న పెద్దన్న తత్సంభ్రమవచనమునకు సంతసించి రాయలు తన కాంధ్రకవితాపితామహోయన్న బిరు దిచ్చినట్లు చెప్పుకొనలేదు. ఎల్లప్పుడును తన్ను 'ఆంధ్రకవితాపితామహా' యని రాయలు పిలుచెడివాడని మాత్రమే చెప్పుకొన్నాడు. కావున "ఆంధ్రకవితాపితామహ"యను బిరుదు మనుచరిత్ర రచనాకాల నిర్ణయమున కంతగా తోడ్పడదు.

---

* ఈ విజయానంతరమే రాయలు కలుబరిగెను జయించెనని యింతకు పూర్వము నేను వ్రాసియుంటిని. అది తప్పు.




## షేక్స్పియర్స ఒథెల్లో అను విషాద విజయసేన

ఇది విషాదాంతమగు నయిదంకముల నాటకము. ఆంగ్ల భాషయందు సుప్రసిద్ధమగు 'ఒథెల్లో' యను నాటకమున కిది యాంధ్రానువాదము. గ్రంథకర్త పేరు భట్ల సదాశివరావుగారు. గ్రంథము డెమ్మీసైజున ౧౨౩ పుటలు. వెల ఒకరూపాయి. ఇందలి నాందీప్రస్తావన యందు గ్రంథకర్త సూత్రధారునిచేతతన్ను గూర్చి 'నాట్య కళాలోలుపుడై బాల్యమునుండియు శ్రమింపదుచు రంగస్థల పరిచయము కలవాడనియు' 'నాటకవాఙ్మయమునం దీకృతికర్తపేరిది పెట్టబడకుండుట కిదియే ప్రథమ ప్రయత్న'మనియు చెప్పించుకొనెను. దీనికి విరుద్ధముగా గ్రంథకర్తగారు పుస్తకముతోనుంగల తమ 'విజ్ఞాపన'లో సీతాకల్యాణమను నాటకమొకటి ౧౯౩౩ సంవత్సరమున వ్రాసితినని చెప్పుకొనుచు 'ఇదియే నాకుఁ గల నాటకరచనయందలి ప్రథమప్రయత్నము' అని వ్రాసికొనిరి. ప్రస్తావనబట్టి యీవిషాదవిజయసేనయే వీరి ప్రథమ యత్నమో, విజ్ఞాపనను బట్టి యంతకన్న ప్రథమప్రయత్నము సీతాకల్యాణమొకటి యున్నదో, కాక యీరెండు నాటకములనుగూడ తమ ప్రథమ ప్రయత్నములుగా పాఠకలోకము భావింపవచ్చునని గ్రంథకర్తగారి యభిప్రాయమో! విషాదాంతనాటకము లాంధ్రవాఙ్మయమున మిక్కిలి తక్కువగా నున్న వనియు ఆకొఱతను చాలవఱకీవిషాదవిజయసేనము తీర్చుచున్న దనియు "నటభూషణ" బిరుదాంచితులగు నొక నాటకకళాభిమాని కవిగారిని మిక్కిలి ప్రశంసించుచు యీనాటకమునకు దీర్ఘమగు నుపోద్ఘాతమొకటి వ్రాసెను.

"అనువాదమునందు కవి మూలగ్రంథమందలి కథ ప్రధానవిషయములను, పాత్రపోషణమును దీసికొని దే కాలపాత్రముల ననుసరించి తాను వ్రాయుగ్రంథమున సె మార్పులైన జేయ స్వతంత్రుడు. * * * ఒథెల్లో పోలికగలట్టి కథావిధంబు జేగ్గొని, మూలమునందలి క పాశ్చాత్యనాగరికతాచారముల గలిగినదగుటచే న యాచారముల దెల్పు విషయములందు మి నేర్పుమై మార్పుల గలిగించి హిందూదేశ సాంప్ర దాయముల కనుగుణంబుగ గథ యుండునట్టుల యనువాదము గావించిరి, కావున వీరినాటకము 'అవ బనము' (Adaptation) అగునుగాని 'భాషాంతరీక రణము' (Translation) కానేరదు." అని ఉపోద్ఘా మున గలదు. వారు సెలవిచ్చినట్లు గ్రంథకర్త య గ్రంథమును రచించియుండినయెడల నదిమిక్కిలి శ్లాఘ పాత్రమేకద! అట్లయినయెడల 'షేక్స్పియర్స ఒథెల్లో' అను పేరునుగూడ నీ గ్రంథమున కుంచుటెందులకు? వట్టియజాగళస్తనసమానమైన యీగ్రంథనామము కేవ లంకారమాత్రముగా నుండవచ్చునని వీరు భావింతురా? ఆంగ్లగ్రంథమున గల 'అయాగో' అను వానిని 'అర గుడు' అని పక్కికి మక్కిగా హైందవ సాంప్రదా విరుద్ధమైన రూపమునందే కొనివచ్చుటెందులకు 'అర గుడ'న్న పేరు గలవాఁడీ విశాలభారతవర్షమున నే క ముందైన నెక్కడైన నుండుట కవకాశమున్నదని చెప్పగలరా? ఇక పాత్రపోషణమును గమని చోయినచో నిందలి పాత్రలన్నియు దేశకాలపాత్రము బట్టి రూపభేదములను ధరించిన సుప్రసిద్ధ మాలు ఆంగ్లశార్దూలముల జూచి వాతలు వేసికొ తెలుఁగు నక్కలవలె యనుకూలాంకు పోలికలబా

యున్నవి కద! అనువాదకుఁడు కథను పాత్రలను దీసికొని యెట్టిమార్పులైన జేయ స్వతంత్రుఁడని యూహించి కాఁబోలు నీగ్రంథకర్త ఆంగ్లగ్రంథమునలేని విచిత్ర సన్నివేశములను, క్రొత్తక్రొత్త రంగములను నాటకమునందు బలుచోట్ల సంఘటింపజేసెను. ప్రథమాంకము నందలి ప్రథమరంగమున కథానాయకుఁడగు విజయసేనునకు రాజు (The Duke of Venice in Othello) తన కృపాణమును బహుమానమిచ్చి సత్కరించునఁట! అతఁడు విజయసేనునిఁగూర్చి ప్రశంసించి

"సభ్యులెవ్వరైన నీసన్మానవిషయమై యేమేని ముచ్చటింపఁదలఁచినచో సభ వేగమే ముగియును గావున మాటలాడవచ్చును." అని పల్కునఁట! ఇది యెంత భావశూన్యముగ, నసంబద్ధముగ నున్నదో చూడుఁడు! కథానాయకున కిచ్చు సన్మానవిషయమై సభ్యులు ముచ్చటించుచు గూర్చున్న యెడల సభ వేగమే ముగియుటెట్లు? గ్రంథమున మూలమునందు లేక నడుమ నడుమ దెచ్చిపెట్టిన పాత్రల సంభాషణ వైఖరు లన్నియు నిదేరీతినున్నవి. గ్రంథకర్తగా రీయనువాదమున సర్వతంత్ర స్వాతంత్ర్యమును దీసికొని పూర్వాపర సందర్భవిరహితముగా మూలగ్రంథమునందలి యుత్కృష్టకథావిధానమును చేజేతుల భగ్నమొనర్చియు, పాడుచేసియు, కడతేర్చియు ఆంధ్రుల నేటి భాషావిషయిక పరివర్తనములు పరశురామప్రీత్యర్థములని కొందఱు విద్యాధికు లాడుకొను పల్కులు సత్యము గావించిరి. ద్వితీయరంగమున కథానాయిక మన్మథాజ్ఞాపరతంత్రయై తన మనోహరునియందలి విపరీత మోహమున మన్మథదూషణమును, చంద్రాద్యుపాలంభనమును జేయుచు కొంతసేపాడుచు, కొంతసేపుపాడుచు నిట్టూర్పులు నిగుడ్చుచు మదపుఁ బిచ్చియెత్తినదానివలె రంగస్థలమున తాండవించును. ఆమె యొక చెట్టును విజయసేనుఁడని భ్రమించునఁట!

"మనోరమణా! నీకేల కరుణ కల్గదు! మానధనా! ఏల దరికి రావు? ఇంతకువచ్చి నపుడేటి పరిహాసము? ఇపుడేల యీ పరాఙ్ముఖము." (ఒక చెట్టును విజయసేనుఁడని భ్రమించి, కౌఁగిలించి, పారవశ్యమునఁ గ్రిందఁ బడును.)

ఈ మన్మథదూషణావేశ కథనమున రంగస్థలమునఁ గైన మహోత్పాతము మూలగ్రంథమున నెచ్చటను లేదు. మూలగ్రంథమును చదివినవారికి ఆంగ్లపౌరస్త్యతాకాళిమున నప్రమేయదేదీప్యమానగుణసంపన్నయు, నిరుపమానదివ్యతేజోభిరామయునగు 'డెస్‌డిమోనా'ను పట్టి కామాతురచిత్తగా మొదట రంగస్థలమునకు తెచ్చిన యీ శీలవతికిని గల భేదము విశదము కాఁగలదు. ఆంగ్లనాటకమున దోఁచు 'డెస్‌డిమోనా' మన్మథోన్మాదమున శీలవతివలె ప్రవర్తించిన నది యసంభవకార్య ఘటన కంత రసాభాసమో విజ్ఞులూహించెదరు గాక! సుప్రసిద్ధకవిసార్వభౌముఁడగు షేక్స్పియరు కృతులైన నాటకరాజము లన్నియు మన భాషకు బరివర్తన మొందవలసి యున్నవి. ఉభయభాషాప్రవీణులగు విద్వత్కవు లట్టి పనికి బూనుకొని ఉదాత్తరసాన్వితమైన యాతనికృతిగ్రంథముల పండితపామరజనరంజకముగా, హృదయాహ్లాదకరముగా, శ్లాఘాపాత్రముగా మన భాషకు దీసికొని రావలెను. ఆంగ్లపదార్థమోహమున పిడుచకట్టి గడుసువారిన కొందఱి నాలుకలకు ఆంగ్లకట్టములయందలి పదార్థము లేదే రసముల నేదే పాకమునను ఆయాఋతుల నవి పచరింపబడిననే గాని రుచించుట లేదు. ఆంగ్లమునుండి ఆంధ్రభాషకేపదార్థమైన గొనితెచ్చుటయందు గల కష్టనిష్ఠురములం దాకి గెలిచిన యనువాదకుఁడు ఆంగ్లమున నున్న దెల్ల మక్కికి మక్కిగా భాషాంతరీకరించుట కొప్పుకొనుచుండుట లేదు. ఉభయభాషలయందును భావార్థప్రకటనమునఁగల వైపరీత్యవైరుధ్యమే యిందుకు మూలహేతువు. ఇక చరిత్రమునకు ఆచారవ్యవహారములకు దేశకాలపాత్రములకు మూలగ్రంథమునందలి కథాకలాపమును పాత్రోచితవైఖరులకు లెస్సగనను సంధించుచు శ్రీనాథునకువలె "అశేషమునీషిహృదయంగమంబుగా శబ్దంబనుసరించియు, నభిప్రాయంబు గుర్తించియు, భావం బుపలక్షించియు, రసంబుపోషించియు, నలంకారంబు భూషించియు, నౌచిత్యం బాద

రించియు, సనాదిగ్యంబు పరిహరించియు మాతృకాను సారంబుగా మనభాష యందు చెప్పవలెను. ఏకత్కాలాలోవిదులైన పండితకవులీపనికి బూనుకొని ఆంగ్ల వాఙ్మయ క్షేత్రమున బుట్టి మహోజ్జ్వలితర్మ్యాంతమై లోక విస్మయ మొనర్చుచున్న గ్రంథమణి భూషణముల నన్నిటిని కొనివచ్చి మనభాషామతల్లి నలంకరింపవలెను. పూర్వకవులిట్టి భక్తిచే సంస్కృతగ్రంథరత్నముల నుండి విస్మయావహములగు కాంతిపుంజముల వెల్వరించి మనభాష మిక్కిలి ప్రకాశింపజేసి కృతకృత్యులైరి. మూలగ్రంథమునం దనువాదకుఁ డేదేని మార్పులు చేసిన యెడల నది పూర్వోత్తర విరోధము లేకుండ, హర్షదాయకమై శ్లాఘాపాత్రమై రసాభాసమునకు దావీయ కుండ నుండవలెను. ఈవిషాదవిజయసేనమను వ్రాసిన వారీసందర్భమున మిక్కిలి యవివేకమైన మార్పులను జేసిరి. వీరీగ్రంథానువాదమునం దొనర్చిన యనౌచిత్య పరంపరలకు, అనర్థకథాప్రసంగములకు అసంబద్ధార్థ జనితప్రమాదములకు పరిమితి లేదు. కొన్ని ఘట్టములందు వీరుపయోగించిన భాష బాలేంద్రుకల చిక్కువలె నట్టి యగమ్యగోచరమై యున్నది. ఆంగ్ల భాష నెఱుంగని యాంధ్రులకు చదువుటకు, ప్రదర్శించుటకు, పరిగ్రహించుటకు మిక్కిలి దివ్యమైన మహావిఖ్యాతనాటకము మనవారికిక నరయటి పండొలిచి చేతికి నిచ్చినట్లీ యనువాదమున లభించినదని పైయట్టను జూచి కొంత భ్రాంతిపడితిమి కాని పుస్తకమును దెఱచి యిక్కడ నక్కడ చదివి చూచునప్పటికి గ్రంథము మిక్కిలి రసాభాసముగా మూల విరుద్ధముగా, మిగుల మిక్కిలి విపరీతపు పోకడలతో గాన వచ్చినది. మేమందులకు గడువక్కజపడి గ్రంథమంతయు సావధానముగాఁ బరిశీలించి చూచితిమి. "షేక్స్పియర్స ఒథెల్లో అను విషాద విజయసేన" యను గొప్ప పేరున గానవచ్చు నీ గ్రంథము నట్టితప్పుల తడిక. మూలగ్రంథమగు 'ఒథెల్లో' ఎట్టి యనవద్యమైన గ్రంథరాజమో దాని యాంధ్రానువాదమని ప్రచురింపబడిన యీగ్రంథమంత పేలవముగా నీరసముగా నుండుటయే కాక నాటకమున ముఖ్యముగా గోచరింపవలసిన జీవకళ యనునది చెప్పుటను గానరాకుండ

మున్నది. విస్తరభీతిచే నీనాటకానువాదమున పాత్ర
లకు వెంటనే స్ఫురించు గుణావగుణములమాత్ర మింద
చేర్కొంటిమి. (వశేషము)

దివాకరుల సోమసుందరరా

---

## చక్రపాణి

గ్రంథకర్త: చెలికాని సత్యనారాయణగారు.

ఇదియొక చిన్న నిరూపకనవల. ఒకానొక ఆం
కథ ననుసరించి వ్రాయబడినది. అపరాధిగాని, పరిశోధ
డుగాని అద్భుతమైన ప్రజ్ఞగలవారు కారు. సాహసకార
ము లిందేవియు లేవు.

ఇట్టి నవలలకు ఒకేరకమైన పాత్రలు పూర్వ
తయారైనటులున్నది. అందుచే నిరూపకనవలలు పెల్లు
నుప్పతిల్లుచున్నను పాత్రలందు వైచిత్రి మచ్చునకైన
కానరాదు. గ్రంథకర్తలసృష్టి లోకముపై లేదు. ఏఆం
యుడో రచించిన నవలయందు నిమగ్నమై యుండును.

తెనుగున వెలువడు నిరూపకనవలలు పెక్కింటికి
కలకత్తా కార్యరంగము. ఇది కలకత్తా దురదృష్ట మన
యును; ఏలన, యిట్టినవలలను ముఖ్యముగా చదువువా
రకు కలకత్తా యన నపరాధములకు కేంద్రమని తోప
మానదు.

'చక్రపాణి'కి పీఠిక వ్రాయుచూ, పూడిపెద్దివెం
ట రమణయ్యగారు, శ్రీకృష్ణుడు తిరోహితుడైనపు
గోపిక లాబ్యందాసిన సంచారి నన్వేషించు భాగవత
పట్టును ప్రస్తావించినారు. వారి యుద్దేశ్యము స్ప
ముగా లేదు. దానికిని, నిరూపకనవలలకును ముడిపెట్టు
యని తలంపవచ్చును. ఇది విచిత్రములలో విచిత్రము!

(గు. వెం. సు

---

## చారుమతీ మోహనము

శ్రీదొంగ లక్ష్మీనరసింహము గారు రచియించి
అయిదంకముల సాంఘిక నాటకము. ఈనాటకము న
నాటకకర్తకు, సంఘమునకు, భాషకు గలుగు మేల

కంటె కీదు అధికమనుట సాహసము కాదు. ఎవరేని చదువుకొనవలసినదశలో గ్రంథములను రచియింపబూనుట కడుసాహసము. అందును నాటకముల విషయము చెప్ప బనిలేదు.

ఈ క్రిందిపద్యమును చూడుడు.

గీ. "వసుధ విశ్వేశ్వరాఖ్యవరవాస్తవ్యుఁడు
తెల్కపూడి గోత్రకుండును దీనజనుల
శ్రేయము నెగోరు లక్ష్మీనృసింహసుకవి
నాటముగ రచియించె నీనాటకంబు."

ఇది యీ నాటక ప్రస్తావనలోనిదే. ఈకవికి గల కవితాసామర్థ్యమునకు, పాండిత్యమునకు నీయుదాహరణ మొకటియే చాలును. 'X'

--- —

## వేమన

సర్ ఆర్. వేంకటరత్నము నాయుడుగారిచే పోషింపబడి శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారిచే చేయబడిన ఏడుపన్యాసముల కూర్పు ఈ గ్రంథము. ఆంధ్రవిశ్వకళాపరిషద్గ్రంథమాలలోని రెండవ ప్రచురణముగ ఆంధ్రవిశ్వకళాపరిషత్తుచే ప్రకటింపబడినది. వెల రు. 1-8-0

ఈ గ్రంథమున ఏడుపన్యాసములు కలవు. మొదటిది ఉపోద్ఘాతరూపకమైనది. రెండవది వేమన దేశకాలములను గురించినది. మూడు, నాలుగు, అయిదు ఉపన్యాసములందు వేమన సంసారస్థితిగతులు వేమన యోగసిద్ధి, మతప్రచారములు అభివర్ణితములైనవి. తక్కిన రెండుపన్యాసములందును వేమనవంటివారిని గూర్చియు, వేమనకవిత్వము, హాస్యము, నీతులను గూర్చియు తెలుపబడినవి. వేమనసూక్తి రత్నాకరము, వేదాంతసిద్ధాంతము, వేమనపద్యములు (వావిళ్ల వారి ప్రతి), బ్రౌనుదొరగారి వేమనపద్యములు, ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారములోని వేమనపద్యముల ప్రతులు- ఇట్లు వేమనపద్యములు ముద్రితాముద్రిత గ్రంథములను, వేమనపద్యములకుగల వ్యాఖ్యలు, టీకలు అయిన (౧) వేమనపద్య సహస్రార్థ తాత్పర్యబోధిని (౨) తత్త్వార్థబోధిని, (౩) వావిళ్లవారి (వేమనపద్యములకు) ఆంధ్రతాత్పర్యగ్రంథము (౪) వేమనార్యుని పద్యపద శబ్దార్థము (౫) బ్రౌనుదొరగారి ఆంగ్లేయపరివర్తనము— ఈ మొదలయిన గ్రంథములను పరిశోధించి వేమననుగురించిన యీ యుపన్యాసములను చేసిరి. వేమనజీవితమునకును, కవిత్వమునకును సంబంధించిన వివిధ సిద్ధాంతములను చేయుటకు పూర్వము శ్రీ శర్మగారు ప్రథమోపన్యాసమున అసలు వేమనపద్యము లేవి, అతనివి కానివేవి అను విషయమును గురించి యించుక చర్చించి 'గుజిలీ' ప్రతులకన్న 'పరిశోధించి' చేసిన నవనాగరకుల ముద్రణముల"లో "వేమన స్వభావము, మతము, కవిత్వధర్మము, భాష మొదలగువాని నేమియు గమనింపక, వ్రాతప్రతుల పాఠములను విచారింపక, అర్థభావములకు వచ్చు ననర్థమును లక్ష్యపెట్టక, తిద్ది ముద్రించిన పాఠముల"ను కొన్నింటి నెత్తిచూపి, వేమన పద్యసంఖ్యను గురించియు, "విశ్వదాభిరామ వినుర వేమ" అను మకుటమునకు వేలువేలు వ్యాఖ్యలలోను టీకలలోను చెప్పబడిన అర్థమును గురించియు ఇంచుక చర్చించి తుదకిట్లు హెచ్చరించుచున్నారు: "సరియైన విమర్శముతోఁ జేసిన ముద్రణము ఒకటైనను ఈనాఁటికి బైలుపడలేదు. వేమన్నపద్యము లిట్లున్న వేలని తలచినవారే కాని యెట్లుండి యుండవచ్చునని విమర్శించినవారు లేరు. అర్థము తెలియనివారు, అర్థములేని సంప్రదాయములకుఁ జేరినవారు, అనర్థకరమగు అభిమానముకలవారు ఈపద్యములను తలయెుకదిక్కుగా నీడ్చి చెడిచినారు. ఇతరులభావములును, రచనలును మనకెంత యసహ్యముగా నున్నను వానిని దిద్దు నధికార[illegible]మనకు లేదని తలఁచుట మనవారలకు లింకను నేర్వనివిద్య. కావుననే, అందందు కొన్ని యనావశ్యకమైన సవరణలున్నను, చిన్నదైనను ఇప్పటికిని బ్రౌనుదొర ముద్రణమే సర్వోత్తమమని చెప్పుటకు సిగ్గగుచున్నది. అతఁడు మనకుఁ జేసిన మహోపకారము నరగంట చూచుచున్నానని తలఁపకుఁడు. చెన్నపట్టణములోని ప్రాచ్యపుస్తకశాలలోని వ్రాతప్రతుల నొకమారైనను చూచినవారికి తప్ప తక్కినవారి కామహనీయుని యప్పు తెలియదు. కాని యతఁడు దోసిలినిండఁ బెట్టినను,

పెట్టినదెంత మందివస్తువైనను అది విద్యమే. అతని యౌదార్యమును కళనిని పొగడుదము. కాని మనదారిద్ర్యమునకు సిగ్గుపడవలదా? ఇందఱు తిండిదండుగ తెలుఁగువారుండి వేమనవంటివాని విషయమైకూడ ఇంకను తెల్లదొరగారి తిరిపెమునకే చేయొడ్డి బట్టవలసినందు కేడ్వవలదా?"

ఈ యుపోద్ఘాత ప్రకరణమునందే ముమ్మందు "ఇదివఱకెవరును తృప్తికరముగా సమాధానమిచ్చియుండని ఆంధ్రులలోఁగల "కొన్ని విచిత్రములను" పేర్కొనుచున్నారు. అవి యివి: "భరతఖండమున ప్రసిద్ధములగు నన్ని భాషలలోను ప్రకాశించి అసంఖ్యగ్రంథములను వ్రాసిన జైనులు మనభాషలో గ్రంథములు రచించినట్లు కానరాకపోవుట యొకటి; ఆంధ్రభాష ద్రావిడశాఖనుండి చాలనాళ్లక్రిందటే చీలి వేఱుపడినదని స్పష్టముగా నూహింప వీలున్నను పదునొకండవశతాబ్దికి వెనుక సారస్వతవ్యాపారమే యందులో జరిగినట్లు తెలియకపోవుట వేఱొకటి. సంస్కృతవాఙ్మయములో చక్కని నాటకరచన రెండువేలయేండ్లకు ముందునుండి జరిగివచ్చుచున్నను ఆవాఙ్మయమునే ఆధారముగాఁగొని శబ్దము, అర్థము, భావముకూడ అనువాదముచేయుచువచ్చిన యాంధ్రులలో ఒక్కనికైన మొన్నటివఱకు అట్టినాటకములను తెనుఁగునఁగూడ వ్రాయవలయునను నాశ జనించినట్లే తోఁపకపోవుట మఱియొకటి! ఈయన్నిటికంటె విచిత్రమైన విషయము సుప్రసిద్ధమతస్థాపకు లెవరును ఆంధ్రులై పుట్టి ఆంధ్రదేశమున మతబోధ చేయకపోవుట." ఇందుకు "మతమనునది, యొకఁడు తానెఱిఁగినదియు కొకనికిఁ జెప్పి, యతఁడు వినకున్న నీయిష్టమని వెడలిపోవుటకాక, యొకవ్యక్తి యొకసంఘమునకే తత్త్వమును దెలిపి దానిని నాశ్రయించినందుకు గుఱుతుగా వేషము, భాష, ఆచారము మొదలగువానియందు ఆ సంఘమునకంతయు మార్పును గలిగించునదియగుటచే, సహజముగా స్వాతంత్ర్యరక్తియు, స్వాభిమానమును బలముగాఁగల యాంధ్రజాతి గొఱ్ఱెల మందవలె నొకమతపుదొడ్డిలోఁ దోలుట కేతత్త్వజ్ఞానికిని సాధ్యము గాకపోయె నేమో" యనికడపటిదానికిమాత్రము వీరు ప్రత్యుత్తర మిచ్చుచున్నారు. తుదకు "ఆంధ్రులలో మతప్రచారకు లందఱు దఫురూపముగా గలరు కాని మతకర్తలు లేరనియు, ఆ మతప్రచారకులైనను "చాలవఱకు తత్త్వబలము చేఁగాక తా మాశ్రయించిన రాజుల శక్తిబలముచే స్వకార్యమును సాధించి" రనియు వీరు తేల్చుచున్నారు. ఈ విధమున పెనవేసికొనియున్న పెక్కు సమస్యలతో నుపోద్ఘాతప్రకరణము హృదయాకర్షకమై, పాఠకుని తీవ్రాలోచనాపరునిగ దిద్దుచున్నది.

రెండవ యుపన్యాసమున వేమన కాలదేశములను గుఱించి చెప్పవలసివచ్చి చరిత్రకారుని బాధ్యత వీరిపై కొంతపడిన సందర్భమున ఆధునికచరిత్రపరిశోధన, చరిత్రపరిశోధకులు-ప్రాచీనులకు ఆధునికులకుగల వ్యత్యాసము-వీటినిగుఱించి శ్రోతలును, పాఠకులును 'నయముతో డినవ్వను' ఉరికియాడునట్లు సొగసుగ నతిచాతుర్యముతో అయిదుపుటల హాస్యరసగ్రంథమును వినిపించి యున్నారు. గ్రంథమంతటిలోను హాస్యరసమున దీనిని మించిన పట్టు వేఱొకటి లేనేలేదేమో. "వేమనజీవితమును దెలిసికొనవలెనన్నప్పుడు" వారికి "కలుగుకష్టము"ను చెప్పుటకైనను అంతటిగ్రంథమును వ్రాయవలయుట అప్రస్తుతమేమో. గేలి కాకరమైన ఆధునికచరిత్రపరిశోధన ఎంతటి కష్టప్రదమైనదైనను దానిలో వీరిది అందె వేసినచేయి యన్నట్లుగ వేమన జీవితకథను "చెక్కి తీర్చిన చరిత్రకారుని"వలె తీర్చిదిద్దిన వీరి నేర్పరితనము కొనియాడఁదగినది. వేమనపద్యముల నన్నిటిని జదివి, వాటి నాతఁడు ఏవో కొన్ని ప్రత్యేకసందర్భములలో అనుభవము మీఁదగాని వ్రాసియుండఁడని నిశ్చయించి జీవితానుభవపు కూర్పున కూర్పదగిన యా యాపద్యములకు సార్థకతను కల్పించుచు తదాధారమున వీరు వేమనజీవితమును మెలవడితో చిత్రించియున్నారు. వేమన సంసారస్థితిగతులను మూ డ వ యు ప న్యా స ము లో ని విషయ మిదే. వేమనదేశనిర్ణయము విషయమున గల వాదోపవాదములు, భేదాభిప్రాయములు పాఠకు లెఱుఁగనే యెఱుఁగుదురు. అతఁడు సంచరించిన దేశమునుగూర్చియు, సమాధినందిన స్థలమును గూర్చియుకూడ చాల కట్టుకథలును భేదాభిప్రాయములును గలవు. వీటినన్నిటిని విమర్శించి తుదకు అతఁడు "దత్తమండలముల" వాఁడని యూహించుచున్నారు.

అట్లూహించుటకు వారికి "అప్పడట్టివాడుగా గానవచ్చుటయే తప్ప వేరుకారణ మేదియు లేదు." గండికోట నితడు పేర్కొనుట, నందిదుర్గము నితడు చూచుట, కడప జిల్లా, జమ్మలమడుగు తాలూకా ముడియము నను గ్రామములో వేమనశిష్యులపేర ముండుట, ఇట్టి మఠము గండికోటలో నొకటియుండుట— ఇవి యన్నియుకూడ వేమన దత్తమండలమువా డనుటకు వారికి సాధనములు. అదికాక "దత్తమండలములలో వేమన కున్నంత ప్రచారము తక్కినచోట్ల నున్నట్లు కానరాదు. ఇప్పటికిని వేమన్నయను పేరుగలవారీదేశమం దెందరో కలరు" అని వ్రాయుచున్నారు వేమన తన పద్యములలో వాడిన మంకు, తారాడు, సంబళము, సొడ్డు, కళవళము, కూయు, చాడీ, తాళిక, బిత్తిరి మొదలైన "కన్నడసీమకు సమీపమను తెలుగుదేశమందే వాడుకలో"గలట్టియు, ఆకు, పక్క బైసి, పలికి, ఒక్కపొద్దు, పీకు, కుట్లు, పోడు మొదలగు "నల్లమల కివలి వారికి తప్ప అవల వారి కర్థముగువాయని" వారు సందేహించునట్టియు పదములుకూడ వారు తమ నిర్ణయమునకు తోడ్పడగలవనుచున్నారు. వేమన ఒసినిరొంగ్రడను పలుమారు పేర్కొనుటయు, రాయలసీమలో తప్ప ఇతరాంధ్రదేశములలో వారిపేరు వినరాకపోవుటయు వేమన రాయలసీమవాడని చెప్పుటకు మఱియొకకారణము. "ఇక నేయితర స్థలము లందుగాని వేమన నివసించినట్లు ఇంతకంటె ప్రబలములైన సాధనము లుండెనేని" యని వారికి "తెలిసిన వెంటనే, అవశ్యముగా మీయూరికి విచ్చేయుమని వేమన్నను పల్లకీలో మోసి యక్కడికి సాగనంపుటకు నేను మొదటివాడయాగా నిలుతును" అని వీ రనుచున్నారు. కావున వీరితో ఈ విషయమున తగాదా పెట్టుకొనుట మంచిదికాదు. వీరి యభిప్రాయ ప్రకారము వేమన్న ౧౫-వ శతాబ్దియాదియం దుండెను. ఈసందర్భమున వీరిట్లు వ్రాయుచున్నారు. "తాటాకుల పుస్తకముల వయస్సు నిర్ణయించుట కష్టము. గజపతుల కథ, ముత్తమంత్రి మరణము మొదలగునవి వినిరైనను వ్రాయవచ్చును. కాని ౧౭౮౦ లో జరిగిన కటార్లపల్లె పుల్లారెడ్డి తాను వేమన యపరావతారమని చెప్పుకొనుటకును, ప్రజలు, అందున వ్రాతచదువులు రానివారు దానిని నమ్ముటకును వేమన మఱుగుపడి చాల సంవత్సరములైయుండిన సాధ్యముకాదు. కావున ఆవేమన్న సమాధికాలమును, ఈవేమన్న జననకాలమును ఎంత సమీపమందున్న నంత మేలు. కాని, వంగూరు సుబ్బారావుగారు వేమన నెంతపైని కీడ్చిరో నేనంత క్రిందికీడ్చుచున్నానేమో యనుభయము నాకు లేకపోలేదు. వినను మనచరిత్రములెల్ల చాలవరకు ఊహాప్రపంచమునకు జేరినవే కావున, ఇన్ని యూహాజాలములో నాదియు నొకయూహయైయుండిన నంతేమి కరువుకాదను కొనుచున్నాను"

మూడవ యుపన్యాసమున వేమన సంసారస్థితిగతులు, అతని కొన్ని పద్యములనుబట్టి ఇదిఇట్లో నడిచినట్లు వాటికి సార్థకత కల్పించును "చెక్కిన చక్కదనముతో" చిత్రించుచున్నారు. వేమన సంగీతాభిరుచి, గణికాలోలత్వము, గృహస్థధర్మము, భార్యను దండించుట, భార్యయందు తనకు గలిగిన సంతానముకూడ సుఖకరముగ బరిణమింపకపోవుట, ఇతని అన్నదానపరత, అతిథిపూజ, దారిద్ర్యము రసవాద విద్యాభ్యాస ప్రయత్నము, యోగులకోడి సాంగత్యము, లంబికాశివయోగి శుశ్రూష - ఈ మొదలైనవి వేమనజీవిత ప్రధాన విషయములలో గొన్ని. వేమన వేశ్యాలోలత్వమును గురించి వ్రాయుసందర్భమున మహాకవులను గురించి యిట్లనుచున్నారు. "శ్రీనాథుని నైషధము పంచకావ్యములలో పరిగణించినవారే అతడు స్త్రీలోలుడనియు నెఱుగుదురు. ఇవన్నియు న్యాయములని నేనె చెప్పరాలేదు. అది వేఱుమాట. మరి గొప్పవారందరును అన్నివిధములను గొప్పవారేయని భావించుట, వారియెడ దోషము అసంభవమని యనుకొనుట మన యవివేకమునే వెల్లడించునదియే నామతము. దోషములుండిన నష్టమేమి? అందువలన కష్టము లనుభవించినవారు వారు. మనము వారి గుణములచేత, మహత్త్వముచేత మేలు పొందవలసినవారము. వేమన పరనారీసహోదరుడై శుకమహర్షి యపరావతారమైయుండి, ఒకపద్యమును వ్రాయక, ఏమూలలోనో ముక్కుపట్టుకొని మురిగియుండిన మనము

సంతోషింపుచుంటిమా ? మన్నించుచుంటిమా ? వన్నె డిగిన వేమనవలె పద్యములు వ్రాయఁగలవాఁ డెవ్వఁడైన నేఁడు లభించునేని అతనికి గాలసియున్న మన మంటలను చందాలెత్తి వేయిమంది వేశ్యలను సంపాదింప వచ్చును."

నాలుగవ యుపన్యాసమున వేమనకాలమందలి మత ధర్మముల స్థితినిగుఱించియు, ఆయిదవ యుపన్యాసమున వేమనయోగసిద్ధి, మతప్రచారమును గుఱించియు వివరింప బడినవి. మతధర్మములనుగుఱించి వీరు వ్రాసినయుదంతము చాలహృదయాకర్షకముగ నున్నది. ద్వైతాద్వైతములు, సగుణనిర్గుణవాదములు మొదలగు సహజముగ క్లిష్టములుగ నుండు విషయములను వీరు అరటిపండొలిచి పెట్టినట్లు తేటతెల్లముగ వివరించియున్నారు. వేమనకాలము నాటికి మతములు, తద్విషయకములైన విద్యాసంస్థలు ఎట్లు నీరసిల్లి సంఘానర్థకరములుగ బరిణమించినవో చక్కఁగ తెలిపియున్నారు. ఆఱవ యుపన్యాసము 'వేమన వంటివారి'నిగుఱించి తెలుపుచున్నది. కర్ణాటకములో సర్వజ్ఞమూర్తియు, అరవవారిలో తిరువళ్లువరును అట్టివారిలో ముఖ్యులు. శర్మగారికి చక్కని కర్ణాటభాషా పరిచయ ముండుటచే గావచ్చును సర్వజ్ఞమూర్తినిగుఱించి ఎక్కువ గను, చక్కఁగను వ్రాసియున్నారు. వేమన్న కితఁడు "అచ్చుప్రతిబింబ"మట. సర్వజ్ఞుని త్రిపదులు (వేమన ఆటవెలదివంటి పద్యములు) సందర్భానుసారముగ నుదాహృతములైనవి. వేమనవంటివారుగ పరిగణితులైనవారు తెలుగువారిలో (౧) పోతులూరి వీరబ్రహ్మము (౨) ఆనంద వరదరాజయోగి (౩) ముళ్ళ్యాల నారసింహయోగులు. వీరుకాక తెలుగువారిలో ఏగంటివానిని గుఱించియు, కర్ణాటమున కన్నడవచనకారులనుగుఱించియు కొంత తెలిపియున్నారు.

వేమనకవిత్వము, హాస్యము, నీతులు మొదలగు వానినిగుఱించి ఏడవ యుపన్యాసము వివరించుచున్నది. వేమనభాషా కవిత్వాదులనుగుఱించి వీరి యభిప్రాయము లివి:—

"అనేకపద్యములందు ఆటవెలది నడకకును సీసపు నడకకును భేదమే యితఁడు గమనించినట్లు తోఁపదు. భాషావిషయమందును శుద్ధమైన శబ్దప్రయోగమునకుఁ గాని, సంధులను చక్కఁగ కలుపుటకుఁగాని యితఁడు ప్రత్యేకముగ పరిశ్రమించినట్లే తోఁపదు. అచ్చులకును వకార యకారములకును గల భేదమును పలుమా ఱితఁడు గమనింపలేదు. 'నముశివ యనవచ్చు నారాయణనవచ్చు' ఇత్యాది నిరర్గళ ప్రయోగములు పెక్కులు గలవు. ఇక అసభ్యములగు పదములు, అర్థములు లెక్కలేనివి".

"వేమన కవిత్వమందలి యసాధారణ గుణములలో ముఖ్యమైనది భావముల తీవ్రత. అవి యంత తీవ్రముగా నుండుటకు కారణము ఆ భావము లతనివే కాని యితరుల వి కాకపోవుట".

"తెలుగు ఛందస్సులలో నెల్ల చిన్నది యగు ఆట వెలఁది నితఁడు పరిగ్రహించె ననవచ్చును. కందములు, తేటగీత మొదలగు పద్యములుకూడ నితఁడు వాడినాఁడు గాని వానిలో చాలవఱకు ఈముద్దు, ఈచెక్కిన చక్కఁదనము, ఈబిగువు, ఈలనువు లేదు. దీనిలో ఇతఁడు యతికిచ్చిన మర్యాద, అందము అద్భుతమైనది".

"ఇతని కవిత్వమునకు కొంత మెఱుఁగుపెట్టి దానిని దుర్వార బలముగల దానినిగాఁ జేసినది హాస్యము."

"వేమన్నయు గొప్ప బోధకుఁడును, సంస్కర్తయుఁ గావున అతనియందును హాస్యరసము కలుషితమై యున్నను, అందందు సహజముగా అసభ్యరచనలు చేసినను తెగిన గాలిపటమువంటి స్వతంత్ర బుద్ధికలవాఁడు కావున ఒకొక్కమాఱు తనపని తాను మఱచి స్వచ్ఛమైన హాస్యముతో తృప్తి కలిగించుకొనును".

ఇట్టి వింకను అనేకములు కలవు.

వేమన గొప్పసంఘసంస్కర్త. సంఘదోష, దురాచారములను ఇతని వలె నిర్భయముగ ఖండించిన కవి తెలుగువారిలో అరుదు. ఇతని కొన్ని యభిప్రాయములు నేటికాలమునకుగూడ సరిపోవుచున్నవి.

ఒడలు బడలఁజేసి యోగుల మనువారు
మనసుకల్మషంబు మాన్పలేరు
పుట్టమీఁదఁగొట్ట భుజగంబు చచ్చునా !

నదులలందు పాడిపొదవులందును స్త్రీల
పెదవులందు రాజ్యపదవులందు
ఆశ లుడిగినట్టి యతులు ముక్తులు
రాతిబొమ్మ కేల రంగైన వలువలు
గుళ్లుగోపురములు కుంభములును
కూడుఁ గుడ్డఁ దాను గోరునా దేవుఁడు

సత్కార్యాచరణమును గురించి వేమన యభిప్రాయములు చాల చిత్రముగను, తీవ్రముగను నున్నవి. "సన్మార్గమున పరార్థముగ వెచ్చింపని ధనవంతుని ధనము" "సత్కార్యమునకై సెలవు చేసినను పాపము లే"దని వేమన నమ్మెననుటకు ఈ క్రింది పద్యము లుదాహృతములు:

తనదు సొమ్ము చూడ దాన మియ్యగవచ్చు
తనని దొడ్డగా దలఁచరికైన
నదరు బెదరు లేక అన్యుల సొమ్ముల
దాన మిచ్చువాఁడు దాత వేమ!

ద్రోహబుద్ధినైన దొంగతనమునైన
నటలనైన సాహసముననైన
సంపదధికులవలన సాధించి ధనమును
బడుగులకు నొసంగ బాగు వేమ!

దోపకారియైన దూసరికాఁడైన
పగతుఁడైన వేదబాహ్యుఁడైన
పట్టిలేని పేదవాని కీఁదగు నీవి
ధనికునకు నొసంగదగదు వేమ!

అవంతకృష్ణశర్మగారి 'వేమన కవిహృదయంగమ'మై, చదువ జదువ నింపులునింపుచున్నది. వీరిశైలి చాల సత్త్వముకలది. మనకు మీఁద ముద్రపడునట్లు చెప్పగలశక్తి దానికి కలదు; రచనంతమై యది నిండుజీవముతో తొణుకులాడుచుండును: నయముతోడి హాస్యమును, భావోక్తియు వీరిసొమ్ము. రచనలో ఈ లక్షణమే ప్రస్ఫుటముగ ప్రధానముగ వ్యక్తమగును.

ఆంధ్రవిశ్వవిద్యాలయమువా రిట్టిగ్రంథమును ప్రచురించినందుకు అభినందింపదగియున్నారు. కాని యీపుస్తకము "బైండింగు" మాత్రము విషయగౌరవమునకుగాని, ఆంధ్రవిశ్వవిద్యాలయ గౌరవమునకుగాని తగినట్టు లుండలేదని చెప్పవలసివచ్చినందుకు విచారించెదము.

మ. సో. శర్మ

---

## భక్త కుచేల

ఇది అప్పల వీరవెంకట జోగయ్యశాస్త్రిగారు రచియించిన ఆఱంకముల నాటకము. పేరునుబట్టి యిందలి యితివృత్తము తెలుసుకొనవచ్చును. భక్తశిఖామణియగు కుచేలుని చరిత్రమగుటచే యీనాటకమునకు గొప్ప. ఇందలి కవితారసము నింపుకపాఠకులు చవిచూడదగుదురు:

సీ. సతతంబు నీపాద సరసిజంబులనొత్త
    లేమయా శ్రీ యెట్టి నోముఁజేసె
నిరతంబు రసనోట నిన్నె స్మరింపంగ
    నారదుం డెట్టి పుణ్యంబుఁజేసె
నిత్యంబు తనమేను నీకు పాన్పుగఁజేయ
    భుజగరా జేమేమి పూజఁజేసె
సర్వవేళల తన స్కంధంబుపై నిన్ను
    దాల్పగ ఖగుఁడేమి తపముఁజేసె
గీ. నృపుఁడు, ప్రహ్లాదుఁడును, బలి యెట్టివ్రతము
సల్పి వారలు నీను దర్శనముఁ జేయ?
నహహ పక్షితురంగ! దయాంతరంగ!
విమలసద్భక్త హృత్పద్మభృంగ! రంగ!!

(ముందుకు నడచును.)

ఉ. భూరిగభీరమై జలధి
    భోల ననంత మగాధమౌచు భూ
భారము తెల్ల బంధురము
    భంగి శిరంబునఁ దాల్చు నాదిశే
షోరగుఁడైన సుంతయు న
    హో! ధరియింపఁగఁ జాలనట్టి సం
సారము నెత్తిపైఁ బడిన
    శీఘ్రమె కాంతలకున్ ధరింపఁగా!

మఱియు నిందు కుచేలుడు 'అర్భకుడని కలదు. పెక్కుస్థలముల 'అయినగురు పిల్లలతండ్రి'నిగా నిందులో కవి కుచేలుని వర్ణించెను.

'చలిసీలోవడదు', 'గురుబుజాము', 'సద్గోష్ఠి', 'అలక లల్లిన అనుమానము'(అలకలన్న ముంగురులుకదా, ముంగురుల నల్లుకొనుదురా ?), 'తమ్మివిలుతుడు', 'మహాత్మ్యము', 'బువ్వ రొండిపెట్టెద' ఇట్టివి చాలగలవు. అనావశ్యకము లగు పాత్రములు కొన్ని నాటకమున నెక్కినవి.

ఇట్టి నాటకముల యుత్పత్తి యనల్పస్యాయ ప్రయాసమూలకమె యగునుగాక, ప్రయోజన మల్పమే; తిరుచు అభావముకూడ నగును. నాటకప్రపంచము నీరసనాటకములతో నిండి కళాహీనముగ నుండుట విచారకరము.

---

## గండికోట

శ్రీ బాలభారతీ గ్రంథనిలయములోని మొదటి యనుబంధగ్రంథము. కర్త: జే. సుబ్బయ్యగారు, ప్రొద్దుటూరు, కడపజిల్లా. వెల రు. ౧-౮-౦ లు క్రౌను సైజు, అసలు పుస్తకము ౧౬ పుటలు.

గ్రంథకర్తగారు గండికోట క్షేత్రమును దర్శించినపుడు వారికి గలిగిన భావములసూర్పె యీగండికోట. గండికోట పూర్వవైభవమును స్మరించుకొని వ్రాసిన గీతమాలిక. సరసకథాకథనోచితమైన ఆఖ్యానశైలి కలదు గాని భావౌన్నత్యముగాని, రచనావైదగ్ధ్యముగని ఇందు కనరాదు. "ఆడుచుండిరి కాలము పాడుసేయు" అని యొక పాదము కలదు. అనగా కాలము గడుపుట అని కవిగారి యభిప్రాయమై యుండవచ్చును. చరిత్రాత్మకములైన కథానకములు వ్రాసి గ్రంథకర్త పేరు గాంచవలెనని మా యాశయము.

మ. సో. శ.

---

## ముప్పదియిద్దరు మంత్రులచరిత్రము

గ్రంథకర్త: కనుపర్తి మార్కండేయశర్మగారు:- స్వధర్మప్రకాశినీ పత్రికాసంపాదకులు, బృందావనం, కీల్పాకు, మద్రాసు; వెల రు ౦-౧౨-౦ క్రౌను సైజు, ౧౨౧ పుటలు.

ఇందు గోపరాజు రామప్రధాని, రాయనిమంత్రి భాస్కరుడు మొదలైన ముప్పదియిద్దరుమంత్రుల చరిత్రములు వివరింపబడినవి. ఆయా మంత్రులను సుతించిన చాటువులును, వారినిగుఱించి పరంపరగ తరతరముల నుండి వినవచ్చు కథలును ఇందు పొందుపఱుపబడియున్నవి. చక్కని పద్యములతోను, ఇంపయిన కథలతోను పుస్తకము చదువనగుతూహలము కలిగించును. శైలి సులభము. అందందు కొన్నిచోట్ల ముందు డిన మంత్రుల చరిత్రములు వెనుక, వెనుకనుండిన మంత్రుల చరిత్రములు ముందుపడినట్లు కాన్పించును. సుముసిద్ధిభూపాలుని సైన్యాధిపతిగనుండిన గణతిక్కనచరిత్రము ౫౦ వ పుటలోను, అనవేమమహీపాలుని కాలముననుండిన రాయని మంత్రిభాస్కరుని చరిత్రము మొట్టమొదటను గలదు. శక వర్షము ౧౦౬౮ నాటివాడని తెలియవచ్చు గోపరాజు రామప్రధాని చరితము ౨౪ వ పుటలో కలదు. ఇట్టివే యింకను గలవు. ఇది చరిత్రగ్రంథము కాకపోవుటచేత నీ వ్యత్యాసము లంత పాటింపదగినవి కావు కాని తెలిసి నంతవఱకు కాలక్రమము ననుసరించియే యీ చరిత్రములను పొందుపఱచుచువచ్చిన చాల ఉపయోగముగ నుండెడిది. ఈ సందర్భమున నొక విషయము చెప్పవలసియున్నది. ఈ చరిత్రము ౧౯౨౨ వ సంవత్సరపు ప్రథమసంస్కరణము పీఠికలో కృతజ్ఞతాభినందనము లొనరించుపట్టున నుండిన—

"మంత్రుల కాలనిర్ణయమును వ్రాసియిచ్చిన శ్రీయుత కొమఱ్ఱాజు వెంకట లక్ష్మణరావు గారియందు చాలకృతజ్ఞుడను"

అను వాక్యము ఈ ౧౯౩౦ వ సంవత్సరపు ద్వితీయముద్రణమున లోపించిపోయినది. ఇది యసమంజసము.

మ. సో. శ.

---

### గం గా వ త ర ణ ము

'పార్వతీ గర్వభంగము' అను నామాంతరముగల యేడంకముల యీనాటకమును శ్రీసోమరాజు రామానుజ రావుగారు రచియించినారు. వీరు దీనిని రచియించుటకు పూర్వము పెక్కునాటకములను రచియించినట్లు నాటక ముఖపత్రమున గలదు. ఈ నాటకము రంగూను ఆంధ్రజాతీయ నాటకసభకై రచియింపబడినది. లౌకికమగు చక్కనియితివృత్తము గలిగి, పాత్రోచితి గలిగి, రసపుష్టిగలిగి, చక్కని ప్రణీతమయి వెలసిన నాటకము వాఙ్మయమున కలంకారమయి, సంఘమున కుపదేశకమయి, నాటకకళకు వికాసమును గలిగించును. ఇట్టి నాటకము లాంధ్రవాఙ్మయమున చాలకొలది. 'కోటి విద్యలు కూటికొఱకే' కన్నట్లు ఉదరపోషణార్థమో, పేరు కొఱకో పుట్టిన నాటకసమాజముల కూతకజ్జలుగా జన్మించి క్షుద్రవయిపలకు యథోచితముగ జీవనాధారము లగుచున్న నాటకములుమాత్రము వందలకొలదిగ నున్నవి. ఈ నాటక మట్టివానిలోనిదే. ఇట్టి నాటకపరంపరయందలి ఇతివృత్తమును, పాత్రోచితిని, భావను, రసమును, కవితనుగూర్చి చర్చించుట పనికిమాలినపని; ధనార్జనోపాయముగ పరిణమించిన యీనాటకవర్తకము నరికట్టుట దుస్సాధ్యము. విద్యార్థికు లిట్టినాటకములను లెక్కచేయరు. వీని కిట్టిమర్యాదయే యుచితము.

---

## గ్రంథ స్వీ కా ర ము

### జ డ గం ట లు

(పద్మనాయక గ్రంథమాలా ద్వితీయకుసుమము.)

క్రౌను సైజున ౭౬ పుటలు. వెల ౦-౭-౦

మంచి కాగితములు ముద్దులొలుకు అచ్చు.

గ్రంథకర్త: చెలికాని సత్యనారాయణగారు.

పలయువారు:- మేనేజరు, పద్మనాయక గ్రంథమాల, పెంటపాడులపల్లె, రాజాం (విశాఖపట్టణము జిల్లా) అని వ్రాయవలయును.

---

### ౧. ఆయుర్వేదౌషధ రత్నాకరము

(ఆంధ్రతాత్పర్యసహితము)

డిమ్మీసైజు. ౩౨౮ పుటలు. వెల రు. ౩-౦-౦

గ్రంథకర్త: శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు.

### ౨. భస్మప్రకాశిక

(ఆంధ్రతాత్పర్యసహితము)

డిమ్మీసైజు, ౮౬ పుటలు, వెల రు. ౧-౦-౦

గ్రంథకర్త: శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు.

### 3. ఆంధ్రభైషజ్య రత్నావళి

(సాంధ్రతాత్పర్యము)

డిమ్మీసైజు, ౧౬౩ పుటలు, వెల రు. ౨-౦-౦

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి విరచితము. పైమూడు గ్రంథములు వలయువారు డాక్టరు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు, బెజవాడ, అని వ్రాయవలయును.

---

### శ్రీ ధవళేశ్వర చరిత్రము

క్రౌను సైజున ౨౭ పుటలు, వెల రు. ౦-౭-౦

గ్రంథకర్త:—వైద్యభూషణ, బొడ్డుపల్లి వెంకటరత్నశర్మగారు, ధవళేశ్వరము.

---

### దృఢవిశ్వాసము

క్రౌను, ౧౮ పుటలు. వెల తెలియదు. రచయిత: హరి లక్ష్మీనరసింహారావుగారు, కొవ్వూరు.

---

### పంచములచరిత్రము

పుటలు ౬౮, వెల రు. ౦-౮-౦.

గ్రంథకర్త: శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య జి. యస్. బి. సరస్వతీస్వాములవారు.

విలాసము: మేనేజరు, గోలకొండపత్రిక, త్రూపు బజారు, హైద్రాబాదు.

---

## హరిహరతారతమ్యం

క్రౌను సైజున ఫుటలు ౩౧, వెల రు. ౦-౪-౦.

శ్రీ హరదత్త శివాచార్య విరచితము.

విలాసము:—ఎడిటర్, ఆదిశైవ, శ్రీసరోకులాశ్రమము. చిరుమూరు, అవంతిపురం పోస్టు.

---

## గూఢార్థ సంగ్రహసహిత శ్రీభగవద్గీతా శాస్త్రము

క్రౌను సైజున ౬౩౦ ఫుటలు, కాలికో బైండు. వెల రు. ౨ ౪-౧.

శ్రీ పరమహంస సచ్చిదానంద యోగీశ్వర విరచితము. చిరునామా:—శ్రీ సచ్చిదానందర్ అండు కంపెనీ, పెరంబూరు బారక్సు పోస్టు, చెన్నపురి.

---

## ప్రభాతము

సాహిత్యసరస్వతి, వావిలాల గోపాలకృష్ణయ్యగారిచే విరచితము.

క్రౌను, ౯౬ ఫుటలు, వెల రు. ౦-౬-౦

ప్రకాశకులు:—భారతీగ్రంథమండలి, సత్తెనపల్లి.

---

## శరీరదేవాలయరహస్యార్థ పారిజాతము

శ్రీపరమహంసచ్చిదానంద యోగీశ్వరవిరచితము. క్రౌనుసైజు, ఫుటలు ౭౦, వెల, రు. ౦-౬-౦

దొరకుచోటు:—శ్రీ సచ్చిదానందర్ అండు కంపెనీ, పెరంబూరు, బారక్సుపోస్టు, చెన్నపురి.

---

## సవిమారసం దేశము

సోమంచి వాసుదేవరాయకృతము

క్రౌనుసైజున ౩౨ ఫుటలు, వెల రు. ౦-౪-౦.

పలయువారు గ్రంథకర్త పేర శ్రీకాకుళము, గంజాముజిల్లా అని వ్రాయవలయును.

---

## ఛందస్సు

'కళాప్రపూర్ణ' 'మహోపాధ్యాయ' వేదము వేంకటరాయశాస్త్రిగారిచే రచింపబడినది.

క్రౌనుసైజున ౩౪ ఫుటలు, వెల రు. ౦-౩-౦.

విలాసము: నెం. ౪. మల్లికేశ్వరవీథి, జార్జిటౌను, మదరాసు.

---

## ఉపదేశామృతము

ఫుటలు 76, వెల రు. ౦-౪-౦

రచయిత: శ్రీ మలయాళస్వాములవారు. ప్రకాశకులు:—టం. రామస్వామయ్యగారు: శ్రీ వేదవ్యాస ముద్రాక్షరశాల, చెన్నపురి.

---

## గ్రామపునర్నిర్మాణము

డిమ్మీసైజు, ఫుటలు 71, వెల తెలియదు.

సంపాదకుడు: శనివారపు సుబ్బారావుగారు. చిరునామా—కొవ్వూరు, పశ్చిమగోదావరిజిల్లా.

---

## అక్షరమాలిక

వెల రు. ౦-౧-౦

రచయిత: సాయం వరదదాసుగారు. ప్రకాశకులు టం. రామస్వామయ్యగారు, నెం. ౫౧, క్రిష్టప్పనాయ

వని అగ్రహారం వీధి, మింటు బిల్డింగు పోస్టు, మదరాసు.

---

### భూగోళములు

(మొదటి రెండు పుస్తకములు)

మొదటి రెండుఫారము విద్యార్థుల కుపయోగించునవి.

గ్రంథకర్త: గిడుగు వెంకటసీతాపతి పంతులుగారు, బి. ఏ., యల్. టి.

దొరకు చోటు:—ది ఇండియన్ పబ్లిషింగు హౌసు లిమిటెడ్, ౫. సుంకురామచెట్టి వీధి, మదరాసు

---

### భానుమతి

(సాంఘిక నవల)

డిమ్మీసైజు, పుటలు ౩౩౧, వెల రు. ౧-౭-౦

గ్రంథకర్త: యం. వి పాపన్నగుప్తగారు. వలయువారు మదనపల్లెకు గ్రంథకర్తగారికి పేర వ్రాసిన బడయగలరు.

---

## పత్రికాపరిచయము

### సుధ

(౧-౪ సంచికలు)

సంవత్సరచందా ఒకరూపాయి. సంపాదకులు: శ్రీ వి. కుటుంబరావుగారు; ప్రకాశకులు: శ్రీ డి. దేశికాచార్యులుగారు; 'సుధ' కార్యాలయము, తపాలపెట్టె నెం. ౨౮౬, మదరాసు.

---

### ఆనందబోధిని

(౧-౨ సంచికలు)

సంవత్సర చందా రు. ౧-౧-౧; సింగపూరు, పినాంగ్, మలేషియా ప్రాంతములందుండు వారలకు రు. ౧-౪-౦. ప్రకాశకులు:— యన్. మునుస్వామి మొదలియారుగారు; ఆనందబోధినీ కార్యాలయము, సాహుకార్ పేట, మదరాసు.

---

### పూలతోట

ప్రతిమాసము వెలువడుపత్రిక. సంవత్సరచందా రు. ౧-౨-౦.

విలాసము, మేనేజరు, పుష్పతోట గ్రంథమాల, నయీంనగర్, హనుమకొండ.

---

Printed and Published by G, Subbaramayya, at the Andhra Patrika Press, No.7, ThambuChettySt., Madras